# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

[illegible] 2007 | 71 | రు. 10

- ఫోకస్ : రాజకీయరంగంలో అవినీతి
  - మూడు వ్యాసాలు
- జాతీయతత్వం ఒళ్లో మతతత్వం
  - కొమర్రాజు రచనల పరిశీలన
- పచ్చటి పంట పొలాలపై జిందాల్ డేగ కన్ను
- ప్రత్యేక ఆర్థిక మండలాలు ఎవరికోసం?
- బాబ్లీ - తెలంగాణ

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి.సాంబశివరాజు

గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు:
వి. హనుమంతరావు
వర్కింగ్ ఎడిటర్:
ఎన్. వేణుగోపాల్

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

వార్షిక చందా: రు.120 | విడి ప్రతి : రు. 10 | 71 | జూన్ 2007


*సంపాదకీయం*

## మక్కా మసీదు సాక్షిగా మారణకాండ

మక్కా మసీదులో బాంబు పేలుడులో బలి అయిపోయిన ప్రాణాలు, ఆ తర్వాత పోలీసు కాల్పులలో బలి అయిపోయిన ప్రాణాలు పాతబస్తీలో మనిషి ప్రాణం ఎంత చౌక అయిపోయిందో, ఎంత సులభంగా రద్దు చేయడానికి వీలైనది అయిపోయిందో చూపుతున్నాయి. వేలాది మంది చేరే చోట దైవ ప్రార్థనలు జరిగే సమయాన బాంబు పేల్చి అమాయకుల ప్రాణాలు తీయాలని కుట్ర చేసినవారు, తమ వారిని పోగొట్టుకున్న దుఃఖంలో, ఆవేశంలో ఆందోళన చేస్తున్న వారిని చెదరగొట్టడానికి నేరుగా గురిపెట్టి కాల్చి చంపడం తప్ప మరొక మార్గం లేదనుకున్న వారు అందరూ మనిషి ప్రాణం పట్ల గౌరవం లేని వారే. మొదటి పని చేసి వారెవరో ఇప్పటికీ ఎవరికీ తెలియదు. ఎవరికి తోచిన ఊహాగానం వారు చేయవచ్చు. ఆ ఊహాగానాలలో ఏది వాస్తవమో సాక్ష్యాధారాలతో రుజువు చేయవలసిన బాధ్యత ప్రభుత్వ నేర పరిశోధక సంస్థలది. ఆ పని చేయకుండానే ఎవరో కొందరి పై ఆరోపణలు చేస్తూ అవే నిజాలన్నట్టు, మరింత పరిశోధన అవసరం లేదన్నట్టు ప్రవర్తిస్తున్నది ప్రభుత్వం. నిజానికి పాతబస్తీలో ప్రజలను ఎప్పుడూ భయం గుప్పిట్లో ఉంచి తామే రక్షకులం అన్న భావం కల్పించి తమ వెనుక నిలుపుకోవడానికి రాజకీయ పార్టీలు అటువంటి పని చేసిన చరిత్ర ఉంది. పాతబస్తీలో వ్యాపార సంస్థల మధ్య వచ్చిన ఆర్థిక తగాదాలు మతం రంగు పులుముకొని ఘర్షణలకు దారి తీసిన చరిత్ర ఉంది. ఒక ముఖ్యమంత్రిని మార్చడానికి, రాజకీయ సంక్షోభం సృష్టించడానికి పాతబస్తీలో రక్తం ఏరులై పారిన చరిత్ర ఉంది. ప్రస్తుతం కూడా ఆ కారణాలేవైనా ఉండవచ్చు. లేదా సొహ్రాబుద్దీన్ బూటకపు ఎన్‌కౌంటర్ నేపథ్యంలో రాష్ట్ర పోలీసు అధికారుల మీద, ప్రత్యేకించి పాతబస్తీ అధికారుల మీద జరగనున్న విచారణను పక్కదారి పట్టించడానికి కూడా ఇది జరిగి ఉండవచ్చు. గత దశాబ్దం పైగా పాతబస్తీలో అమాయకులెందరినో తీవ్రవాదులనీ, విదేశీ సంస్థలతో సంబంధం ఉన్నవారనీ ముద్రలు వేసి బూటకపు ఎన్‌కౌంటర్లలో చంపిన ఫలితంగా వారి బంధుమిత్రులలో రగులుకొన్న కసి ఈ రూపంలో బయటపడి ఉండవచ్చు. ఇన్ని రకాల కారణాలలో సరైన కారణాన్ని గుర్తించి నేరస్తులపై విచారణకు పూనుకోవల్సిన ప్రభుత్వ యంత్రాంగం ఆ పనిని విస్మరిస్తోంది. మరోవైపు నుంచి ఆ పేలుళ్లలో చనిపోయినంత మందినో ఇంకా ఎక్కువ మందినో ఆ రోజే జరిగిన పోలీసు కాల్పులు బలి తీసుకున్నాయి. పాశ్చాత్య ప్రజాస్వామిక సమాజాలలో వేలమంది, లక్షలమంది ఆందోళనకారులు గుమిగూడిన చోట్లలో కూడా హింసాత్మక ఆందోళనలకు దిగిన చోట్ల కూడా పోలీసు కాల్పులు జరపడం లేదు. గుమిగూడిన ప్రజలను చెదరగొట్టడానికి ఎన్నో నాగరిక మార్గాలున్నాయి. ప్రాణం తీయడం ఒక్కటే మార్గం కాదు. కాని, పేలుడు ద్వారా ప్రజలను భయభీతావహంలో ఉంచాలని కొన్ని వర్గాలు భావిస్తున్నట్టుగానే కాల్పుల ద్వారా ప్రజలను భయంతో అదుపులో ఉంచాలని ప్రభుత్వం భావిస్తోంది. రెండు సందర్భాలలోనూ సమస్య మతానిదో శాంతిభద్రతలదో కాదు. అంతకన్నా ముఖ్యమైనది ప్రజల ప్రాణాలపట్ల విలువలేని ఒక విలువల చట్రానిది. శిక్షాతీతమైన హంతక ప్రవృత్తిని పోలీసు వ్యవస్థలో పెంచి పోషించిన ప్రభుత్వం ప్రజలలో కూడ అదే ప్రవృత్తి పెరగడానికి కారణం అవుతోంది. అంతిమంగా పాలకులు ఏలుకోవడానికి శ్మశానాలు మిగులుతాయి. శ్మశానశాంతిలో ఎదురు చెప్పడానికి భయపడే జీవచ్ఛవ పౌరులు మిగులుతారు. ఇప్పుడు ఆలోచనాపరుల ముందున్న సమస్య ఇది. హత్యను ఇంత సులభం చేసిన పాలకవర్గ విలువలను ప్రశ్నించాలి. పరిశోధన లేకుండా ఒక వర్గాన్నో, మతాన్నో హంతకులుగా చూపే పాలకవర్గ సంస్కృతిని ఎదిరించాలి. 

# లోపలి పేజీల్లో...




## రాజకీయ రంగంలో అవినీతి

ఈ అవినీతికి మూలం ఏమిటి, ఇది ఎందువల్ల జరుగుతోంది, దీనివల్ల లాభపడుతున్నది ఎవరు, దీని వల్ల నష్టపోతున్న దేశ సంపద ఎంత, ఆ సంపదను ఉత్పత్తి చేస్తున్న శ్రమజీవుల న్యాయమైన వాటాను ఈ అవినీతిపరులు ఎట్లా దోచుకుపోతున్నారు, ఇటువంటి అవినీతి ప్రపంచ చరిత్రలో ఏ పర్యవసానాలకు దారితీసింది, వంటి చారిత్రక, సామాజిక, రాజకీయార్థిక పరిశీలన జరపవలసి ఉంది.

### రాజకీయ రంగంలో అవినీతి





**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 66843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై. రామచంద్రం 9949391028
కంపోజింగ్ & లే ఔట్ : సి. రాజశేఖర్
ఆఫీస్ అసిస్టెంట్ : వి. ఫణీంద్ర

'పత్రికా రంగం, పతనమవుతున్న విలువలు' అని నేను ఏప్రిల్ సంచికలో రాసిన వ్యాసానికి ఇండియన్ జర్నలిస్ట్ అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి స్పందన చదివాను – "నిజాయితీ ఉంటే వాస్తవాలతో ముందుకు రావాలని" కోరారు. కడుపు చించుకుంటే కాళ్లమీదపడుతుంది. ఇప్పటికే యూనియన్ విభేదాలు రచ్చకెక్కాయి. రాష్ట్ర యూనియన్‌లో భిన్నాభిప్రాయాలు, విభేదాలు ఉండటం అసహజమేమీ లేదు. అఖిల భారత నాయకునిగా, రాష్ట్ర యూనియన్‌లో అభిప్రాయ భేదాలు పరిష్కరించాల్సింది పోయి, పబ్లిక్‌గా చర్చనీయాంశం చేయటం మంచిది కాదు. ఇప్పుడైనా ఆ పని చేయగలిగితే సంతోషిస్తా. యూనియన్ స్థాపించిన నాటి నుంచి నాయకత్వం వహించిన సీనియర్ జర్నలిస్టుల సహకారం తీసుకొంటే ఇంకా మంచిది. ఇది యూనియన్ స్వర్ణోత్సవ సంవత్సరం – అదే సంవత్సరంలో విభేదాలు ఏర్పడటం దురదృష్టకరం. ఈ ఉత్సవాన్ని ఘనంగా జరుపుకోవాల్సిన సమయం. అఖిలభారత ఉద్యమ నిర్మాతలు, ప్రముఖులు చలపతి రావు, కోటంరాజు రామారావు, పున్నయ్య లాంటి వారందరినీ సంస్మరించుకోవాల్సిన సమయం. ఆ సమయాన్ని చేజారిపోనివ్వవద్దని మిత్రుడు, సహజర్నలిస్ట్ శ్రీనివాస్ రెడ్డిని కోరుతున్నాను.

**– వి. హనుమంతరావు**
హైదరాబాద్

## పాఠకుల వీక్షణం

ఏప్రిల్ సంచికలో వి. హనుమంతరావు గారు రాసిన 'పత్రికా రంగం – పతనమవుతున్న విలువలు' వ్యాసం, దాని మీద మే సంచికలో జర్నలిస్టుల సంఘం నాయకులు కె. శ్రీనివాసరెడ్డి గారు రాసిన ఉత్తరం చూస్తే అసలు విషయం మీద చర్చ పక్కదారి పడుతున్నట్టు కనిపిస్తోంది. ఇంతకీ అసలు విషయం మార్గదర్శి ఫైనాన్షియర్స్ పేరు మీద జరిగిన ఆర్థిక కుంభకోణం, దాని మీద చర్చను పక్కదారి పట్టించడానికి ఆ సంస్థ యజమాని పత్రికా స్వేచ్ఛను కవచంగా వాడుకోవడం. వీక్షణం ప్రధాన సంపాదకులు రాసిన వ్యాసంలోనే ఈ అసలు విషయం పక్కకుపోయి, కొంత వైఎస్ రాజశేఖర రెడ్డి భజన, సమర్థన కూడా జరిగాయి. సీనియర్ పాత్రికేయులు, ప్రజాపక్ష పత్రిక నిర్వాహకులు అయిన హనుమంతరావు గారి నుంచి ఇటువంటి సమర్థన రావడం ఆశ్చర్యకరం. రామోజీరావునో, మార్గదర్శినో తప్పు పట్టేందుకు వైఎస్‌ను పొగడనక్కర లేదు. ఆ ఇద్దరూ దొందూ దొందే.

**– కె. వెంకటేశ్వర రెడ్డి**
కర్నూలు

మే నెల వీక్షణంలో ప్రచురించిన ఎస్. నారాయణమ్మ, నెల్లూరు గారి ఉత్తరం చదివాను. వారు రాసినట్టుగా వీక్షణం ఈ మధ్య ఎకడమిక్‌గా తయారయిందని మేము అనుకోవటం లేదు. ఎకడమిక్ అన్న పదానికి ప్రస్తుతం వాడుకలో ఉన్న అర్థం వేరు. అసలు అర్థం వేరు. అసలు అర్థం ప్రకారం ఎకడమిక్ అంటే ఏదయినా ఒక విషయం గురించి అన్ని కోణాలలో కూలంకషంగా పరిశీలించటం. కాని ఇటీవల మన విశ్వవిద్యాలయ ప్రొఫెసర్లు, పరిశోధకులు ఎకడమిక్ అన్న మాటను భ్రష్టు పట్టించారు. ప్రజలకు అర్థం కాకుండా రాయటం, సమస్యను అన్ని కోణాల నుంచి పరిశీలించకపోవటం చేస్తున్నారు. నారాయణమ్మ గారు ఆ అర్థంలో ఎకడమిక్ అన్న పదాన్ని వాడినట్టున్నారు. వీక్షణం పత్రిక సరైన అర్థంలో ఎకడమిక్ రచనలు వేయాలని మేం కోరుతున్నాం. పొరపాటు అర్థంలో ఎకడమిక్ రచనలు కొన్ని అచ్చయినమాట నిజమే. అటువంటివి తగ్గించవలసిందిగా కోరుతున్నాం.

**– ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు**
హైదరాబాద్

వీక్షణంలో ఫోకస్‌గా వస్తున్న వ్యాసాలు వివరంగానూ సమాచారాన్ని ఇచ్చేవిగానూ మరిన్ని వ్యాసాలతోనూ వస్తే పాఠకులకు ఎక్కువ ఉపయోగకరం. ఫోకస్‌గా వచ్చిన వ్యాసాల్లో కొన్ని మరీ పలుచగా, పైపైన తేలిపోతున్నాయి.

**– ఎన్. రవి**
వరంగల్

వీక్షణంలో విద్య, వైద్యరంగాలపైనా, బాలకార్మికులపైనా, మాయమవుతున్న చేతివృత్తులవారి జీవన స్థితిగతులపైనా వ్యాసాలు వేస్తే బాగుంటుంది. క్షేత్రస్థాయి పరిశోధనలతో కూడిన వ్యాసాలు, రిపోర్టులు వేయగలిగితే ఆసక్తికరంగా ఉంటుంది.

**– పి. పోచయ్య**
కామారెడ్డి

## రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

- సంపాదకులు

## చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

**– సర్క్యులేషన్ మేనేజర్**
9949391028

## ఉత్తర ప్రదేశ్ ఎన్నికలు

| | | |
|---|---|---|
| మొత్తం స్థానాలు | 403 | |
| ఎన్నికలు జరిగినవి | 402 | |
| బిఎస్‌పి | 206 | (67) |
| ఎస్‌పి | 97 | (152) |
| బిజెపి కూటమి | 51 | (83) |
| కాంగ్రెస్ కూటమి | 22 | (15) |
| ఇతరులు, స్వతంత్ర | 26 | |

(బ్రాకెట్లలో ఉన్నవి రద్దయ్యేనాటికి పార్టీల బలం)

ఒక దశాబ్ద కాలంగా రకరకాల రాజకీయ సంకీర్ణాలతో, రాజకీయ అస్థిరతతో ఊగిసలాడుతున్న ఉత్తరప్రదేశ్ ఓటర్లు ఈసారి బిఎస్‌పి కి స్వంతంగా ప్రభుత్వమేర్పరచడానికి కావాల్సిన బలాన్ని ఇచ్చారు. 206 సీట్లతో మాయావతి 50 మంది మంత్రివర్గంతో మే 13న ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసారు. ఆమె నాలుగోసారి ముఖ్యమంత్రి పదవి చేపట్టిన ఏకైక మహిళగానూ, దళిత మహిళగానూ చరిత్రలో నిలిచిపోతారు.

ఈ ఎన్నికల్లో ఆమె బహుజన వ్యూహం నుంచి సర్వజన వ్యూహంగా బ్రాహ్మణ - దళిత - ముస్లిం ఐక్యత వ్యూహాన్ని అనుసరించారు. 'హాథీ నహీ, గణేశ్ హై, బ్రహ్మ-విష్ణు-మహేష్ హై', 'బ్రాహ్మణ్ శంఖ్ బజాయేగా, హాథీ ఆగే బఢ్తే జాయేగా' లాంటి నినాదాలిచ్చారు. 'తిలక్, తరాజు ఔర్ తల్వార్, ఇన్‌కో మారో జూతే చార్' లాంటి నినాదాలకు భిన్నంగా ఈ ఎన్నికల్లో వ్యూహాన్ని అమలు చేయడం గమనార్హం. 11 కోట్ల ఓటర్లున్న ఉత్తరప్రదేశ్‌లో కేవలం 46 శాతం మంది తమ ఓటు హక్కు వినియోగించుకోవడం కొసమెరుపు. ఈ ఎన్నికల ఫలితాలు ప్రజల చైతన్యంలో వచ్చిన మార్పుకు సూచీగా నిలుస్తాయి.

## కళాకారుల స్వేచ్ఛపై దాడి

మే 9న వడోదర ఎం.ఎస్. యూనివర్సిటీ పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థి, ఆర్టిస్ట్ ఎస్. చంద్రమోహన్ పెయింటింగ్స్ మతభావాలు కించపరిచేవిగా ఉన్నాయంటూ అరెస్ట్ చేశారు. ఆ యూనివర్సిటీ సాంస్కృతిక శాఖ డీన్‌ను సస్పెండ్ చేశారు. నీరజ్ జైన్ అనే బిజెపి కార్యకర్త, కొంతమంది విహెచ్‌పి కార్యకర్తలతో జహంగీర్ ఆర్ట్ గ్యాలరీ లో సృష్టించిన గలాటాయే దీనికి భూమిక. ఇది జరిగిన దరిమిలా దేశవ్యాప్తంగా ముఖ్యంగా ఢిల్లీ, కోల్కత్తా, ముంబాయి, బెంగళూరు వంటి నగరాల్లో ఉవ్వెత్తున నిరసనలు వ్యక్తమయ్యాయి. అరుంధతి రాయ్ వంటి ప్రముఖ రచయితలూ, ఆర్టిస్టులు తమ నిరసనను వ్యక్తపరిచారు. నిన్న ఎం.ఎఫ్. హుసేన్ నేడు ఎస్. చంద్రమోహన్ పైన ఇటువంటి దాడులు జరగడం శోచనీయం.

## సొహ్రాబుద్దీన్ 'ఎన్‌కౌంటర్' - గీతాజోహ్రీ

సొహ్రాబుద్దీన్ నకిలీ ఎన్‌కౌంటర్ గుట్టు రట్టు చేసిన గుజరాత్ ఐ.జి. గీతాజోహ్రీ 'పోలీసులందు నీతివంతులు వేరయా...' అని నిరూపించారు. గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడిని హత మార్చేందుకు వచ్చిన తీవ్రవాదిగా ముద్ర వేసి గుజరాత్, రాజస్థాన్‌లకు చెందిన ఎ.టి.ఎస్. పోలీసులు సొహ్రాబుద్దీన్‌ను కాల్చివేశారు. అతని భార్యను హతమార్చి సాక్ష్యాలు లేకుండా దహనం చేశారు. అయితే సొహ్రాబుద్దీన్ పైచేసిన ఆరోపణలు సరైనవి కావని గీతాజోహ్రీ తన మధ్యంతర నివేదికలో వెల్లడించారు. దీనికి కారకులైన ఐ.పి.ఎస్. డి.జి వంజారా, ఎస్.పి. రాజ్‌కుమార్ పాండ్యన్, ఎస్.పి. దినేష్ కుమార్‌లను తప్పని పరిస్థితిలో అరెస్టు చేయాల్సి వచ్చింది. సుప్రీంకోర్టు ఈ నేర పరిశోధనకు గీతాజోహ్రీనే నియమిస్తూ తాజాగా ఉత్తర్వులు జారీచేసింది.

## న్యాయమేనా?

'ఒక పత్రిక లేదా పుస్తకం లేదా పత్రంపై నిషేధం విధించడం పౌరహక్కులను అతిక్రమించడమేననేది వాస్తవమే. అయితే ప్రజా ప్రయోజనాల దృష్ట్యా నిషేధం విధించడం సమంజసమే' అని సుప్రీం కోర్టు న్యాయమూర్తులు జస్టిస్ బి.పి. సింగ్, జస్టిస్ ఎచ్.ఎస్. బేడిలతో కూడిన ధర్మాసనం అభిప్రాయపడింది. బసవేశ్వరుడిపై రాసిన 'ధర్మకారణ' అనే కన్నడ నవలపై కర్ణాటక ప్రభుత్వం విధించిన నిషేధాన్ని సుప్రీం కోర్టు సమర్థించింది. ప్రభుత్వం విధించిన నిషేధాన్ని నవలా రచయిత పి.వి. నారాయణ, మరికొందరు కర్ణాటక హైకోర్టులో సవాలు చేయగా హైకోర్టు కూడ ప్రభుత్వ నిర్ణయాన్ని సమర్థించింది.

## నక్సల్బరీకి నలభై ఏళ్లు!

1967 మే 23 నుంచి 25 వరకు డార్జిలింగ్ జిల్లా సిలిగురి డివిజన్‌లోని నక్సల్బరీ, ఖేరీబరి గ్రామాలలో పదివేల మంది సంతాల్ ఆదివాసులు జంగల్ సంతాల్, కానూ సన్యాల్ మొదలైన వారి నాయకత్వంలో విస్తారంగా పరుచుకుని ఉన్న నేలపై సంప్రదాయ ఆయుధాలతో గుమిగూడి ఈ భూమిపై అధికారం మాది అని ప్రకటించారు. అప్పటి ఘర్షణలో ఒక పోలీసు అధికారి చనిపోయారు. ఆ భూమి నుంచి ఆదివాసులను బేదఖల్ చేయడానికి నక్సల్బరీ రైల్వేస్టేషన్ నుంచి పశ్చిమ బెంగాల్ ప్రభుత్వ పోలీసులు, కేంద్రపోలీసు బలగాలు కాల్పులు జరుపగా పదకొండు మంది మరణించారు. వారిలో ఏడుగురు స్త్రీలు, నలుగురు పిల్లలు, అందరూ ఆదివాసులే. అప్పుడు పశ్చిమ బెంగాల్ ప్రభుత్వంలో ఉప ముఖ్యమంత్రి, హోంమంత్రి జ్యోతిబసు. అదే కాలంలో సిలిగురి డివిజన్ సిపిఐ(ఎం) కార్యదర్శిగా ఉన్న చారుమజుందార్ నక్సల్బరీ, ఖేరీబరి మొదలైన ప్రాంతాల్లో ఆదివాసులకు భూ స్వాధీనం చేసుకోమని పిలుపునిచ్చారు. అట్లా ప్రారంభమైంది నక్సల్బరీ పోరాటం. ఈ పోరాట ఫలితంగానే 1969 ఏప్రిల్ 22 లెనిన్ శతజయంతి రోజు చారుమజుందార్ ప్రధాన కార్యదర్శిగా సిపిఐ-ఎంఎల్ ఏర్పడింది. నక్సల్బరీ పంథాను బలపరిచే వారందరినీ అప్పటి నుంచి నక్సలైట్లుగా పిలుస్తున్నారు.

## ప్రజా ప్రతినిధులా? కటారాలా?

మనుషుల అక్రమ రవాణాలో తిలా పాపం తలా పిడికెడన్నట్లు దేశస్థాయి నుంచి, రాష్ట్రస్థాయి వరకూ ఢిల్లీ నుంచి గల్లీవరకూ, మంత్రుల నుండి కార్పోరేటర్‌ల వరకూ ఉండడం చూస్తే అక్రమ సంపాదనపై ఉన్న మోజు, అక్రమ ఆస్తులు పోగు చేసుకోవడం పై ఉన్న పేరాశ ఏ స్థాయిలో ఉన్నదో అర్థమవుతుంది. పార్లమెంట్‌లో ప్రశ్నలడగడానికి డబ్బులు తీసుకున్న ఎంపీలు, మనుషుల రవాణాలో లక్షలాది రూపాయల ఒప్పందాలు చేసుకున్న 'ప్రజా ప్రతినిధుల'తో నిండి పోయింది మన వ్యవస్థ. భాజపా ఎంపీ బాబూభాయ్ కటారా తన భార్యంటూ వేరొక మహిళను విదేశాలకు అక్రమంగా తరలిస్తూ విమానాశ్రయంలో పట్టుబడ్డాడు. మన రాష్ట్రం నుంచి తెరాస (అసమ్మతి) ఎమ్మెల్యే కాసిపేట లింగయ్య, బోథ్ ఎమ్మెల్యే సోయం బాపురావులు మనుషుల అక్రమ రవాణా కేసులో అరెస్ట్ అయ్యారు. ఎం.పి. ఎ. నరేంద్ర పైన కూడా ఆరోపణలు వచ్చాయి. కటారా వెనుక ఉన్న సూత్రధారులు రాషెద్, గంపా రాజేంద్రకుమార్, కిరణ్‌ధార్‌లు మనరాష్ట్రానికి చెందినవారు కావడం గమనార్హం. సందర్భమొచ్చినప్పుడు మరెన్ని నిజాలు వెలుగు చూస్తాయో, వేచి చూడాల్సిందే.



## మందకృష్ణ ఆమరణ నిరాహార దీక్ష

ఎస్.సి. రిజర్వేషన్ వర్గీకరణను పునరుద్ధరించాలని, ఈ విద్యా సంవత్సరం నుంచే తిరిగి అమలు చేయాలని ఎం.ఆర్.పి.ఎస్. అధ్యక్షులు మందకృష్ణ మాదిగ మే 17 నుంచి ఆమరణ నిరాహార దీక్షకు పూనుకున్నారు. అఖిలపక్షం హామీ మేరకు మే 22న దీక్ష విరమించారు. రాష్ట్ర వ్యాప్తంగా ఎం.ఆర్.పి.ఎస్. కార్యకర్తలు, సంఘీభావ సంఘాలు తమ నిరసనలను పలు రూపాల్లో వ్యక్తపరిచారు.

## మక్కా మసీదులో బాంబు పేలుడు



హైదరాబాద్ మక్కా మసీదులో శుక్రవారం మే 18న జరిగిన బాంబు పేలుడు సంఘటనలో ఆరుగురు చనిపోయారు. అనంతరం జరిగిన అల్లర్లలను అదుపులో పెట్టడానికి జరిపిన పోలీసు కాల్పుల్లో తొమ్మిది మంది చనిపోయారు. నలభై మందికి పైగా క్షతగాత్రులయ్యారు. విద్రోహులు పెట్టిన మూడు బాంబుల్లో కేవలం ఒకటి మాత్రమే పేలడం, అది కూడా రాతిపలకల మాటున ఉండడం వలన ప్రాణనష్టం తగ్గిందని భావిస్తున్నారు. ఈ క్రమంలో ప్రజలు గొప్ప సామరస్యంతో వ్యవహరించారు.

## కంచే చేను మేస్తే...

విశాఖ రూరల్ ఎస్పీ మురళి అవినీతి ఆరోపణలతో ఏప్రిల్ 28న అరెస్ట్ అయ్యారు. ఎస్పీ బంగ్లా నుంచి రు. 1.47 లక్షల నగదు, 22 తులాల బంగారం, కొంత వెండి, లాకర్ తాళాలు, కుమారులకు వ్యాపారంలో పది లక్షల పెట్టుబడికి ఆధారాలు దొరికాయి. ఇప్పటివరకూ అరవై లక్షల విలువైన ఆస్తులు బయటపడ్డాయి. ఎస్పీ మురళికి ప్రభుత్వంలోని ఉన్నత స్థాయి వ్యక్తులతో ఆర్థిక లావాదేవీలున్నాయని, కొన్ని కీలక పత్రాలు సోదాలో బయటపడ్డాయని తెలుస్తోంది.

## తవ్వే కొద్దీ అవినీతి

కూకట్‌పల్లి (హైదరాబాద్) టౌన్‌ప్లానింగ్ అధికారి రామ నర్సింహ్మారావు ఆదాయానికి మించి ఆస్తులు కూడబెట్టారని, అవినీతికి పాల్పడు తున్నారని ఫిర్యాదులందుకున్న అవినీతి నిరోధక శాఖ అధికారి ఎఆర్ శ్రీనివాస్ నేతృత్వంలో సోదాలు జరపగా బయటపడిన ఆస్తుల చిట్టా : నగదు – రు. 73.6 లక్షలు, కూకట్‌పల్లి, అల్వాల్, ఉప్పల్, మియాపూర్, హాఫీజ్‌పేట, మేడ్చల్, హన్మకొండ ప్రాంతాల్లో 17 ఇళ్ల స్థలాలు. సిఖ్ విలేజ్, హబ్సిగూడలో రెండు ఫ్లాట్లు, వరంగల్‌లో రెండు ఇళ్లు, కీసరలో నాలుగెకరాల మెట్టభూమి, నిజామాబాద్ జిల్లా సదాశివనగర్‌లో మరో నాలుగెకరాలు, వరంగల్‌లోని జెపిఎన్ రోడ్డులో ఓ షాపింగ్ కాంప్లెక్స్, రు. 6 లక్షల ఫిక్సడ్ డిపాజిట్లు, 50 తులాల బంగారం.

## ఇంటర్మీడియట్ ఫలితాలు

7,31,939 మంది ఇంటర్మీడియట్ పరీక్షలు రాయగా, అందులో 5,47,747 మంది రెగ్యులర్ విద్యార్థులు.

3,43,071 విద్యార్థులు ఉత్తీర్ణులయ్యారు. ఉత్తీర్ణత శాతం 63, ఇందులో బాలురు 61 శాతం, బాలికలు 65 శాతంగా ఉన్నారు.

జిల్లాల వారీగా ఎగువశ్రేణిలో చిత్తూరు 78 శాతం, కృష్ణా 73 శాతం తో ఉండగా, దిగువశ్రేణిలో ఆదిలాబాద్ 35 శాతం, విజయనగరం 42 శాతంగా ఉన్నాయి.

## పదవ తరగతి ఫలితాలు

12.38 లక్షల మంది విద్యార్థులు పదవ తరగతి పరీక్షలు రాయగా, అందులో 7.8 లక్షల మంది విద్యార్థులు ఉత్తీర్ణులయ్యారు.

ఉత్తీర్ణత శాతంలో రెగ్యులర్ విద్యార్థులు 71.65 శాతం ఉండగా, ప్రైవేట్ విద్యార్థులు 38.16 శాతంగా ఉన్నారు.

బాలురు 71.5 శాతం, బాలికలు 71.8 శాతం ఉత్తీర్ణులయ్యారు.

జిల్లాల వారీగా ఎగువశ్రేణిలో పశ్చిమ గోదావరి 86.03 శాతం, నిజామాబాద్ 83.9 శాతం తో ఉండగా, దిగువశ్రేణిలో అనంతపురం 53.46 శాతం, నల్గొండ 59.16 శాతంగా ఉన్నాయి.

# కొత్తపుస్తకాలు




- **ధిక్కారం** – సామ్రాజ్యవాద వ్యతిరేక కవిత్వం – సద్దాం కోసం – వరంగల్ రచయితల సంఘం ప్రచురణ, 71 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : ఎన్. వెన్నెల, 7-1-384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్ జిల్లా – 506011. ఫోన్ : 9989415571
- **సింగరేణి – పరిణామాలు – పర్యవసానాలు** – పిట్టల రవీందర్ – తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురణ, 76 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : సహచర బుక్ మార్క్, దిశ పుస్తక కేంద్రం, కుశల పుస్తక నిలయం
- **కవితా వార్షిక 2006** – సృజన లోకం ప్రచురణ, 207 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు – రామా చంద్రమౌళి, 11-24-498, టెలిఫోన్ భవన్ లేన్, పోచమ్మ మైదాన్, వరంగల్ – 506002. ఫోన్ : 9390109993, విశాలాంధ్ర, నవోదయ, ప్రజాశక్తి, దిశ పుస్తక కేంద్రాలలో లభించును
- **రాత్‌పైలీ... దివస్ పైలీ** – ఆడెపు లక్ష్మణ్ – మానేరు రచయితల సంఘం ప్రచురణ, 62 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : ఆడెపు లక్ష్మణ్, 8-6-71, నెహ్రూనగర్, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా; పత్తిపాక మోహన్, 5-4-47, పత్తిపాక వీధి, సిరిసిల్ల, కరీంనగర్.
- **ఇదీ జీవితం** – కవిత్వం – పి. శ్రీనివాస్ గౌడ్ – సంధ్య ప్రచురణలు, 95 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : పి. శ్రీనివాస్ గౌడ్, రైస్ మిల్ ఎదురు, స్వర్ణగేటు వద్ద, చీరాల – 523155. ప్రకాశం జిల్లా, ఫోన్ : 9440235614
- **జీవనసమరం** – ఎం.వి. తిరుపతయ్య – ఎంవి పబ్లికేషన్స్ ప్రచురణ, 282 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా, కాచిగూడ క్రాస్ రోడ్స్, హైదరాబాద్ – 500 027. ఫోన్ : 24652387
- **తెలుగు పద్యమూ – మానాన్న** – కోట పురుషోత్తం – తెలుగు భాషోద్యమ సమితి ప్రచురణ, 99 పేజీలు – 1/8 డెమీ. రు. 50 , ప్రతులకు: శ్రీమతి రాటకొండ కల్పన, ఎం.ఎ; బి.ఇడి., కీర్తి కోవెల, 9-66-15ఎ, న్యూమారుతినగర్, ముత్యాలరెడ్డిపల్లె, తిరుపతి – 517502. ఫోన్ : 0877 – 2240803, 9440271699
- **స్టేట్ అండ్ సోషలిజమ్** – ఎట్ ది డాన్ ఆఫ్ ది 21 సెంచురీ – డి పాపారావు, చైతన్య పబ్లికేషన్స్, 24 పేజీలు – 1/8 డెమీ. రు. 20, ప్రతులకు : డి పాపారావు, ఎ-89, జర్నలిస్ట్ కాలనీ, జూబ్లి హిల్స్, హైదరాబాద్ – 500 033. ఫోన్ : 9866179615, విశాలాంధ్ర బుక్ హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్.
- **ఎ గైడ్ టు ఎపి వ్యాట్ యాక్ట్ 2005** – టి. వివేక్, టి.ఎస్.వి. దివాకర్ – సెంటర్ ఫర్ ఆల్టర్నేటివ్ రిజల్యూషన్ ఆఫ్ డిస్ప్యూట్స్ ప్రచురణ, 433 పేజీలు, 1/8 డెమీ, రు. 400, ప్రతులకు – సెంటర్ ఫర్ ఆల్టర్నేటివ్ రిజల్యూషన్ ఆఫ్ డిస్ప్యూట్స్, 303, మూడవ అంతస్తు, జమునా టవర్స్, మలక్‌పేట, హైదరాబాద్ – 500036. ఫోన్ : 24551736
- **బతుకుపోరు** – తెలంగాణ నవల – బి.ఎస్. రాములు, విశాల సాహిత్య సామాజిక అకాడమి – తాత్విక విశ్వవిద్యాలయం ప్రచురణ, 119 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: విశాల సాహిత్య సామాజిక అకాడమి – తాత్విక విశ్వవిద్యాలయం 2-2-186/53/5, రామకృష్ణ నగర్, బాగ్‌అంబర్‌పేట, హైదరాబాద్ – 500 013. ఫోన్ : 55164929, 9391036987

**జిందాల్ అల్యూమినియం పరిశ్రమ ఆదివాసులను నిర్వాసితులను చేస్తూ, ఆదివాసి ప్రాంతాల్లో విదేశీ పారిశ్రామికవేత్తల, ఆదివాసేతరుల ప్రయోజనాలను కాపాడుతుందంటున్నారు జి. రమేష్**

# పచ్చటి పంట పొలాలపై జిందాల్ డేగకన్ను

అవి కోనసీమను తలపించే గ్రామాలు. దశాబ్దాలపాటు ఆదివాసీలు శ్రమించి సృష్టించుకున్న పల్లెసీమలు. కానీ పారిశ్రామిక ప్రగతి రథ చక్రాల కింద నుజ్జునుజ్జయి పోబోతున్నాయి. మీ ప్రగతి కోసమే మేమంటూ బాసలు చేసి గద్దెనెక్కిన ప్రభుత్వం బడాపారిశ్రామికవేత్తల పక్షం వహించింది. అధికారులూ వారికే వత్తాసు పలుకుతున్నారు. వారేమో తమ పబ్బం గడిస్తే చాలునని, జనమేమైపోయినా ఫర్వాలేదనే రీతిలో వ్యవహరిస్తున్నారు. ఫలితం అంతా గోప్యం. తమ చుట్టూ ఏం జరుగుతుందో అక్కడి రైతులకే తెలియని అయోమయ పరిస్థితి. తాము సాగు చేస్తున్న భూముల్ని లాక్కోబోతున్నారని తెలిసీ ఏమీ చేయలేని పరిస్థితి. ఇది జిందాల్ అల్యూమినియం పరిశ్రమ తీరు. నోటీసుల్లో పారదర్శకత లేకుండా, సేకరించనున్న భూములకు సరైన పరిహారం ప్రకటించకుండా విజయనగరం జిల్లా ఎస్.కోట మండలంలో సాగుతున్న ఈ వ్యవహారంపై ప్రజలకు, ప్రజాస్వామిక శక్తులకు తెలియ జేయటమే ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశ్యం.

విశాఖ ఏజన్సీలో బాక్సైట్ తవ్వకాలకూ, అల్యూమినియం ప్లాంట్ ఏర్పాటుకూ జిందాల్ కంపెనీకి రెండేళ్ల కిందటే రాష్ట్ర ప్రభుత్వం అనుమతిచ్చింది. 240 మిలియన్ టన్నుల బాక్సైట్ నిక్షేపాలను వారికి కేటాయించడం తీవ్ర వివాదాస్పదమైంది. ఆ నిరసనలూ, ప్రజా ఆందోళనలూ చల్లారక ముందే ఇపుడు కర్మాగారానికి గుట్టు చప్పుడు కాకుండా భూమిని సేకరించడం మొదలుపెట్టింది. విశాఖకు యాభై కిలోమీటర్ల దూరంలో విజయనగరం జిల్లా శృంగవరపు కోటలో దీనికి భూమినివ్వడానికి ప్రతిపాదనలు సిద్ధమయ్యాయి. ఇక్కడకు బాక్సైట్ నిక్షేపాలు ఉన్న ప్రాంతం దగ్గరవుతుంది. మొదట్లో ఎస్.కోట వద్ద లక్ష్మీపురం, జాజిరిలోవ, మూలబొడ్డవర, చినబొడ్డవర గ్రామాల సమీపంలోని ఖాళీ భూముల్ని దీనికి ఇవ్వాలనుకున్నారు. వాటి విలువ తక్కువ. అక్కడక్కడ జీడి తోటలు మాత్రమే ఉన్నాయి. మిగిలినవన్నీ వృథా భూములే. అంతవరకూ బాగానే ఉన్నా, అక్కడి కిల్తంపాలెం, మూలబొడ్డవర, ముషిడిపల్లి పంచాయితీల పరిధిలోని పదిహేను గ్రామాల పై జిందాల్ కంపెనీ కన్నేసింది. కాటెయ్యబోతోంది. పచ్చగా కళకళలాడుతున్న ఆ భూముల్ని కర్మాగారం కోసం ఇవ్వాలని అడిగారు. మొదట్లో 900 ఎకరాలు వరకూ ఇవ్వాలనుకున్నా, ఇప్పటికే 1482 ఎకరాల భూముల్ని ఇవ్వడానికి రంగం సిద్ధమయ్యింది. జిందాల్ సంస్థ మాత్రం ఇంకా కావాలంటోంది.

నిజానికి జిందాల్ కంపెనీ అడిగినవన్నీ చాలా సారవంతమైన భూములు. 60 శాతం భూములు ఆదివాసులవే. చెరకు, అరటి, కొబ్బరి, వరి వంటి పంటలున్నవే. ఈ ప్రాంతంలో కేవలం 50 నుంచి 70 అడుగుల లోతులోనే పుష్కలంగా భూగర్భ జలాలు పడుతున్నవి. దీనికి తోడు పక్కనే తాటిపూడి రిజర్వాయర్, పొరుగునే చిలకలగెడ్డ స్కీం ఉన్నాయి. సాగునీటి సమస్యలేదు. ప్రస్తుతం ఎకరాకు రు. 10 లక్షల దాకా పలుకుతోంది. వీటిపై కన్నేసిన జిందాల్ మాత్రం అధికారికంగా రైతులకు పరిహార ప్యాకేజీని ప్రకటించలేదు. ప్రభుత్వం సాయంతో వ్యవహారాన్ని తెరవెనుక నుంచి నడిపించడానికే ఇష్టపడుతోంది తప్ప, నిర్వాసితులు కాబోతున్న వారితో మాట్లాడిన పాపాన పోలేదు. మరీ ఇంత దారుణమా?

2006 అక్టోబర్‌లో తొలిసారి ఆర్.డి.ఓ. వచ్చి జిందాల్‌కు భూములివ్వడంపై సమావేశం జరిపారు. లక్ష్మీపురం దగ్గరి ఖాళీ భూముల గురించే మాట్లాడారు. వాటినిస్తే నష్ట పరిహారమిస్తామనీ, కుటుంబంలో ఒకరికి ఉద్యోగం వస్తుందనీ ఎప్పటి మాదిరిగానే చెప్పారు. కానీ జిందాల్ సంస్థ అడగటంతో పచ్చని పొలాలు లాక్కోవడానికి సిద్ధమయ్యారు. ఈ భూముల వ్యవహారాన్ని ఎంత గోప్యంగా నడిపిస్తున్నారంటే 2006 డిసెంబర్ 31న ఇచ్చినట్లు ఎ-1 నోటీసును రెవెన్యూ అధికారులు సిద్ధం చేసారు. ఫలానా సర్వే నెంబర్లలో ఉన్న భూమిని జిందాల్ అల్యూమినియం కర్మాగారం కోసం తీసుకుంటున్నామని, ఎవరికైనా పట్టాలు అప్పగించడానికి అభ్యంతరాలు ఉంటే 15 రోజుల్లో చెప్పాలని పేర్కొన్నారు. కానీ ఆ నోటీసును జనవరి 18న పంచాయితీ కార్యాలయానికి అతికించారు. అంటే అప్పటికే అభ్యంతరాలు చెప్పుకోవడానికి రైతుల కిచ్చిన గడువు ముగిసిపోయింది. జిందాల్, ప్రభుత్వ అధికారయంత్రాంగం కుమ్మక్కయ్యారనడానికి ఇంతకన్నా ఏం కావాలి? రైతుల అంగీకారం లేకుండా భూములు తీసుకోబోమని వాగ్దానం చేసిన అధికారులు దానికి భిన్నంగా ఇప్పుడు రైతులను బెదిరించి స్వాధీనం చేసుకోవడం అప్రజాస్వామికం.

ప్రజలకు నష్టం చేసి, జిందాల్ కంపెనీకి లాభం చేకూర్చే రీతిన అధికారులూ, ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయి.

నోటీసులతో భయపడ్డ స్థానికులు ఎస్.కోట ఎమ్మార్వో కార్యాలయం వద్ద రెండు రోజులు ఆందోళన చేయటంతో జనవరి 25 లోగా జాయింట్ కలెక్టర్‌తో సమావేశాన్ని ఏర్పాటు చేయిస్తామని వాగ్దానం చేసిన అధికారులు ఇప్పటి వరకు సమావేశాన్ని నిర్వహించలేదు. పైపెచ్చు రైతులు ఆందోళన దిశగా అడుగులేస్తుండటంతో భూముల వ్యవహారాన్ని రహస్యంగా నడిపిస్తున్నారు. సర్వే చేయడానికి జిందాల్ కంపెనీకి రెవెన్యూ యంత్రాంగం అనుమతినిచ్చింది. దీంతో జిందాల్ తరపున ఓ ప్రైవేట్ సంస్థ రంగంలోకి దిగింది. సర్వే జరుగుతుండగా రైతులెవరైనా చూసి ఇదేమిటని అడిగితే ఇది జిందాల్ కోసం కాదని, వేరే ఏదో అని తప్పించుకుంటున్నారు. ఇలాగే గత నెల 4వ తేదీన అడ్డతీగ గ్రామం వద్ద సర్వే చేస్తున్న సిబ్బంది నుంచి ప్రజలు సర్వే పరికరాలను లాక్కున్నారు. ఆ గ్రామంలో రామాలయంలో వాటిని ఉంచి సిబ్బందిని పంపించేసారు. దీనిపై సిబ్బంది ఫిర్యాదు చేయగా పోలీసులు వచ్చి గ్రామస్తులను బెదిరించి, దౌర్జన్యం చేసి వాటిని లాక్కువెళ్లారు.

## మరోసారి నిర్వాసితులు కాబోతున్నారు

1964లో విజయనగరం జిల్లాలోని గోస్తనీ నదిపై తాటిపూడి రిజర్వాయర్ నిర్మించారు. ముంపు ప్రాంతాల్లో పలువురు ఆదివాసీలు దగ్గర్లోని ఊళ్లకు వలసపోయారు. అలా వచ్చినవారు నిర్మించుకున్న గ్రామాలే చీడిపాలెం, అడ్డతీగ. ఇప్పుడు ఈ రెండు గ్రామాలు జిందాల్ కంపెనీ బారిన పడబోతున్నాయి. ఇక గవరపాలెం, రాయవానిపాలెం, గరగవానిజోరు తదితర గ్రామాల్లో కూడా తాటిపూడి, ఆంధ్ర ప్రాజెక్టుల నిర్వాసితులు పెద్దసంఖ్యలో ఉన్నారు. అవి జిందాల్ పరమవబోతున్నాయి. ఇండ్లు, పొలాలు కోల్పోయి మరోసారి వీరంతా నిర్వాసితులయి వలసపోయే ప్రమాదం ఆసన్నమైంది. పెట్టబోయే అల్యూమినియం కర్మాగారానికి ఎక్కువ మోతాదులో నీటి అవసరముంటుంది. ఈ నీటిని చిలకలగెడ్డ నుంచీ, తాటిపూడి రిజర్వాయర్ నుంచీ తీసుకుంటారని చెబుతున్నారు. ఇప్పటికే తాటిపూడి నుంచి సగం నీరు విశాఖపట్నంకు తాగునీరుగా తరలిస్తున్నారు. మిగిలిన నీటిని జిందాల్ కంపెనీకి మళ్లిస్తే ఈ రిజర్వాయర్ కింద సాగు అవుతున్న ఇరవైవేల ఎకరాల ఆయకట్టు నాశనం కావాల్సిందే. వాస్తవంగా విశాఖ నీటి అవసరాలను గోదావరి జలాల నుంచి తీర్చుకుని, తాటిపూడి నీటినంతటినీ వెనుకబడిన ప్రాంతమైన విజయనగరం జిల్లాలో ఆయకట్టు పెంచడానికి వినియోగించడం సమంజసమనే వాదన ప్రజల్లో వినిపిస్తోంది. గత సంవత్సరం ఫిబ్రవరిలో కొర్లాంలో జరిగిన ప్రజాపథం కార్యక్రమంలో తాటిపూడిని సాగునీటి ప్రాజెక్ట్‌గా ప్రకటిస్తామని చెప్పిన ప్రభుత్వం, ఇప్పుడు అది చెయ్యకపోగా రైతులకు ఇంకా నష్టాన్ని కలిగించడం దారుణం. భూములు కోల్పోనున్న కుటుంబాల్లో 70 శాతం ఆదివాసీ కుటుంబాలే. వీరిలో కొంతమంది తాటిపూడి రిజర్వాయర్ నిర్మాణ సందర్భంగా ఒకసారి నిర్వాసితులయిన వారే. దశాబ్దాల కిందట అడవిని నరికీ, మోడులూ, మొద్దులూ తొలగించి గట్లు వేసుకుని బాగుచేసి ఈ భూమిని సాగుయోగ్యంగా చేసారు. ప్రభుత్వం ఏరికోరి ఆదివాసీల భూములనే సేకరించేందుకు ప్రయత్నించడాన్ని లోతుగా పరిశీలిస్తే ఒక పథకం ప్రకారం ఆదివాసులను నిర్వాసితులను చేస్తూ, ఆదివాసి ప్రాంతాల్లో విదేశీ పారిశ్రామికవేత్తల, ఆదివాసేతరుల ప్రయోజనాలను కాపాడుతోంది. ఏజెన్సీ ప్రాంతాల్లో ఆదివాసేతర పారిశ్రామి వేత్తలకూ, బహుళజాతి కంపెనీలకూ రాయితీలిచ్చి మరీ ప్రోత్సహిస్తోంది.

ప్రభుత్వం సేకరించదల్చిన 16 వందల ఎకరాల్లో సుమారు 13 వందల ఎకరాలు అసైన్డ్ భూములు, ప్రభుత్వ భూములు. మిగిలిన భూమి కూడా పేదలు సాగు చేసుకుంటున్న ప్రభుత్వ భూమే. అన్యాక్రాంత మైన అసైన్డ్ భూములను స్వాధీనం చేసుకుని నిరుపేదలకు పంచుతామని ప్రభుత్వం ఒకవైపు చెప్పుకుంటూ అసైన్డ్ భూములను పనిగట్టుకొని స్వాధీనం చేసుకుంటూ రియల్ ఎస్టేట్ వ్యాపారులకూ, ఎస్.ఇ.జెడ్ ల కోసం, ఫ్యాబ్‌సిటీల కోసమంటూ పెట్టుబడిదారులకూ, బహుళజాతి కంపెనీలకూ ధారదత్తం చేస్తోంది. పది పదిహేనేళ్ల కిందట 'డి' ఫారం పట్టాలిచ్చారు. మరి అలాంటి భూమిని ప్రజల భూమి కాదంటూ లోకాన్ని నమ్మింపజూస్తోంది. ఎన్నో ఏళ్లు కష్టించి రక్తం ధారబోసి, భూమిని చదును చేసి పండించుకుంటున్న పచ్చటి పంటపొలాల్ని పారిశ్రామికవేత్తలకు ధారాదత్తం చేయడాన్ని బుద్ధిజీవులందరూ ప్రశ్నించాల్సిన అవసరంఉంది.

## సబ్బవరం వద్ద ఏమైనట్లు?

ఎస్.కోట కన్నా ముందు విశాఖ జిల్లాలోని సబ్బవరం మండలం లో కర్మాగారం ఏర్పాటుకు సిద్ధపడిన విషయం తెలిసిందే. అప్పట్లో స్థానిక ప్రజల నుంచి తీవ్ర నిరసన వ్యక్తమైంది. తర్వాత జిందాల్ సంస్థ యాజమాన్యం దృష్టి విజయనగరం జిల్లా ఎస్.కోట వైపు మళ్లింది. ఎస్.కోట భూసేకరణకు స్థానిక నేతలు కూడా మద్దతునిస్తున్నారు. విజయనగరానికి ఆ కర్మాగారం రావాలని మంత్రి బొత్స సత్యనారాయణ పట్టుదల కనబరుస్తున్నారు. ఈ ప్రాజెక్టుకు సంబంధించిన అభ్యంతరాలు సందేహాలు ఇలా ఉన్నాయి – జిందాల్ అల్యూమినియం కంపెనీకి విశాఖ జిల్లా సబ్బవరం మండలం లోని భూములు కేటాయిస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. నవంబర్ 28న విశాఖలో ప్రజాభిప్రాయ సేకరణ కూడా నిర్వహించింది. జిందాల్ కంపెనీకి విశాఖ జిల్లాలో భూములు సేకరిస్తూ అదే కర్మాగారం స్థాపనకు విజయనగరంజిల్లాలో కూడ భూములు సేకరిస్తున్నామని ప్రకటిస్తోంది. ఒకే ఫ్యాక్టరీని రెండుచోట్ల ఎలా నిర్మిస్తారని ప్రజలు ప్రశ్నిస్తున్నారు. వ్యవసాయానికి అసలు పనికిరాని భూములు విశాఖ, విజయనగరంజిల్లాల్లో మరెన్నో ఉన్నా ఈ వ్యవసాయోగ్య మైన భూములే అవసరమా అనే ప్రశ్నకు ప్రభుత్వం నుంచి సరైన సమాధానం గానీ, స్పందనగానీ లేదు. ఈ విషయం పట్ల మొదటినుంచి ప్రభుత్వం నిర్లక్ష్య ధోరణితో వ్యవహరిస్తున్నది. గడిచిన ఎనిమిది నెలల నుంచి ఇక్కడ ప్రజల మొరను ప్రభుత్వం పట్టించుకున్న దాఖలాలు లేవు సరిగదా వారి హక్కులను కాలరాసే విధంగా వ్యవహరిస్తోంది.

తాజాగా మన్యంలో బాక్సైట్ తవ్వకాలకు అనుమతి పొందిన యు.ఎ.ఇ. కి చెందిన 'రస్ అల్‌కైమా' అనే సంస్థ విశాఖపట్నం జిల్లాకు చెందిన మాకవరపాలెం మండలంలో కర్మాగారం ఏర్పాటుకు సిద్ధమవు తోంది. ఇందుకు మూడు వేల ఎకరాల భూమిని అందజేయడానికి ప్రభుత్వం రంగం సిద్ధంచేస్తోంది. ఈ భూములను ఎరకంపాలెం, రామన్న

పాలెం, చినరాజపల్లి, వెంకన్నపాలెంలో సేకరించడానికి సన్నాహాలు చేస్తున్నారు. బాక్సైట్ నిక్షేపాలను ప్రైవేట్ కంపెనీలకు కట్ట బెడుతున్న పుణ్యమా అని ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం భూముల వేటలోపడింది.

రాష్ట్ర ప్రభుత్వం జలయజ్ఞం పేరుతో చేసే అభివృద్ధిలో ఇరవై లక్షల మంది నిర్వాసితులవుతున్నారు. ఆదివాసులే కాకుండా రైతులు కూడా అధిక సంఖ్యలో నిర్వాసితులవుతున్నారు. మరొక పక్క ప్రత్యేక ఆర్థిక మండలాలు నెలకొల్పి పారిశ్రామికవేత్తలకు ఏది కావాలంటే అది ఇస్తామంటున్నారు. ఇప్పటికే వేలాది ఎకరాల రైతుల భూములు పారిశ్రామికవేత్తలకు ధారాదత్తం చేసారు.

ఆదివాసుల కోసం రాజ్యాంగం ఐదవ షెడ్యూలు ద్వారా సంక్రమింపజేసిన రక్షణలు రాష్ట్రంలో అమలు కావడం లేదు. షెడ్యూల్డు ప్రాంతాల భూముల్లో సింహభాగం అన్యాక్రాంతమయ్యింది. ఉన్న భూములు అన్యాక్రాంతం కాగా ఆదివాసులు కాందిశీకులుగా మారి ఆయా ప్రాంతాలను వీడి వెళ్లిపోతున్న దృష్టాంతాలు నానాటికీ పెరిగి పోతున్నాయి. ప్రస్తుత షెడ్యూల్డు ప్రాంత పంచాయితీరాజ్ పీసా చట్టం ప్రకారం సామాజిక ఆర్థిక అభివృద్ధి ప్రణాళికల అమలుకు గ్రామ సభల అనుమతి అవసరం. చిన్న తరహా అటవీ ఉత్పత్తులపై యాజమాన్య హక్కు, చట్ట విరుద్ధంగా అన్యాక్రాంతం అయిన ఆదివాసీల భూమిని తిరిగి అప్పగించే అధికారం, అభివృద్ధి ప్రాజెక్టుల కింద చేపట్టబోయే భూమి సేకరణ విషయంలో నిర్వాసితుల పునరావాసం, నష్టపరిహారం వంటి విషయాలలో గ్రామసభల అధికారాలను ప్రభుత్వాలు నీరుగార్చి ఆదివాసుల హక్కులను కాలరాస్తున్నాయి. రాష్ట్రంలోని ఏజన్సీ ప్రాంతాల్లో ఆదివాసులకు చెందిన భూమిని ఆదివాసేతరులకు, పారిశ్రామివేత్తలకు రిజిస్ట్రేషన్ చేయవద్దని న్యాయస్థానాలు చెబుతున్నా, ప్రభుత్వాలు పెడచెవినబెట్టి పెద్ద ఎత్తున భూములను విదేశీ సంస్థలకు కట్టబెట్టడానికే కంకణం కట్టుకున్నాయి.

ఆదివాసుల స్వయం పాలన, సాధికారత సాధించేందుకు ఉపకరించే రాష్ట్ర షెడ్యూల్డు ప్రాంత పంచాయితీరాజ్ వ్యవస్థను ఒక పథకం ప్రకారం నిర్వీర్యం చేస్తూ సమాంతర పాలన సాగించే విధంగా ప్రభుత్వమే పాలనా యంత్రాంగాన్ని ఏర్పాటు చేసుకుంది. స్వయం పాలన ఆధారంగా పంచాయితీరాజ్ వ్యవస్థకు పటిష్టత చేకూర్చాలనే రాజ్యాంగాదేశిక సూత్రాన్ని నీరుగార్చి ఆర్థిక సంస్కరణల పేరిట అమలు చేస్తున్న విధానాలు రాజ్యాంగం వెన్ను విరిచేస్తున్నాయి. ప్రపంచ బ్యాంక్ పథకాలనూ, విదేశీ సంస్థలకు భూములనూ స్థానిక సంస్థల, గ్రామసభల ప్రమేయం లేకుండా బలప్రయోగంతో ప్రభుత్వం అమలుచేస్తోంది.

మన దేశం అంతర్జాతీయంగా అందరి దృష్టినీ ఆకర్షిస్తోంది, 'అభివృద్ధి'లో మనమంతా అందని ఎత్తుకు ఎదిగిపోతున్నామని ప్రభుత్వం గణాంకాలతో ఏకరువుపెడుతూ ప్రజల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. స్థూల జాతీయోత్పత్తి 9.2 శాతంతో నింగిని తాకేందుకు ప్రయత్నిస్తోందని ఆర్థికమంత్రి చిదంబరం ఘోషిస్తున్నారు. విచ్చలవిడిగా ప్రత్యేక ఆర్థిక మండలాలు, పారిశ్రామికవాడల ఏర్పాటుతో అభివృద్ధి అందని శిఖరాలను అధిరోహిస్తున్నదని గోబెల్స్ ప్రచారానికి పూనుకున్నారు. ప్రపంచబ్యాంక్ అయితే ఏకంగా భారత్ ఒక్కటే సంస్కరణల అమలుకు సరైన వేదిక అని తన వార్షిక నివేదికలో మెచ్చుకుంది. కేవలం ఆరు ఎస్.ఇ.జడ్ లు మాత్రమే ఉన్నా చైనా అభివృద్ధికి ఆదర్శమంటూ 600 వరకూ ఎస్.ఇ.జెడ్‌లకు అనుమతిస్తోంది.

మరోవైపు ఎస్.ఇ.జడ్ ల వల్ల నెలకొంటున్న అశాంతి నందిగ్రామ్ రూపంలో ఇప్పటికే బద్ధలయ్యింది. కళింగనగర్, పోలవరం, తోటపల్లి, నందిగ్రామ్ ప్రాంతాలలో నిర్వాసితులపై దమనకాండలు సాగడం ప్రపంచీకరణ పేరుతో జరుగుతున్న కుట్రలో భాగమే. సామాన్యుని ఆదు కోవాల్సిన ప్రభుత్వాలే ఇలా వ్యవహరించడం అప్రజాస్వామికం. ◆

## పరిశోధనా ఫలాలు సమాజానికి అందజేయండి !

సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలలో మీరు ఎంతో పరిశోధన చేసి ఉంటారు. అధ్యాపకులుగా మీ విద్యార్థులకు ఎన్నో పరిశోధనలలో ప్రత్యక్ష పరోక్ష సహకారాలు అందిస్తూ ఉంటారు. అయితే సమాజానికి ఎంతో ఉపయోగపడాల్సిన పరిశోధనా పత్రాలు ఏ సెమినార్‌లోనో ప్రస్తావించి వదిలేస్తే సరిపోదు. మీ పరిశోధనా ఫలాలు తెలుగు సమాజంలో నలుగురికీ చేరాలి. కొత్త ఆలోచనలకు ప్రేరణ కావాలి, కొత్త మార్గాలను ఆవిష్కరించాలి. అందుకు మీకు వేదికగా నిలిచేందుకు వీక్షణం ముందుకు వస్తోంది.

తెలుగులో పాప్‌కార్న్ పత్రికలే కానీ సీరియస్ పత్రికలు లేవన్న అభిప్రాయాన్ని పటాపంచలు చేస్తూ విజయవంతంగా రెండున్నరేళ్ల ప్రస్థానం సాగించి, 50 సంచికలు పూర్తి చేసుకుంది వీక్షణం. ఎటువంటి డబ్బు మూటల దన్ను లేకుండా గుప్పెడు పాత్రికేయులు, సామాజిక శాస్త్రవేత్తలు కలిసి నడుపుతున్న ఈ పత్రికకు ఎందరో మేధావులు, అధ్యాపకులు, ఆలోచనాపరులు చందాదారులుగా ఉన్నారు. తెలుగు సమాజం గర్వించదగ్గ పాత్రికేయులు, సామాజిక శాస్త్రవేత్తలు, ఉద్యమకారులు, నిపుణులు అనేకుల రచనలు వీక్షణం ప్రచురిస్తోంది.

రండి, ఈ బృహత్కార్యంలో మీరూ పాలుపంచుకోండి. మీరు చేసిన పరిశోధనా ఫలితాలను వీక్షణంలో ప్రకటించండి. అది ఏ సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశం అయినా ఫర్వాలేదు. తెలుగు ప్రజలకు ఆ అంశం ఆసక్తిగొల్పేదీ, ఉపయోగకరమైనదీ అని మీరు భావిస్తే చాలు. మీరే కాదు పి.హెచ్.డి చేసిన, చేస్తున్న మీ విద్యార్థులు కూడా తమ పరిశోధనా పత్రాలను (ఒక వ్యాసరూపంలో) పంపవచ్చు. రచనతో పాటు దానికి సంబంధించిన చిత్రాలు, గణాంకాలు కూడా జతపరిస్తే మరీ మంచిది.

***ఎంతో శ్రమించి మీరు చేస్తున్న పరిశోధనలు నలుగురికీ ఉపయోగపడేలా చేయండి.***
***వీక్షణం మీ రచనల కోసం ఎదురుచూస్తుంది !***
***మీదే ఆలస్యం !!***

*రచనలు పంపాల్సిన చిరునామా :*

ఎడిటర్, వీక్షణం, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్
3-6-394, 301, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029. ఫోన్ : 040 – 66843495

**అరవై సంవత్సరాల స్వతంత్ర భారత చరిత్రలో ప్రత్యేక ఆర్థిక మండలాలంతగా మనల్ని మనం మోసం చేసుకుంటున్న సందర్భం మరొకటి లేదంటే అతిశయోక్తి కాదంటున్నారు ఎస్. సుధాకర్**

# ప్రత్యేక ఆర్థిక మండలాలు ఎవరి ప్రయోజనాల కోసం ?

ప్రత్యేక ఆర్థిక మండళ్ల (సెజ్) చట్టం 2005 మే లో పార్లమెంట్‌లో ఆమోదం పొంది జూన్ నుండి అమలులోకి రావడం జరిగింది. దేశ ఆర్థిక వ్యవస్థకు ప్రధానంగా భారత రైతాంగాన్ని తీవ్రస్థాయిలో అలజడి, ఆందోళనలకు గురిచేస్తున్న ఈ అంశం ప్రధాన చర్చనీయాంశంగా మారింది. యాభై సంవత్సరాల భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రయోగాల్ని అపహాస్యం చేస్తూ ముందుకొస్తున్న ఈ ప్రత్యేక ఆర్థికమండళ్ల స్థాపన ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, నూతనఆర్థిక విధానాల అమల్లో మరో కీలకమైన ప్రజావ్యతిరేక మలుపు అని చెప్పక తప్పదు.

ప్రత్యక్ష విదేశీ పెట్టుబడుల ఆకర్షణ, అంతర్జాతీయ ఎగుమతులకు సంబంధించిన నాణ్యత – పోటీ లక్ష్యంగా ఎలాంటి చట్టబద్ధ నియంత్రణ గానీ, మానవీయ విలువలకు చోటుగాని లేని అంతర్జాతీయ లాభ నష్టాల వ్యాపార సంస్కృతి కేంద్రాలుగా ప్రత్యేక ఆర్థిక మండళ్ల స్థాపన జరుగుతుందని సెజ్ చట్టం చెబుతోంది. భారత భూభాగంలో ఆరు వందలకు పైగా ఈ సెజ్‌ల పేరుతో స్థాపించే పరిశ్రమల ఉత్పత్తి, క్రయ–విక్రయ, కార్యనిర్వహణా కార్యకలాపాల్లో చట్టబద్ధమైన తనిఖీ, నియంత్రణలు గానీ, న్యాయ–పరిపాలనా వ్యవస్థల జోక్యం కానీ ఉండడానికి వీలులేదు. స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన ఆధునిక జమిందారీలు, జాగీరులు, సంస్థానాల రూపంలో ఈ దేశ సార్వభౌమత్వాన్నీ, రాజ్యాంగ స్ఫూర్తినీ గేలిచేస్తూ ఈ నేలపై పోరాడి సాధించుకున్న సర్వ 'హక్కుల్ని' విదేశీ అవసరాల నిమిత్తం తాకట్టు పెట్టడానికి సెజ్‌ల రూపంలో సర్వం సిద్ధమైపోతోంది.

భారతదేశంలో పాడుబడ్డ, నీటి వసతి లేని భూములు లక్షలాది ఎకరాలుండగా, రైతులు సాగుచేసుకుంటున్న పచ్చని పంటపోలాలు, అందమైన పూదోటలు, పండ్ల తోటలనే సెజ్‌ల స్థాపనకు అనుకూలమైనవని నిర్ధారించి, ప్రభుత్వాలు బలవంతంగా సేకరించడం ఆశ్చర్యం గొల్పుతున్న అంశం. పోనీ వీటిని నిర్మూలించి అక్కడ ఆహార పదార్థాల్ని ఉత్పత్తి చేస్తారంటే అది కూడా లేదు. అక్కడ తయారయ్యేవి ఎగుమతికి అనువైన వజ్ర వైఢూర్యాలు, స్వర్ణాభరణాలు, హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్, ఎలక్ట్రానిక్, లెదర్, టెక్స్‌టైల్, కార్లు, షికార్లకు అవసరమయ్యే ఉత్పత్తులు మాత్రమే. సెజ్‌ల స్థాపనకు పచ్చని పంటపోలాల్ని ఎంచుకోవడానికి కూడా సెజ్‌ల చట్టంలోనే స్పష్టమైన సమాధానం ఉంది. సెజ్‌ల నిర్మాతలకు చట్టంలో అనేక వసతులు, రాయితీలు, గ్యారంటీ చేయబడ్డాయి. లక్షలాది ఎకరాల భూమిని ప్రభుత్వం సేకరించి అప్పజెప్పడమే కాకుండా, నిర్మాణ వసతుల కింద (ఇన్‌ఫ్రాస్ట్రక్చర్) నీరు, కరెంట్, రోడ్డు, విమాన, జల, రవాణా సౌకర్యాలు కల్పిస్తామని వాగ్దానం చేయడం జరిగింది. పాడుబడ్డ బీడు భూముల్లో ఈ వసతులన్నీ కల్పించడం ఖర్చుతో కూడుకున్న పని. దశాబ్దాలు, శతాబ్దాలుగా పంటలు పండిస్తున్న పచ్చని పోలాల చుట్టూ ఈ వసతులు పుష్కలంగా లభిస్తాయి. అన్నిటినీ మించి వాటి నిర్మాణానికి రాళ్లుమోసే కూలీలు, వాటి ఉత్పత్తుల్లో చౌకగా చాకిరీ చేయడానికి అవసరమైనన్ని మానవ కళేబరాలు ఆ పోలాల చుట్టూ పుష్కలంగా లభిస్తాయన్న సత్యం కూడా వాళ్లకు బాగా తెలుసు. చట్టం నుండి దూరం చేయబడ్డ మనుషులు ఏ నాగరిక దేశంలోనైనా జీవచ్ఛవాలతో సమానం. సంస్థానాధీశులకు, జాగీర్దారులకు కప్పం కింద కమీషన్లు చెల్లించడం తప్ప చట్టబద్ధంగా కస్టమ్స్, ఎక్సైజ్ సుంకాలు, సర్వీస్ టాక్స్, సేల్స్ టాక్స్‌లు చెల్లించడాలు అసలే సాధ్యం కాదు. అందుకే సెజ్‌ల చట్టంలో అవన్నీ అధికారికంగానే రద్దుచేయడం జరిగింది. అలాగే అక్కడ నిరసన హక్కు, సమ్మె హక్కు, మెరుగైన వేతనాలు, పని గంటలు, పని భద్రత, యూనియన్‌లు, లేబర్ కమీషన్లు, పెన్షన్లు, ప్రావిడెంట్ ఫండ్, విశ్రాంతి, ఆరోగ్యం లాంటి వేటినీ చట్టబద్ధంగానైనా అడిగే హక్కు ఉండదు. ఎందుకంటే సెజ్ చట్టంలో వాటికి ప్రత్యేక సొంత న్యాయస్థానాలుంటాయి. సొంత భద్రతా వ్యవస్థలుంటాయి. అవి భారత రాజ్యాంగానికి అనుబంధంగా పని చేయాల్సిన అగత్యం కానీ, అవసరం కానీ, ఉండదు. యాభై సంవత్సరాల భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యం స్వచ్ఛందంగానే తన సార్వభౌమత్వ హక్కును సెజ్‌ల నిర్మాతలకు నైవేద్యంగా అర్పిస్తోంది.

దేశవ్యాప్తంగా అన్ని వర్గాల మేధావులు, అధికార – ప్రతిపక్ష రాజకీయ పార్టీలు సెజ్‌ల నిర్మాణంలో నష్టపోతున్నది కేవలం రైతులు – కార్మికులే కనుక వారిని ఆదుకోవడానికి అన్ని రకాలుగా ప్రభుత్వాలు చర్యల్ని చేపట్టాలని సూచనలు, విమర్శలు, ఉద్యమాల రూపంలో ఉధృతంగానే ముందుకొస్తున్నారు. బహుశా అరవై సంవత్సరాల స్వతంత్ర భారత చరిత్రలో ఇంతగా మనల్ని మనం మోసం చేసుకుంటున్న సందర్భం మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు. ఎందుకంటే, ఈ దేశంలో ప్రత్యేక

ఆర్థిక మండళ్ల స్థాపనతో వాస్తవంలో నష్టపోతున్నది కేవలం రైతులు, కార్మికులు మాత్రమేనా అన్నది కీలకమైన ప్రశ్న. ఈ ప్రశ్నకు స్పష్టమైన సమాధానాన్ని వెదకాలంటే పదిహేను సంవత్సరాల క్రితం ప్రారంభమై కొనసాగుతున్న ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, నూతన ఆర్థిక విధానాల అమలు, ఆచరణల్లో దాగిన తాత్విక భూమికను సూక్ష్మస్థాయిలో అధ్యయనం చేయక తప్పదు. వ్యాపార ముసుగులో అనేక వలసదేశాలు చేసిన దురాక్రమణకు గురై నాలుగు వందల సంవత్సరాలుగా భారతీయులు అనుభవించిన కష్టాలు, కడగండ్లకు వ్యతిరేకంగా వంద సంవత్సరాల పాటు కొనసాగిన భారత స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తి, దాని ఫలితంగా ఆవిర్భవించిన వ్యవస్థ మనది. సర్వసత్తాక సార్వభౌమ ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యంగా ప్రకటించారు. ఈ దేశ పౌరులకు సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్నీ, తాము నమ్మిన భక్తి, విశ్వాసాన్నీ ఆచరించడానికి భావప్రకటనా స్వేచ్ఛను కల్పిస్తూ తరతమ స్థాయి బేధాల కతీతంగా అందరికీ ఈ భూమ్మీద సమానత్వాన్ని, సౌభ్రాతృత్వాన్ని, వ్యక్తి వికాసంతో కూడుకున్న జాతీయ ఐక్యతను సాధిస్తామని ప్రతిజ్ఞ చేస్తారు. భారత ప్రజలమైన మనం, మన పూర్వీకులు నిర్మించుకున్న భారత రాజ్యాంగ స్ఫూర్తి ఈ అధ్యయానికి గీటురాయి కావాలి. 12 షెడ్యూళ్లతో, 440కి పైగా ఆర్టికల్స్‌తో డాక్టర్ అంబేద్కర్ నాయకత్వంలో నిర్మితమైన భారత రాజ్యాంగ సౌధంలో నెలకొన్న ఎన్నో సుందరమైన ప్రాకారాలు, మరెన్నో ప్రహరీలతో కూడుకున్న అడ్డుగోడలు, పిల్లలు, స్త్రీలు, వృద్ధులు సేద తీరడానికి నిర్మితమైన ఉద్యానవనాలు, కార్మికులు, కర్షకులు, దళిత, బహుజన ఆదివాసీ, మైనారిటీ వర్గాల రక్షణకు ఉద్దేశించిన దుర్భేద్యమైన కోటలు, సకల స్వేచ్ఛలతో, సూత్రీకరణలతో జాతి యావత్తు వికసించటానికి అనువుగా రూపుదిద్దుకున్న భారత రాజ్యాంగ ప్రాభవం ఈనాడేమయ్యింది, ఎక్కడుంది అన్న ప్రశ్న ఆ అధ్యయానికి గీటురాయి కావాలి.

యాభై సంవత్సరాల భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్య చరిత్రలో జరిగిన ప్రయోగాలు పూర్తి స్థాయిలో చిత్తశుద్ధితో ఈ దేశ ప్రజల సంక్షేమం కొరకే జరక్కపోయినా, పూర్తిగా ప్రజల పేరుతో, ఎంతో కొంత ప్రజల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని వారినుద్దేశించి జరిగిన ప్రయోగాలేనన్నది అక్షర సత్యం. ఆ క్రమంలో రాజ్యాంగం పార్లమెంట్ ద్వారా తన్నుతాను నిర్వచించుకుంటూ అనేక సామాజిక, రాజకీయ, ఆర్థిక, సంక్షేమ చట్టాల్ని రూపొందించడం జరిగింది. సంస్థానాలు, రాజభరణాల రద్దు మొదలుకొని బ్యాంకుల జాతీయికరణ, భారీస్థాయిలో ప్రభుత్వ రంగంలో పరిశ్రమల స్థాపన, భూ సంస్కరణల - పట్టణ భూ పరిమితి చట్టాలు, కులనిర్మూలన, జాతీయ భద్రతకు సంబంధించిన ప్రత్యేక చట్టాలు, విద్య, వైద్య, గృహ, స్త్రీ, శిశు, శాస్త్ర, సాంకేతిక, సాంస్కృతిక రంగాలకు సంబంధించిన సంక్షేమ చట్టాలు అనేకంగా రూపొందాయి. ఈ చట్టాలకు తూట్లు పొడవడం మూలంగా ప్రజలు అనేక నష్టాల్నీ, కష్టాల్నీ ఎదుర్కోవడం జరిగిందే కానీ పనికట్టుకుని ప్రజల్ని కష్టాలు, నష్టాల ఊబిలోకి నెట్టడానికి ఈ దేశంలో చట్టాలు, శాసనాలు గత దశాబ్దం క్రితం వరకు జరగలేదన్నది వాస్తవం. ఆ కష్టాల్నీ, నష్టాల్నీ ఉద్యమాలతో ఎదుర్కొన్న ప్రజానీకాన్ని జాతీయ భద్రత పేరుతో ప్రత్యేక చట్టాల్ని రూపొందించి, హింసా అణచివేతలకు గురి చేయడం ఈ సందర్భంలో ఒక మినహాయింపుగానే పరిగణించక తప్పదు.

ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, నూతన ఆర్థిక విధానాల దురాగతాలు ఒక్క భారతదేశానికి మాత్రమే సంభవించిన అంశం ఎంతమాత్రం కాదు. అది అంతర్జాతీయంగా సంబంధించిన అనేక పరిణామాల కొనసాగింపు మాత్రమే. 1960 నుండి 1980 వరకు అమెరికన్ సామ్రాజ్యవాదులు, రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదుల మధ్య నెలకొన్న ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణంలో ప్రపంచ దేశాల్లోని ప్రజలు, పాలక రాజకీయ పక్షాలు రెండు శిబిరాలుగా తమ మనుగడ సాగించేవి. భారత దేశం ఊగిసలాడు తూనైనా రష్యన్ సోషల్ సామ్రాజ్యవాద శిబిరంలో కొనసాగడం చరిత్ర. 1990 దశాబ్దంలో తీవ్రమైన అంతర్గత కలహాలు, బలమైన అంతర్గత వైరుధ్యాలతో సతమతమైన రష్యా, తూర్పు ఐరోపా సోషలిస్టు దేశాలు అక్కడి ప్రజల ఆశలు, ఆకాంక్షలకు అనుగుణంగా ఒక రాజకీయ పరిష్కార మార్గాన్ని రూపొందించుకోవడంలో జరిగిన వైఫల్యంతో రష్యన్ సోషల్ సామ్రాజ్యవాద శిబిరం కుప్ప కూలిపోవడం జరిగింది. దాంతో ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణం తొలగిపోయి అమెరికన్ సామ్రాజ్యవాదం ఎదురులేని మొనగాడుగా ముందుకొచ్చి, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, నూతన ఆర్థిక విధానాల ముసుగులో ప్రపంచప్రజల జీవితాల్ని తన మార్కెట్ ప్రయోజనాలకు అనుగుణంగా సాధ్యమైన దేశాల్లో ఆర్థికంగా, సాధ్యం కాదనుకున్న దేశాల్లో సైనికంగా శాసించే క్రమాన్ని ప్రారంభించింది. దాని కొనసాగింపే భారతదేశంలో నేడు తెర మీదకొచ్చిన ప్రత్యేక ఆర్థిక మండలుల నిర్మాణం.

భారతదేశంలో పి.వి. నరసింహారావు, మన్మోహన్ సింగ్‌ల నాయకత్వం లో ప్రారంభమైన ఈ ప్రక్రియ మొదట తేనె పూసిన కత్తిలాగా చాలా మందికి ఎంతో తియ్యగానే అనిపించింది. ఎందుకంటే చరిత్రలో దోపిడీ పాలక వర్గాలు ప్రజల్ని వంచించడానికి ఎన్నుకునే మార్గం ప్రారంభంలో ఎప్పుడూ తియ్యగానే ఉండాలన్నది వారి తాత్విక దృక్పథం లో భాగం. అందుకే దశాబ్దాలుగా సుపరిచితమైన భావనల (కాన్సెప్ట్స్) నిర్వచనాలు తారుమారైపోతున్నా వాటి వెనుక దాగిన కుటిలత్వాన్ని మనం గ్రహించి ప్రజానీకాన్ని జాగృతం చేయడంలో విఫలం చెందడం జరిగింది. ప్రజల కొరకే అభివృద్ధి అన్న నినాదం కాస్తా డెవలప్‌మెంట్ విత్ హ్యూమన్ ఫేస్‌గా రూపాంతరం చెందింది. అంటే దాని వెనుక దాగిన అసలు అర్థం ఇప్పటికి గానీ మనకు స్పష్టంగా బోధపడడం సాధ్యం కాలేదు. ఉదాహరణకు పశ్చిమ బెంగాల్ అభివృద్ధి చెందాలంటే నందిగ్రామ్ లో కెమికల్ హబ్ నిర్మాణం జరగాల్సిందే. ఆ అభివృద్ధికి నందిగ్రామ్ రైతులు, ప్రజలు అడ్డంకిగా ఉన్నారు కాబట్టి వారిని తొలగించక తప్పదు. ఆ అభివృద్ధికీ నందిగ్రామ్ ప్రజలకూ ఏ మాత్రం సంబంధం లేదు కాబట్టి వారిని తొలిగించే విషయంలో పాలక వర్గాలు హ్యూమన్ ఫేస్ అనే బురఖాను ధరించాలి. అప్పుడు నందిగ్రామ్‌లో పోలీస్‌కాల్పులు, రైతుల మరణాలు, రక్తపుటేరులు అనేవి ప్రత్యక్ష పద్ధతుల్లో, కాకుండా మూడోకంటికి కూడా తెలియని పద్ధతుల్లో నందిగ్రామ్ రైతుల పొలాలకు సంబంధించిన అడ్రస్సులు వారి శవాలకు కూడా తెలియకుండా తారుమారైపోవాలి. అలాగే, ప్రజల కొరకే శాస్త్ర సాంకేతిక విజ్ఞానం అన్న నిర్వచనం 'సైన్స్ విత్ హ్యూమన్ ఫేస్'గా రూపాంతరం చెందింది. ఇప్పుడు మన కళ్లముందు సాక్ష్యాత్కరిస్తున్న కంప్యూటరైజ్డ్ హైటెక్ శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం అంతా అదే. పట్టెడన్నం కరువై ఆకలిచావుల్నీ, ఆత్మహత్యల్నీ ఆశ్రయిస్తున్న కోట్లాది మంది వ్యవసాయ

కార్మికుల్నీ, చేతివృత్తుల వారినీ ఆదుకోవాల్సిన శాస్త్ర విజ్ఞానం, కొద్ది మందికి మాత్రమే కోట్లాది రూపాయల లాభాలు, జీతభత్యాలుగా మారి వాటిని అందుకోవడానికి తమతో పోటీ పడమని, అందుకు మీ గ్రామాల్ని సైతం కంప్యూటరీకరించడానికి ఉదారంగా సహకరిస్తామని అంటున్నారంటే అందులో 'హ్యూమన్ ఫేస్' లేదనగలిగిన సాహసం చేయగలమా? ఇప్పుడు కొత్తగా ప్రజల యొక్క ప్రజల చేత, ప్రజల కొరకు పరిపాలన అన్న భావన కాస్త ఇ – గవర్నెన్స్ విత్ హ్యూమన్ ఫేస్‌గా రూపాంతరం చెందడంలో దాగిన విషాదాలు ఎలా ఉంటాయన్నది భవిష్యత్తులో అనుభవించి తెలుసుకోవాల్సిందే. మొత్తం పరిపాలనను ప్రైవేట్ వ్యక్తుల, స్వచ్ఛంద సంస్థలపరం చేయడానికి జరుగుతున్న కుట్రలో భాగమే ఇ – గవర్నెన్స్ తప్ప మరేమీ కాదు.

మళ్లీ కాస్త వెనక్కి వెళ్లి అసలు విషయానికొస్తే ఈ ప్రైవేటీకరణ, నూతన ఆర్థిక విధానాల అమలుకు సంబంధించిన ఆచరణ ఎలా పరిణామం చెందుతూ వచ్చిందన్న అంశాన్ని కూడా సూక్ష్మ స్థాయిలో లోతుగా పరిశీలించక తప్పదు. 'ఒక కుక్కను నువ్వు చంపదలచుకుంటే అది పిచ్చిదని నువ్వు ముందుగా ప్రచారం చెయ్యి' అన్నది సామెత. 1990లలో భారత సన్ ఎట్ సేన్‌గా ప్రగతి శీల ప్రజాస్వామిక వాదిగా పేరు పొందిన అరుణ్ శౌరి నాయకత్వంలో ఈ సామెతను ఆచరణలో నిజం చెయ్యడానికి భారతదేశంలో కేంద్రస్థాయిలో ఆవిర్భవించిన మంత్రిత్వ శాఖే డిజిన్వెస్ట్‌మెంట్ మినిస్ట్రీ. అప్పటికి పబ్లిక్ రంగ సంస్థల స్థాపన, అభివృద్ధి, విస్తరణల్ని పర్యవేక్షించే మంత్రిత్వ శాఖల్ని మాత్రమే చూసిన ప్రజలు ఇలా నిర్మూలించడానికి కూడా మంత్రులా? అని గగ్గోలు పెట్టడం ప్రారంభిస్తే ఆ మంత్రిత్వ శాఖనుండి వెలువడ్డ సమాధానంతో అనేక మంది నోళ్లు ముసుకు పోవడం జరిగింది. వారి మాటల్లోనే ఆనాటి వారి సమాధానం 'భారత ఆర్థిక వ్యవస్థకు గుదిబండగా మారి నష్టాల ఊబిలో నడుస్తున్న పబ్లిక్‌రంగ సంస్థల్ని ప్రైవేట్ వ్యక్తులకు అమ్మి భారత ఆర్థిక వ్యవస్థ ప్రగతిని మళ్లీ అభివృద్ధి పట్టాలపై నిలబెట్టడమే డిజిన్వెస్ట్‌మెంట్ శాఖ ప్రధాన లక్ష్యం' అని ప్రకటించడం జరిగింది. అలా నష్టాల ఊబిలో పరిశ్రమలు కూరుకు పోవడానికి కారణాలేమిటన్న సమీక్ష కనీస స్థాయిలో కూడా జరక్కపోవడం యాదృచ్ఛికమేమీ కాదు. అలా వందలాది పబ్లిక్ రంగ సంస్థలను నాలుగు సంవత్సరాల పాటు కోలాహలంగా వేలం వేశారు. ఈ దశలోనే ఆంధ్రప్రదేశ్‌లో అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయకత్వంలో పబ్లిక్‌రంగ సంస్థల కార్మికుల్నీ, ప్రభుత్వోద్యోగుల్నీ సోమరిపోతులుగాను, దొంగలు, లంచగొండులుగాను చిత్రించడంలో ఒక కొత్త వరవడికి శ్రీకారం చుట్టడం జరిగింది. యాభై సంవత్సరాల స్వతంత్ర భారతదేశ చరిత్రలో అదొక దౌర్భాగ్యమైన తిరోగమన దశ. అలా ప్రారంభమైన సంస్కరణల ప్రక్రియ నాలుగు సంవత్సరాల అనంతరం నష్టాలతో నడుస్తున్న పరిశ్రమల్ని ప్రైవేట్ వ్యక్తులు కొనడానికి ముందుకు రావడం లేదని, వారికి బోనస్‌గా లాభాల్లో ఉన్న పబ్లిక్‌రంగ సంస్థల్ని కూడా అమ్మడం అనే ప్రక్రియగా పరిణామం చెందడం కూడా ముందుగా వేసుకున్న పథకం ప్రకారం సాగిందేనన్నది ఇప్పుడు స్పష్టంగానే అర్థమౌతోంది. ఆ తదుపరి దశలో గణనీయంగా కొనసాగిన అభివృద్ధి ప్రక్రియలో ఊళ్లు ఆక్రమించి, ఇళ్లు కూలగొట్టి నిర్మించిన మెగా హైటెక్ రోడ్లు, అంతర్జాతీయ విమానాశ్రయాలు ప్రధానమైనవిగా సాగాయి. ఆధునిక యుగంలో ఉనికిలోకొచ్చిన చట్టబద్ధ రాజ్యాంగ ప్రభుత్వ వ్యవస్థలకు భూమి మీద సర్వహక్కులూ బదిలీ కావడం జరిగింది. ఏ ప్రభుత్వ వ్యవస్థలోనైనా వ్యక్తులకు సంబంధించి భూమి మీద పట్టా రూపంలో సంక్రమించే హక్కు కేవలం క్రయ, విక్రయ భుక్తి సంబంధమైన షరతులతో కూడుకున్నదే కానీ, సర్వకాల శాశ్వత హక్కు ఎంత మాత్రం కాదు. అందుకే ప్రజాప్రయోజనాలకు అవసరమైనప్పుడు ప్రభుత్వం ఎవరి హక్కు భుక్తమైన భూమినైనా, తిరిగి స్వాధీనం చేసుకునే హక్కును కలిగి ఉంటుంది. ఇక్కడ వ్యక్తుల ప్రయోజనాలు కాక ప్రజా ప్రయోజనాలు అన్న నియమం ఉల్లంఘించడానికి వీలు లేదు. ఈ పద్ధతి భారతదేశంలోనే కాక శతాబ్దాలుగా గణనీయమైన స్థాయిలో ప్రపంచ వ్యాప్తంగా అమలౌతున్న ఒక చట్టబద్ధ నియమం. భారత దేశంలో ప్రత్యేక ఆర్థిక మండళ్ల స్థాపనతో ఈ చట్టబద్ధ నియమానికి కూడా గండికొట్టి నేటి పాలకులు ప్రైవేట్ వ్యక్తుల, సమూహాల వ్యాపార లావాదేవీలకు రైతుల హక్కు భుక్తమైన పచ్చని పొలాల్ని దౌర్జన్యంగా స్వాధీనం చేసుకోవడమే కాక, యాజమాన్య హక్కుల్ని బదలాయించడమన్నది అసాంఘికమైన అనాగరిక చర్యగా మిగిలి పోతుంది.

ప్రస్తుత దశ నిర్మాణాత్మకమైన ఏ రంగంలో కూడా ప్రభుత్వ ప్రమేయం కానీ, జోక్యం కానీ అసాధ్యం, అనాలోచితం అన్న స్థాయికి చేరుకుంది. అందినకాడికి కమిషన్లు పుచ్చుకోవడం, కాంట్రాక్టులు ఖరారు చేయడం అన్న ఏకైక కార్యక్రమం మాత్రమే నేటి భారత పాలక పక్ష రాజకీయ పార్టీల ఎజెండాగా మిగిలింది. అన్నిటికన్నా విషాదకరమైంది, ప్రస్తుతం భారతదేశంలో అస్తిత్వంలో ఉన్న పార్లమెంటరీ ప్రజాస్వామ్య రాజకీయ పక్షాల్లో ప్రధానమైన మూడు కూటముల్లో (యుపిఎ, ఎన్‌డిఎ, వామపక్షాలు) ఏ ఒక్క కూటమీ కూడా ఈ చట్ట వ్యతిరేక, అప్రజాస్వామిక పద్ధతుల్నీ, విధానాల్నీ సూత్రబద్ధంగా వ్యతిరేకిస్తున్న దాఖలాలు మచ్చుకైనా కనిపించకపోవడమే కాక వారి గత చరిత్రను కూడా మరచి, ప్రవర్తించడం జరుగుతోంది. యుపిఎ కూటమికి నాయకత్వం వహిస్తున్న నేటి కాంగ్రెస్ పార్టీ గతంలో సంస్థానాలు, రాజభరణాల రద్దు మొదలుకొని భూ సంస్కరణలు, పట్టణ భూ గరిష్ఠ పరిమితి లాంటి చట్టాల రూపకల్పనకూ నాయకత్వం వహించిందన్న స్పృహకూడా లేకుండా ప్రవర్తిస్తుంటే మరో వైపు భూస్వాముల, జాగీరుదారుల కబంధ హస్తాల్లో చిక్కుకున్న వేలాది ఎకరాల భూమిని విముక్తం చేయడానికి దున్నేవారిదే భూమిహక్కు అంటూ దేశ వ్యాప్తంగా మహత్తరమైన త్యాగాలతో పోరాటాల్ని నడిపిన చరిత్ర కలిగిన కమ్యూనిస్టుల పార్టీలు వామపక్ష కూటమికి నాయకత్వం వహిస్తున్నాయి. వీటి మధ్య అధికారం కొరకు ఆబగా అర్రులు చాస్తున్న ఎన్‌డిఎ కూటమికి నాయకత్వం వహిస్తున్న భారతీయ జనతా పార్టీకి గతంలో నినదించిన 'భారతీయుడిగా బతుకు – భారతీయులు తయారు చేసిన వస్తువులనే కొని వినియోగించు' (బి ఇండియన్ – బై ఇండియన్) అన్న నినాదాలు ఈనాడు కనీస స్థాయిలో కూడా గుర్తుకు రాకపోవడం మరీ ఆశ్చర్యం గొలిపే అంశం. ఈ అన్ని కూటముల ఆరాటం, పోరాటమంతా కూడా ఆ రాజ్యాంగ వ్యతిరేక విధానాలకు ఎవరు నాయకత్వం వహించాలన్నదే కావడం మరింత విషాదకరమైన వాస్తవం.

గతాన్ని విస్మరించి భవిష్యత్తును నిర్మించడమన్నది ఎలా సాధ్యం కాదో అలాగే ప్రారంభాన్ని మరిచిపోయిన వారు గమ్యాన్ని చేరడం కూడా

నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో సెజ్‌లు పేదల జీవితాలపై సాగిస్తున్న దాడికి రెండు ఉదాహరణలిస్తున్నారు **ఘంటా చక్రపాణి**

# దళితవాడకు చైనా గోడ

సెజ్‌లు ఆర్థిక వ్యవస్థకూ, రాష్ట్ర అభివృద్ధికీ వరప్రసాదాలని ప్రభుత్వాలు భావించవచ్చుగాక. దళితులకు మాత్రం అవి శాపాలుగా పరిణమిస్తున్నాయి. తడ మండలం మాంబట్టులో ఇవాళ దాదాపు రెండు వందల దళిత కుటుంబాలు పూర్తిస్థాయి దిగ్బంధంలో బిక్కుబిక్కు మంటున్నాయి. ఒకవైపు భూములు కోల్పోయి, పనులు కోల్పోయి వీధిన పడ్డ ఈ కుటుంబాలు రేపు చచ్చిపోయినా పాతిపెట్టేందుకు ఏడడుగుల స్థలం లేదని వాపోతున్నాయి. 'సెజ్' పేరుతో ఈ గ్రామంలో 708 ఎకరాల స్థలాన్ని ఆక్రమించిన చైనా కంపెనీ అపాచీ, ఆ స్థలం చుట్టూ భారీ గోడను నిర్మించింది. నిజానికి ఆ కంపెనీకి ఇచ్చిన స్థలంలో 189 సర్వే నెంబర్లో ఉన్న ప్రభుత్వ భూమిని గత ఇరవై ఐదు సంవత్సరాలుగా దళితులు సాగుచేసుకొంటున్నారు. ఇది గ్రామ బంజరు భూమిలో భాగమే అయినా దళితుల స్వాధీనంలో ఉంది. 18 మంది దళితులు, రెండు తరాలుగా ఆ భూమిని అనుభవిస్తున్నారు. హఠాత్తుగా అపాచీ కంపెనీ దాన్ని స్వాధీన పరచుకోవడంతో 18 కుటుంబాలు రోడ్డున పడ్డాయి. అది ప్రభుత్వ భూమి కాబట్టి ఎలాంటి నష్టపరిహారం ఇచ్చేది లేదని స్థానిక రెవెన్యూ అధికారులు తేల్చి చెప్పేశారు. దిక్కుతోచని స్థితిలో ఉన్న ఈ రైతులంతా ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర రెడ్డి గత ఏడాది ఫిబ్రవరిలో అపాచీ సెజ్‌ను సందర్శించినప్పుడు వారి గోడు వినిపించి, వినతిపత్రాన్ని అందజేశారు. ఆ తరువాత ఏడాది కాలంగా ముఖ్యమంత్రి తో పాటు, కలెక్టర్‌కు, ఎం.ఆర్.ఓ కు వినతిపత్రాలు ఇస్తూనే ఉన్నారు. అయినా స్పందన లేదు సరికదా అపాచీ కంపెనీ సరిహద్దు లోపలి భాగంలో ఉన్న దళితుల స్మశానవాటిక కూడా దక్కకుండా పోతోంది.

ప్రభుత్వం అపాచీకి ఇచ్చిన భూమిలో దళితుల భూములు, చెరువులతోపాటు దేవాలయాలు మొత్తం దళితవాడ ఉంది. అయితే దళితుల ఆందోళనతో దళితవాడను కూల్చివేయకుండా ఆపేశారు. అప్పుడు కలెక్టర్, స్థానిక శాసనసభ్యులు దళితవాడ సందర్శించి వారిని ఖాళీ చేయించి వేరే చోట పునరావాసం కల్పించాలని ప్రయత్నించారు. కానీ గ్రామంలో ఎక్కడా గజం స్థలం కూడా ప్రభుత్వ ఆధీనంలో లేదు. ప్రైవేట్ స్థలం కొని ఇళ్లు నిర్మించాలన్న ప్రతిపాదన కూడా పరిశీలించారు. అయితే అప్పటికే ప్రైవేట్ భూముల ధరలు 9 లక్షలకు ఎకరం అయ్యాయి. పైగా అమ్మేవారు కరువైపోయారు. మరీ దళితులకు అంత ఖరీదయిన పునరావాసం వద్దనుకున్నారేమో, కాలనీ ఉన్న 8 ఎకరాల స్థలాన్ని మినహాయించి, అపాచీ కంపెనీకి మరో వైపు ఆ స్థలం ఇచ్చారు. అయితే దళితుల ఇళ్లు ఉన్న స్థలం మినహాయించి సాగుభూములు, స్మశాన వాటిక, నీటి వనరులన్నీ అపాచీ స్థలంలోనే ఉన్నాయి. ఇప్పుడు ఇళ్ల స్థలాలు వదిలేసి గోడ నిర్మాణం పూర్తిచేసేందుకు అపాచీ ప్రయత్నిస్తోంది. ఈ గోడ పూర్తయితే దళితుల స్మశాన వాటిక కూడా మిగలకుండా పోతుంది.

'మా తండ్రుల కాలం నుంచి ఈ భూమిని నమ్ముకొన్నాం. ఇక్కడే బతికాం ఇవ్వాళ పట్టా లేదని పైసా ఇవ్వకుండా తరిమేశారు. పాతికేళ్లుగా మా సాగులో ఉన్న భూమి మాకు దక్కకుండా పోయింది' అని నెల్లూరు

---

సాధ్యం కాదు. భారత దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థ ఇంతటి సంక్లిష్టమైన సంక్షోభంలో కూరుకుపోవడానికి చారిత్రక కారణాలేమైనా ఉన్నాయా? అన్నది చర్చనీయాంశం. బహుశా ఇన్ని అవస్థలకు కారణ మైన వ్యవస్థ స్వరూప స్వభావాల్ని విశ్లేషించుకోవడం లోనూ, నిర్వచించుకోవడంలోనూ జరుగుతున్న వైఫల్యం కూడా ఆ సంక్షోభాన్ని తీవ్రతరం చేస్తోందేమోనన్న అనుమానం కూడా సత్యమైనదే. నేటికీ భారత వ్యవస్థ భౌతికంగానూ, భావజాల పరంగానూ, ప్రధానంగా భూస్వామ్య వ్యవస్థగానే కొనసాగుతోందన్నది ఒక వాదం. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఐరోపా దేశాల్లో భూస్వామ్య సమాజానికి వ్యతిరేకంగా కొనసాగిన ప్రజాస్వామ్య పోరాటాలు విజయవంతమై ఆ సమాజాలు ఎంతోకొంత ప్రజాస్వామికీకరణకు నోచుకోవడం సాధ్యమైంది. భారతదేశంలో 1850లో ప్రారంభమై 1947 వరకు కొనసాగిన స్వాతంత్ర్యోద్యమం అధికార మార్పిడితో అర్థాంతరంగా ఆగిపోవడం మూలంగా ఈ దేశంలో ప్రజాస్వామిక విప్లవం. దాని కొనసాగింపుగా జరగాల్సిన ప్రజాస్వామికీకరణ అర్థాంతరంగానే నిలిచిపోవడం జరిగింది. మాటల్లో మనం చెప్పుకుంటున్న భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఒక ఆకాంక్షగానే మిగిలిపోయింది. దాన్ని మనం ఇంకా సాధించుకోవడం అన్నది జరగాల్సి ఉంది. భారత సమాజాన్ని శాసిస్తున్న వర్గాలు (క్లాసెస్), పాలిస్తున్న శక్తులు భౌతికంగానూ, భావజాల పరంగానూ భూస్వామ్య శక్తులే. వారికి వ్యతిరేకంగా కలిసొచ్చే అన్ని జాతీయ శక్తులు, వర్గాలు ఐక్యమై మరో స్వాతంత్ర్య సంగామంగా నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని సాగించందే భారత సమాజాన్ని ప్రజాస్వామికీకరణ చేయడం సాధ్యం కాదు. అలాంటి పరిపక్వమైన ప్రజాస్వామ్య వ్యవస్థ నెలకొల్పుకోలేనంత కాలం ప్రజలకు ఈ కష్టాలు, నష్టాలు తప్పవేమో. ◆

అమాసయ్య అనే బాధితుడు భోరున విలపించాడు. 'మా పిల్లలకు ఆడుకునే స్థలం లేదు, పశువులకు మేసే వీలు లేదు. చివరికి మా ఆడాళ్లకు దొడ్డికెళ్లడానికి కూడా కాసింత చోటు వదలట్లేదు. మేం ఈ ఉళ్లో పరాయి వాళ్లమైపోయాం' అని ఈదురు నాగయ్య ఆవేదన వ్యక్తం చేశారు. మా సాగులో ఉన్న భూమిని తెల్లొడి కంపెనీకి వదిలేస్తే ఆ కంపెనీలో ఉద్యోగాలిస్తామన్నారు. ఇప్పుడేమో చదువులేదని, వయసు దాటిపోయిందని ఆ గేటు లోపలికి కూడా రానివట్లేదు. కనీసం గోడలకు, చెట్లకు నీళ్లు పోసే ఉద్యోగం కూడా ఇవ్వడం లేదు. ఆ పనికి కూడా తమిళనాడు వాళ్లను తెచ్చుకుంటున్నారు అని, అనేకమంది యువకులు ఫిర్యాదు చేస్తున్నారు. 'మా పొలాలు, మా స్థలాలు వేరే దేశం వోడికి వొదిలి మా వూళ్లోమేమే పరాయి వాళ్లమైపోయినాం' అని అంటున్న పిల్లి చిన్నయ్య ఆవేదనలో అర్థం ఉంది. ఈ భూయజ్ఞం ఇలాగే సాగితే కచ్చితంగా మన వూరికి మనమే పరాయివాళ్లమైపోతాం.

## ఉద్యోగాలెన్ని, ఎవరికి?

అపాచీ కంపెనీ సెజ్ చూస్తేనే అది మన దేశానికి చెందినది కాదని అర్థమైపోయింది. పొడవాటి గోడ భారీగేటు, భద్రతకోసం చెక్‌పోస్ట్, విశాలమైన రోడ్లు దూరంగా ఓ చిన్నసైజు భవనం. అక్కడ మిలియన్ డాలర్ల పరిశ్రమ ఉందంటే నమ్మలేం. కంపెనీ గేటు పక్కనే ఒక బోర్డు ఉంచారు. ఆ బోర్డుపై కంపెనీ ఉద్యోగావకాశాలు కల్పిస్తుందనీ, ఉద్యోగాల కోసం నేరుగా దరఖాస్తు చేయాలనీ రాసి ఉంది. ప్రతిరోజూ చుట్టు పక్కల గ్రామాల నుంచి వందలాది మంది యువకులు, విద్యార్థులు అక్కడికి చేరి కంపెనీకి దరఖాస్తులు రాయడం, ఇంటర్వ్యూల కోసం ఎదురుచూడడం అక్కడ నిత్యం కనిపిస్తుంటుంది.

కంపెనీ 30 వేల మందికి ఉపాధి కల్పిస్తుందని మొదట ప్రచారం జరిగింది. కానీ ప్రస్తుతానికి రెండువేల మందితో పని సాగుతోంది. అయితే కంపెనీ నియమ నిబంధనల ప్రకారం అక్కడ దొరికే ఉద్యోగం మనిషి జవజీవాలు పీల్చిపిప్పి చేయడం కోసమేననిపిస్తోందని ఉద్యోగులు వాపోతున్నారు. ప్రస్తుతం తీసుకొంటున్న ఉద్యోగుల్లో చాలా వరకు ఎలాంటి వృత్తి నైపుణ్యం లేని వాళ్లే అధికం. వారికి రెండువేల ఐదు వందల జీతం, యూనిఫాం ఇస్తారు. సాధారణంగా కంపెనీలో 18-25 సంవత్సరాల లోపు వారినే తీసుకొంటారు. ఉద్యోగంలోకి తీసుకునేటప్పుడే ఇది తాత్కాలికమనీ, సంఘాలూ, సమ్మెలూ, కార్మిక చట్టాలకూ అతీతంగా ఉండాలని ఒప్పందం చేయిస్తారు. అంతేకాక 35 సంవత్సరాలు దాటిన వెంటనే పనుల్లోంచి తొలగిస్తామని కూడా చెపుతున్నారని ఉద్యోగులంటున్నారు. అంటే ఒక పది సంవత్సరాల పాటు కాంట్రాక్టు పద్ధతిలో ఈ ఉద్యోగాలుంటాయన్నమాట.

మరో వైపు జిల్లాలో ఇదొక కొత్త ఆకర్షణ అయిపోయింది. రోజూ వందలాది మంది అక్కడికి ఉద్యోగాలాశించి చేరుతున్నారు. ముఖ్యంగా ఇంటర్మీడియట్ పూర్తయిన పిల్లలు ఆడా, మగా తేడా లేకుండా అక్కడికి చేరుతున్నారు. చదవాలన్నా కోరిక, చదువుకునే స్తోమత ఉన్నా అనేక మంది 20 సంవత్సరాలలోపు పిల్లలు ఈ ఉద్యోగాల పట్ల ఆకర్షితులవుతున్నారు. "ఇది భవిష్యత్తులో జిల్లా యువత పై ముఖ్యంగా ఆ ప్రాంత గ్రామాలపై తీవ్ర ప్రభావం పడుతుంది. వెనుకబడిన ప్రాంతాలైన ఆ గ్రామాల్లో ఉన్నత విద్యలోకి పోకుండా, తాత్కాలిక ఒత్తిడిలో చదువు మానేసి అనేక మంది ఆ ఉద్యోగాలకు ఆశపడుతున్నారు. ఇది మరింత వెనుకబాటుకూ, సామాజిక అశాంతికీ కారణం అవుతుంది" అని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం సామాజిక శాస్త్ర ప్రొఫెసర్ ఎస్. భాస్కర్ అంటున్నారు. ఇది మానవ వనరుల అభివృద్ధి నిరోధక చర్య అని ఆయన పేర్కొన్నారు.

మరో వైపు ఉన్నత పదవుల్లో దాదాపు 120 మంది చైనా ఉద్యోగులే ఉన్నారు. వాళ్లందరూ ఆంధ్ర-తమిళనాడు సరిహద్దుల్లో ఉన్న రామాపురంలో ఎపి టూరిజం నిర్వహించే పున్నమి గెస్ట్‌హౌస్‌లో ఉంటున్నారు. అలాగే అక్కడే ఒక ప్రైవేట్ కళాశాల భవనాన్ని అద్దెకు తీసుకొని అన్ని హంగులలూ సమకూర్చుకొన్నారు. ప్రతిరోజూ వాళ్లంతా టయోటా ఇన్నోవా కార్లలో కంపెనీకి వస్తుంటారు. ◆

**నేషనల్ సాంపిల్ సర్వే ప్రకారం నలభై శాతం మంది రైతులు వ్యవసాయం నుంచి తప్పకుందామని అనుకుంటున్నారని, వ్యవసాయాన్ని నష్టదాయకంగా మార్చి భూమిని విడిచిపోయేలా చేసే కుట్రలో భాగంగానే ఇదంతా జరుగుతోందంటున్నారు వి. హనుమంతరావు**

# ఆర్థిక స్థితి చూపు ఆకాశం వైపు; వ్యవసాయం నేల చూపు

దేశ ప్రజలు ఆతృతగా ఈసారైనా బడ్జెట్లో వ్యవసాయ రంగానికి న్యాయం లభిస్తుందా అని ఆశతో, ఎదురు చూచి హతాశుల య్యారని చెబితే చాలా తక్కువ చెప్పినట్లే అవుతుంది. ఇలా జరుగుతుందని నాకు తెలుసు. నాకేమీ జ్యోతిష్య శాస్త్రం రాదు; కాని బడ్జెట్‌ను ప్రవేశ పెట్టినవాళ్ల జాతకాలు తెలుసు. అందుకనే ఇంతకు ముందు సంచికలో "కేంద్ర బడ్జెట్ వ్యవసాయ రంగాన్ని గట్టెక్కిస్తుందా" అనే ప్రశ్నార్థకంతో వ్యాసాన్ని రాశాను కాబట్టి, ఆ పని జరిగిందా అని మళ్లా అదే విషయాన్ని విశ్లేషిస్తూ ఈ వ్యాసం రాస్తున్నా.

ఆర్థికమంత్రి చిదంబరంకు గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి అక్కడి ప్రజల ఆర్థికాభివృద్ధి అంటే ఎడమొఖం, పెడమొఖం. వాళ్లు పండించే పంటలంటే మహా ఇష్టం; వాళ్లంటే కాదు. ఒక ఉదాహరణ నూరురోజుల ఉపాధి పథకాన్ని ప్రధాని కార్యాలయం జోక్యం కలుగ చేసుకోకపోయి ఉండిన పక్షంలో ఈ పథకం పుట్టకుండానే చచ్చిపోయి ఉండేది. ఈ పథకం చిత్తు ప్రతిరూపంలో ఉన్నపుడే లంచగొండితనం గురించి ఒక క్లాజు ఉండాలని ఆర్థికమంత్రిత్వ శాఖ మోకాలడ్డు పెట్టింది. లంచగొండి తనం జరిగిందని తెలిస్తే, నిధులు దుర్వినియోగం జరిగితే, కేంద్రం నిధులను నిలిపివేస్తుందనే సవరణ ఉండాలని పేచీ పెట్టింది. సరే బిల్లు పార్లమెంట్ ఆమోదం పొందిన తర్వాత మొత్తం కేటాయింపులో పరిపాలనా వ్యయం రెండు శాతం మించరాదని మరోకాలడ్డు పెట్టింది. ప్రస్తుత బడ్జెట్ ప్రవేశపెట్టేముందు ఈ పథకాన్ని మరో 200 జిల్లాలకు విస్తరించాలని గ్రామీణాభివృద్ధి మంత్రిత్వ శాఖ ప్రతిపాదిస్తే మొదట వ్యతిరేకించి, ఆఖరుకు 130 జిల్లాలకు అంగీకరించినా బడ్జెట్ మాత్రం పెంచలేదు. గ్రామీణాభివృద్ధిశాఖ మంత్రి తన అసంతృప్తిని తెలియజేస్తూ "నార్త్‌బ్లాక్ (ఆర్థిక మంత్రిత్వశాఖ కార్యాలయ భవనం) గ్రామీణ వ్యతిరేక, పేదల వ్యతిరేక భవనమని" వర్ణించారు. ఇలాంటి గ్రామీణ వ్యతిరేక ఆర్థికమంత్రి వ్యవసాయానికి ఏదో మేలు చేస్తాడంటే ఎలా నమ్మడం.

వ్యవసాయానికి తన బడ్జెట్ ఉపన్యాసంలో 15 నిమిషాలు వెచ్చించినట్లు ఆర్థికమంత్రి గొప్పగా చెప్పుకొన్నారు. అక్కడికేదో 15 నిమిషాలు మాట్లాడితే, ఎక్కువ నిధులు కేటాయించినట్లు, తాను వ్యవసాయానికి ఎంతో ప్రాముఖ్యం ఇచ్చినట్లు ప్రజలు అనుకోవాలని ఆయన ఆశ. ఇంకా నయం, ఇన్ని నిమిషాలని కాక, ఇన్ని సెకెండ్లనో, ఇన్ని వందల, వేల మాటలు మాట్లాడాననో సొంత డబ్బా కొట్టుకోలేదు.

## ఈ కేటాయింపులు రైతులను బాగు చేస్తాయా?

వ్యవసాయశాఖకు కేటాయింపు ప్రస్తుత సంవత్సరంలో కన్నా 2007-08లో 25 శాతం పెంచి రు. 50,122 కోట్లు ఖర్చు చేయబోతుంది. ఇంత శాతం పెరుగుదల అభినందనీయమే; సెభాష్ అనాలనిపించింది కానీ, కళ్లు కాస్త పెద్దవి చేసుకొని చూడబోతే ఈ కేటాయింపు కేవలం వ్యవసాయానికి మాత్రమే కాక గ్రామీణాభివృద్ధి వగైరా శాఖలన్నిటికీ కలిపి చేసిన కేటాయింపు. గ్రామాల్లో 70 శాతం మంది వ్యవసాయాధారంగా జీవిస్తుంటే, అందులో చిన్న, సన్నకారు రైతులు వ్యవసాయ కూలీలు 70 శాతం. 110 కోట్ల జనాభాకు వారు తిండి గింజలు అందచేస్తున్నారు. వారు వీథిన పడుతున్నారంటే, ఆత్మహత్యలు చేసుకొంటు న్నారంటే ఆశ్చర్యమేముంది? అయితే, వ్యవసాయానికి ఈ దుర్గతి, ఈ సంక్షోభం ఏర్పడిందంటే దానికి చిదంబరమే కారణమని నేననడంలేదు. ప్రభుత్వ విధానమనే తానులో చిదంబరం ఒక ముక్క మాత్రమే. గత వ్యాసంలో పేర్కొన్నట్లు ఆ మధ్య రాష్ట్రానికి వచ్చినపుడు రాష్ట్ర ముఖ్యమంత్రి వ్యవసాయం మీద ఆధారపడే వారి సంఖ్యను తగ్గించాలని సలహా ఇచ్చారు. చంద్రబాబు అధికారంలో ఉన్నపుడు రైతుల సంఖ్యను మూడో వంతుకు తగ్గించాలన్నారు. ప్రపంచబ్యాంక్ ఈ సలహాను 1991లోనే ఇచ్చింది. బుష్ ఆంధ్రప్రదేశ్‌కు వచ్చినపుడు వ్యవసాయ విశ్వవిద్యాలయానికి నేరుగా వెళ్లటం, ఆయన తిరిగి వెళ్లిపోయిన 15-20 రోజుల్లోనే వైస్-ఛాన్సలర్ నాయకత్వంలో ఒక ప్రతినిధి వర్గం అమెరికా వెళ్లటం ఎందుకో, ఏమి జరిగిందో ఊహించటం కష్టమేమీ కాదు. అలాగే కార్పొరేట్ రంగం ఇప్పటికే వ్యవసాయరంగంలో ప్రవేశించి రానురాను అగ్రో-ప్రాసెసింగ్ పరిశ్రమల అభివృద్ధి పేరుతో భూములు కొనుగోలు చేయటం, లేదా చిన్న, సన్నకారు రైతాంగాన్ని వారి భూముల్లోనే కూలీలుగా మార్చటం, ఆహార పంటల స్థానే పళ్లు, పువ్వులు పండించాలనటం - ఇదే మన ప్రస్తుత వ్యవసాయ విధానంగా రూపుదిద్దుకొంటోంది. డా. స్వామినాథన్ కమిషన్ నివేదిక, దాని సిఫార్సులు అంగీకరిస్తున్నామని ప్రభుత్వం అంగీకరించినట్లు ప్రకటించవచ్చు. కాని ఆ ముసుగులో అమలు పరిచేది పైన చెప్పిన విధానమే. కేటాయింపుల పెరుగుదలే రైతుల పరిస్థితిని మార్చవు.

## డబ్బు బ్యాంకులది - పేరు ప్రభుత్వానిది

ప్రస్తుత సంవత్సరంలో రు. ఒక లక్షా తొంభైవేల కోట్లకు చేరబోతున్న వ్యవసాయ రుణాలను 2006-07లో రు. రెండు లక్షల ఇరవై ఐదు వేల కోట్లకు పెంచుతారట. ఈ ప్రభుత్వం అధికారంలోకి రావటంతోనే, వచ్చే మూడు సంవత్సరాల్లో రెట్టింపు రుణాలిస్తామన్న వాగ్దానానికి మించి రుణం ఇచ్చారు. కాబట్టి రాబోయే సంవత్సరంలో కూడా ఈ వాగ్దానాన్ని నిలుపు కోవచ్చు. చప్పట్లు కొడదామా? ఆగండి ఈ రుణాన్ని బడ్జెట్‌లో నుంచి ఇవ్వటం లేదు. జాతీయ బ్యాంకుల చేత ఇప్పిస్తోంది ప్రభుత్వం. అత్తసొమ్ము అల్లుడు దానం చేసినట్టన్నమాట. ఈ బ్యాంకులు ఇప్పటికే ప్రభుత్వం ఆదేశించిన 18 శాతం (బ్యాంకులిచ్చిన మొత్తం రుణంలో) ఇవ్వటం లేదని బ్యాంకింగ్ రంగం లెక్కలే చెబుతున్నాయి. ప్రభుత్వం ఇప్పిస్తానంటున్న రుణం వైఫల్యం చెందిన ఈ బ్యాంకుల నుంచే కాబట్టీ, బ్యాంకులిచ్చే రుణాలు మొత్తం రైతాంగంలో 20 శాతం మందికే అందుతున్నాయి కాబట్టీ వారికి, కొత్తగా మరో 50 లక్షల మందికి మాత్రమే అందుతాయి. దేశంలో మొత్తం 21 కోట్ల కుటుంబాల్లో 70 శాతం వ్యవసాయం మీద ఆధారపడినవారే. ఇంత మందికి రుణం అవసరం కాగా, మరో 50 లక్షల మందికి రుణం ఇస్తాననటం సముద్రంలో కాకి రెట్టంత. మరో విషయం, గ్రామీణ ప్రాంతాల్లో బ్యాంకు శాఖలను 35 వేల నుంచి 32 వేలకు కుదించారు. రైతులు ఏ మేరకు బ్యాంకుల్లో డిపాజిట్లు జమచేస్తున్నారో ఆ మేరకు కూడా రుణాలు రైతులకు అందటం లేదు. అంటే గ్రామాల్లో డిపాజిట్లు వసూలు చేసి పట్టణాల్లో, నగరాల్లో, తీసుకున్న అప్పును ఎగ్గొట్టే కార్పొరేట్ రంగానికి సమర్పిస్తున్నా రన్నమాట. బ్యాంకులు హెచ్చు రుణాలిస్తు న్నాయనే దాని వెనుక ఒక అడ్జస్ట్‌మెంట్ల ద్వారానే ఎక్కువ రుణం ఇస్తున్నారని తెలియని రైతు లేదు. ఈ రుణభారమే రైతుల ఆత్మహత్యలకు దారి తీస్తుందనే విషయం చిదంబరం ఉపన్యాసంలో ఎక్కడా లేకపోవటం గమనార్హం. వ్యవసాయం లో ఎక్కువలో ఎక్కువ పెట్టుబడి వడ్డీ వ్యాపారస్తుల నుంచి అనీ, వాళ్ల వడ్డీ పేరుతో రైతును ముంచేస్తున్నారనీ, కాబట్టి ఈ ప్రైవేట్ వడ్డీ వ్యాపారస్తులను కట్టడి చేయాలనీ, వడ్డీ నాలుగు శాతానికి తగ్గించాలనీ, ప్రస్తుత రుణభారాన్ని మాఫీ చేయాలనీ రైతాంగం, వ్యవసాయార్థిక నిపుణులు పదే పదే చెపుతున్నా చిదంబరం మాట్లాడక పోవటం వ్యవసాయం పట్ల, రైతాంగం పట్ల వారు చూపించేది కపట ప్రేమ అని తేటతెల్లమవుతుంది.

## మరో సస్య విప్లవం

ప్రధాని మన్మోహన్ సింగ్ మరో సస్య విప్లవం కావాలన్నారు. బడ్జెట్ ఉపన్యాసంలో దాని ఊసేలేదు. ఆహారధాన్యాలను దిగుమతి చేసుకొంటేే తప్ప ప్రజలకు తిండి పెట్టలేని నేపథ్యంలో సస్యవిప్లవ సాంకేతిక విజ్ఞానాన్ని దిగుమతి చేసుకున్నాం. పెట్టుబడుల పెరుగుదల, విస్తరణాధికార వ్యవస్థ ఏర్పాటు, నీటిపారుదల రంగానికి అధిక కేటాయింపులూ, పంట ధర పెంపూ, కనీస ధర గ్యారంటీ, ధాన్యసేకరణా – క్లుప్తంగా ఇది సస్య విప్లవం వ్యూహం. అధిక దిగుబడి వంగడాల వినియోగం వల్ల ఉత్పత్తి, ఉత్పాదకత పెరిగి ఒకే రకమైన స్వయం పోషకత్వాన్ని సాధించాం. సబ్సిడీలిచ్చే విధానం ఆ కాలంలోనే ప్రారంభ మైందనుకుంటా. ఈ వ్యూహం ఫలితాలనివ్వటం స్తంభించిపోయింది. ప్రత్యామ్నాయ విధాన మేది? బయోటెక్నాలజీ అనేది శబ్దకాలుష్యానికీ పరిమితమైంది. మళ్లా దిగుమతుల మీద ఆధారపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. బడ్జెట్ ఉపన్యాసంలో వ్యూహ ప్రకటనకు అవకాశం వుండదు కాని ఈ రంగంలో చిదంబరం ప్రకటించిన చర్యలు ఫైర్–ఫైటింగ్ చర్యలే గాని, వ్యవసాయాన్నీ, రైతాంగాన్నీ సంక్షోభం నుంచి బయటపడ వేసే చర్యలుకావు. విధాన ప్రకటన త్వరలో వెలువడనున్నదనేమాట కూడలేదు.

## చిదంబరం మాయాజాలం

వ్యవసాయ బడ్జెట్ వట్టి డొల్ల అంటున్నారు ఆర్థిక విషయాల వాఖ్యాత ఎస్. గురుమూర్తి (హిందూ, మార్చ్ 2, 2007). ఆయన గమనించిన కొన్ని విషయాలు ఆసక్తికరంగా ఉన్నాయి. వ్యవసాయాన్ని ఉద్ధరిస్తానంటూ చిదంబరం 18 పాయింట్ల ఎజండా పార్లమెంట్ ముందుంచగా అందులో రెండు విషయాలు ప్రధాని పరిశీలనలో ఉన్నాయనీ, మరో ఏడు విషయాలు వట్టి ప్రకటనలు మాత్రమేననీ (రైతుల శిక్షణ, పప్పు దినుసుల మిషన్ లాంటివి), మరో ఏడు పథకాలు ప్రస్తుతం అమలులో ఉన్నవేననీ, అయితే వాటి కేటాయింపులు కాస్త పెంచటం మాత్రమే జరిగిందనీ, కొత్తగా ప్రారంభించ బోయేవి కేవలం రెండు పథకాలు మాత్రమే అనేది ఆయన విశ్లేషణ. గత మూడేళ్లుగా అమలులో ఉన్న చెరువుల పునరుద్ధరణను పునఃప్రస్తావించటం ద్వారా ఏదో కొత్త పథకం అన్న భ్రమను కలిగించ ప్రయత్నించారు. ఈ పథకానికి కావాల్సిన నిధులను సమకూర్చేది కేంద్ర ప్రభుత్వం కాదు, ప్రపంచ బ్యాంకు.

## వ్యవసాయంపై కార్పొరేట్ కన్ను

ఈ విషయంపైన చెప్పటం జరిగింది. వ్యవసాయం పై ఆదాయపు పన్ను లేకపోవటం కార్పొరేట్లకు ఒక ఆకర్షణ. వ్యవసాయోత్పత్తుల ప్రాసెసింగ్ పరిశ్రమలు పెడితే ఎగుమతి చేయవచ్చుననీ, పెరుగుతున్న ఉన్నత, మధ్య తరగతి ఒక పెద్ద మార్కెట్ కాబోతుందనీ, ఈ పరిశ్రమలను పట్టణాల్లో, నగరాల్లో కాకుండా గ్రామీణ ప్రాంతాల్లోనే వ్యవసాయోత్పత్తులు దొరికే ప్రాంతాల్లోనే స్థాపిస్తే, కార్మికులు చవగ్గా లభిస్తారని వారి ఆలోచన. ఈ ఆహారోత్పత్తులు పండించడానికి భూమికావాలి. ఈ భూమి చిన్న, సన్నకారు రైతుల చేతుల్లో ఉంది. వారిప్పటికే చితికిపోయి ఉన్నారు. నేషనల్ సాంపుల్ సర్వే ప్రకారం దేశంలో 40 శాతం మంది వ్యవసాయం నుంచి తప్పుకుందామని అనుకొంటున్నారు. బతికుంటే బలుసాకు తినవచ్చుననే ఆలోచనలో పడ్డారు. వ్యవసాయం ఖర్చులు ఎంత ఎక్కువగా పెరిగితే వాళ్లు అంత త్వరగా ఆ భూములను ఎంత ధరకైనా అమ్మేసు కొంటే మంచిదనే ఆలోచన వారి మనసుల్లో ఎంత బలంగా నాటుకొంటే, వాళ్లు అంత చవగ్గా అమ్మడానికి సిద్ధపడతారు. మీ చేతులకు దాసోహం అంటున్న ప్రభుత్వం ప్రస్తుతం వ్యవసాయాన్ని ఎంత నష్టజాతకంగా దిగజారిస్తే చిన్న రైతులు అంత త్వరగా భూమిని వదిలి పెడతారు. అందుకనే, ఒక పక్క వ్యవసాయం ప్రాముఖ్యత గురించి ఉపన్యాసాలు దంచుతూనే, రెండో పక్క పై విధమైన కుట్ర పన్నుతున్నారు. వ్యవసాయం పై ఆధారపడే వారి సంఖ్యను బాగా కుదించాలనే ప్రధాని పిలుపు వెనుకనున్న ప్రభుత్వ ఆలోచన ఇదే. ఒక్క మాటలో చెప్పాలంటే వ్యవసాయం కొనసాగుతుంది కాని వ్యవసాయ దారులుండరు. పంటలు బాగా పండుతాయి కాని తిండి గింజలను దిగుమతి చేసుకొంటాం. ◆

**తెలంగాణకు సాగునీరు, తాగునీరు, పరిశ్రమల అవసరాలు తీరుస్తోన్న శ్రీరాంసాగర్, బాబ్లీ ప్రాజెక్ట్ వల్ల 18 లక్షల ఎకరాల ఆయకట్టు ఎడారిగా మారిపోయే ప్రమాదం ఉందంటున్న రఘువీర్**

# తెలంగాణ - బాబ్లీ ప్రాజెక్ట్

తెలంగాణ ప్రాంతానికి తీవ్ర నష్టం తెచ్చేవి ప్రస్తుతం అతి వేగంగా నిర్మితమవుతున్న బాబ్లీ, పోతిరెడ్డి ప్రాజెక్టులేనని రాజకీయ నేతలు, ఇంజనీరింగ్ నిపుణులు చెబుతున్నారు. బాబ్లీ ప్రాజెక్ట్ మహారాష్ట్రకు లాభం చేకూరిస్తే, పోతిరెడ్డిపాడు కడపకు లబ్ది చేకూరుస్తుంది. ఆయా ప్రాంతాలకు లబ్ది చేకూర్చే క్రమంలో తెలంగాణ ప్రాంతానికి తీవ్ర నష్టం తేనున్నాయి. అందులో బాబ్లీ ప్రాజెక్ట్ తెలంగాణకు మరణ శాసనంగా మారనుంది. ఎంతో కొంత సాగునీటిని అందిస్తున్న శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్‌కే ఎసరుపెడుతుంది. తాగునీటి సౌకర్యం పేరుతో బాబ్లీ ప్రాజెక్ట్ చేపట్టినా, దానికి గేట్లు నిర్మించి ఏకంగా 60 టిఎంసీల వరకు కొట్టేసే యత్నాలు చేస్తున్న మహారాష్ట్రపై రాష్ట్రంలోని అన్ని పార్టీలూ, అన్ని ప్రాంతాల నేతలు, ఇంజనీరింగ్ నిపుణులూ తీవ్రంగా ధ్వజమెత్తుతున్నారు. ఈ విషయంలో మహారాష్ట్ర నేత శరద్‌పవార్ కోసం తెరాస నేత కెసిఆర్ మొదట మెతక వైఖరి అనుసరించినా, పార్టీలో ఒత్తిడి రావడంతో చివరికి ఆయన కూడా సుప్రీం కోర్టు దాకా వెళ్లాల్సి వచ్చింది. విపక్షనేత, మాజీ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు బాబ్లీపై రెండేళ్లుగా ఆందోళనలు చేయిస్తున్నా, ఆయన హయాంలోనే ఈ బాబ్లీ ప్రాజెక్ట్‌కు శ్రీకారం చుట్టిన అంశానికి ఆయన సమాధానం ఇవ్వలేకపోతున్నారు. బాబ్లీతో పొంచి ఉన్న ప్రమాదాన్ని అధికారంలో ఉండగా గుర్తించలేని టిడిపి, విపక్షంలోకి వచ్చాక గగ్గోలు పెట్టడంపై విమర్శలు వచ్చాయి. ఇకపోతే వైఎస్ ప్రభుత్వం మహారాష్ట్రలో ఉన్నది కూడా కాంగ్రెస్ ప్రభుత్వం కావడంతో పోరాటం చేయడం లేదు. కేంద్ర ప్రభుత్వం కూడా జోక్యం చేసుకుని పరిష్కరించే పరిస్థితిలో లేదు. బాబ్లీ వద్ద టిడిపి లాఠీ దెబ్బలు తిన్నా, ఢిల్లీలో ధర్నాలు చేసినా ప్రయోజనం లేకుండా పోయింది. ప్రధాని మన్మోహన్‌సింగ్ ఏకంగా టిడిపి వైఖరినే తప్పుపట్టారు. మొత్తంగా బాబ్లీ ప్రాజెక్టు నిర్మాణాన్ని నిలిపే చర్యలు ఎక్కడా కనిపించడం లేదు. రాజకీయ నేతల పరస్పర విమర్శలు, మరో పక్క ఆ పార్టీలకు చిత్తశుద్ధి లేకపోవడం మహారాష్ట్ర దూకుడుకు అవకాశం కల్పించింది. ప్రజలు నీళ్ల రాజకీయాన్ని అర్థం చేసుకుని స్వతహాగా పోరాటం ద్వారానే బాబ్లీ అక్రమాలను నియంత్రించవచ్చు. బాబ్లీపై ప్రస్తుత పరిస్థితులను ఈ వ్యాసంలో వివరించాను.

శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ డ్యాం పనులకు 1964లో అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ శంకుస్థాపన చేశారు. నిర్మాణ వ్యయం (2005 నాటికి) రు. 2,900 కోట్లు. ప్రాజెక్ట్ నిర్మాణ సమయంలోనే శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ పూర్తి నిలువ సామర్థ్యం (ఎఫ్ఆర్ఎల్) 1091 అడుగులుగా నిర్దేశిస్తూ మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల ముఖ్యమంత్రుల మధ్య 1975, అక్టోబర్ 6న ఒక అంగీకారం కుదిరింది. ఈమేరకు మహారాష్ట్ర గోదావరిపై పైథాన్ డ్యాం స్థలం వరకూ, పూర్ణా నదిపై సిద్ధేశ్వర డ్యాం వరకూ నీటిని ఉపయోగించుకోవచ్చును. గోదావరి బేసిన్‌లో గోదావరిపై పైథాన్ డ్యాం స్థలానికి దిగువనా, పూర్ణానదిపై సిద్ధేశ్వర డ్యాంకు దిగువనా, మంజీరా నదిపై నిజాంసాగర్ డ్యాంకు దిగువనా, గోదావరిపై పోచంపాడు (శ్రీరాంసాగర్) డ్యాం వరకూ మహారాష్ట్ర 60 టి.ఎం.సి.ల నీటి వినియోగం వరకు కొత్త ప్రాజెక్ట్‌లు నిర్మించుకోవచ్చు. ఆంధ్రప్రదేశ్ 1091 ఎఫ్.ఆర్.ఎల్., 1093 ఎం.డబ్ల్యూ.ఎల్.తో శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ నిర్మించుకొని, డ్యాంవద్ద లభ్యమయ్యే మిగులు నీటిని యథేచ్ఛగా వినియోగించుకోవచ్చు. పోచంపాడు ప్రాజెక్ట్ నిర్మాణం వల్ల ముంపునకు గురయ్యే భూమి, కట్టడాల స్వాధీనతకు మహారాష్ట్ర తగు చర్యలు తీసుకోవాలి. అలా స్వాధీన పరుచుకున్న ఆస్తులకు ఆంధ్రప్రదేశ్ నష్టపరిహారాన్ని చెల్లించాలి. ఈ ఒప్పందానికి అనుగుణంగా మహారాష్ట్ర జయక్వాడి (పైథాన్) డ్యాం నుంచి శ్రీరాంసాగర్‌కు ఎగువగా ఐదు ప్రాజెక్ట్‌లను నిర్మించింది.

అవి 1) మాజల్‌గాబ్ (12.4 టి.ఎం.సి), 2) దూద్నా (14 టి.ఎం.సి), 3) మంజీరా (11.2 టి.ఎం.సి), 4) తెర్నా (11 టి.ఎం.సి), 5) విష్ణుపురి (11.4 టి.ఎం.సి) లు మొత్తం 60 టి.ఎం.సి లు. ఒప్పందం ప్రకారం 60 టి.ఎం.సి ల నీటిని మించకుండా మహారాష్ట్ర వినియోగించవలసి ఉండగా, ఈ ఐదు ప్రాజెక్ట్‌లను 60 టి.ఎం.సిల నీటి నిల్వ సామర్థ్యంతో నిర్మించటం గమనార్హం. అంటే మహారాష్ట్ర వాస్తవంగా వినియోగిస్తున్నది 90 టి.ఎం.సిలు (10 టి.ఎం.సిల నీటి నిల్వ సామర్థ్యం గల రిజర్వాయర్‌లో 15 టి.ఎం.సిల నీటిని వినియోగిస్తారన్న ప్రమాణం ఆధారంగా). విష్ణుపురి ప్రాజెక్ట్‌కు దిగువన మహారాష్ట్ర 11 ప్రాజెక్ట్‌లను నిర్మిస్తోంది. వీటికి కేంద్ర జల సంఘం అనుమతిలేదు. నీటి కేటాయింపులు లేవు. ఈ ప్రాజెక్ట్‌లన్నీ అనధికారి కంగా, అక్రమంగా నిర్మిస్తున్నారు. ఈ ప్రాజెక్ట్‌ల వివరాలు : 1) అందూరా (0.32 టి.ఎం.సి), 2) డిగ్రాస్ (1.70 టి.ఎం.సి), 3) మూలీ (0.32 టి.ఎం.సి), 4) ముద్గల్ (0.36 టి.ఎం.సి), 5) ధాలేగాన్ (0.42 టి.ఎం.సి), 6) లోనీసాంగ్వీ (1 టి.ఎం.సి), 7) రాజాతక్లీ (0.83 టి.ఎం.సి), 8) మాంగ్రూస్ (0.83 టి.ఎం.సి), 9) జోగ్లాదేవి (0.32 టి.ఎం.సి), 10) అప్పీగాంవ్ (0.24 టి.ఎం.సి), 11) బాబ్లీ (2.74 టి.ఎం.సి) – మొత్తం 9.08 టి.ఎం.సిలు.

ఇదిలా ఉండగా మహారాష్ట్ర ప్రభుత్వం నిర్మిస్తున్న బాబ్లీ డ్యాం శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ జలాశయంలోనే ఉంది. శ్రీరాంసాగర్ జలాశయం వరకూ 126 కిలోమీటర్లు పొడవునా 90 టి.ఎం.సిలకు పైగా గోదావరి జలాలనిల్వలు ఉంటాయి. ఇందులో 71 కిలోమీటర్ల దూరం ఆంధ్రప్రదేశ్ పరిధిలో ఉండగా, 55 కిలోమీటర్ల దూరం మహారాష్ట్ర పరిధిలోకి వస్తుంది. శ్రీరాంసాగర్ పూర్తిస్థాయి నీటిమట్టం 1091 అడుగులు. బాబ్లీ బ్యారేజీ 1070 అడుగుల ఎత్తున నిర్మిస్తున్నారు. దీని పూర్తి జలస్థాయి 1109 అడుగులు. అంటే బాబ్లీ ప్రాజెక్ట్ శ్రీరాంసాగర్ జలాశయంలోకి చొచ్చుకుపోవడం వల్ల 1070 అడుగుల నుంచీ 1091 అడుగుల వరకూ జలాశయం నీటిని మహారాష్ట్ర ఉపయోగించుకునే ప్రమాదం ఉంది. శ్రీరాంసాగర్ జలాశయంలో 1091 అడుగుల దాకా ముంపునకు మహారాష్ట్ర ఒప్పుకుని ఆంధ్రప్రదేశ్ నుంచి ఆరు కోట్ల రూపాయల నష్టపరిహారాన్ని మహారాష్ట్ర తీసుకుంది. శ్రీరాంసాగర్ జలాశయంలో మహారాష్ట్ర ప్రభుత్వం బాబ్లీ ప్రాజెక్ట్ నిర్మాణానికి పూనుకోవడం ఆంధ్రప్రదేశ్‌తో కుదుర్చుకున్న ఒప్పందాన్ని, తద్వారా ట్రిబ్యునల్ నిర్ణయాలను ఉల్లంఘించినట్లు అవుతుంది. ఇలా జలాశయంలో మరో ప్రాజెక్ట్ నిర్మించటం చట్ట వ్యతిరేకం. 1093 అడుగుల వరకు ముంపును మహారాష్ట్ర అంగీకరించి, నష్టపరిహారం తీసుకొని, శ్రీరాంసాగర్ జలాశయం లోపల డ్యాంని కట్టడం అంతర్‌రాష్ట్ర ఒప్పందాల ఉల్లంఘన కిందకే వస్తుంది. ఇది రాజ్యాంగ వ్యతిరేక చర్య. 1956 నాటి అంతర్ రాష్ట్ర జలవివాదాల చట్టానికి పూర్తిగా వ్యతిరేకం.

## తెలంగాణకు జరుగుతున్న అన్యాయం

తెలంగాణ ప్రాంతానికి వరప్రసాదిని శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్. తెలంగాణలోని నల్గొండ, ఖమ్మం, వరంగల్, కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్ జిల్లాల ప్రజల సాగునీరు, తాగునీరు, పరిశ్రమల అవసరాలను శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ తీరుస్తోంది. బాబ్లీ నిర్మాణం వల్ల తెలంగాణ ప్రాంతంలోని 18 లక్షల ఎకరాల ఆయకట్టు ఎడారిగా మారిపోయే ప్రమాదం ఉంది. ఒకవేళ వరదనీరు ఎక్కువ వచ్చి బాబ్లీ నుంచి నీరు విడుదల చేసినా శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్‌లో వరద జలాలు నిలువచేసుకునేందుకు స్థలం ఉండదు. ఎందుకంటే బాబ్లీ ప్రాజెక్ట్ నిర్మిస్తున్న ప్రాంతం శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ జలాశయ భాగంలోనే ఉంది. బాబ్లీ దిగువన శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ ఉంది. బాబ్లీ గేటు మూసేస్తే శ్రీరాంసాగర్‌లోకి నీళ్లు రావు. బాబ్లీ గేట్లు తెరిస్తే మాత్రం శ్రీరాంసాగర్‌లోని నీళ్లు బాబ్లీలోకి వెళతాయి. బాబ్లీ ప్రాజెక్ట్ సామర్థ్యం 2.7 టి.ఎం.సిలని చెబుతున్నా వాస్తవానికి ఇక్కడ నుంచి వాడుకునే నీరు దాదాపు 60 టి.ఎం.సిల కంటే ఎక్కువగా ఉంటుంది. శ్రీరాంసాగర్ పూర్తి స్థాయిలో నీటి నిల్వ ఉంటే బాబ్లీ ప్రాజెక్ట్ గేట్ల వద్ద సుమారు 18 అడుగుల మేర నీరు ఉంటుంది. కావాలనుకున్నప్పుడు ఈ నీటిని వాడుకునేందుకు మహారాష్ట్రకు అవకాశం ఉంటుంది. ఇందువల్ల మనకు రావల్సిన నీటిని అక్రమంగా పొందే సౌకర్యం మహారాష్ట్రకు ఏర్పడుతుంది. శ్రీరాంసాగర్ ఇన్‌ఫ్లో ఆధారంగా అక్టోబర్ 28 తరువాతే బాబ్లీ ప్రాజెక్ట్ గేట్లను మూసి వేయాలి. ఇది సాధ్యపడే విషయమేనా?

## సుప్రీంకోర్టు మధ్యంతర ఉత్తర్వులు

బాబ్లీ ప్రాజెక్ట్ వివాదంపై సుదీర్ఘ వాదనలు విన్న సుప్రీంకోర్టు ధర్మాసనం (ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కె.జి. బాలకృష్ణన్, జస్టిస్ జి.కె. జైన్, జస్టిస్ ఆర్.వి. రవీంద్రన్) ఈ ఏడాది ఏప్రిల్ 26న మధ్యంతర ఉత్తర్వులు జారీ చేశారు. ఉత్తర్వుల వివరాలు : 'బాబ్లీ ప్రాజెక్ట్ నిర్మాణం కొనసాగించు కోవచ్చు. అయితే తదుపరి ఉత్తర్వులు వెలువడేంత వరకూ ప్రతిపాదిత 13 గేట్లు ఏర్పాటు చేయకూడదు. ఈ రిట్‌పై తదుపరి నిర్ణయం తీసుకు నేంతవరకు నదీ జలప్రవాహానికి మహారాష్ట్ర ప్రభుత్వం అడ్డంకులు సృష్టించకూడదు. అలాగే మహారాష్ట్ర ప్రభుత్వం నదీ జలాల్లో తన వాటా (ఈక్విటీ) కోరకూడదు. ఆంధ్రప్రదేశ్ అభ్యంతరాలను దృష్టిలో ఉంచుకుని ఈ ఆదేశాలు జారీ చేస్తున్నాం.' అని తెలిపారు

## తెలుగుదేశం ప్రతిస్పందన

బాబ్లీ ప్రాజెక్ట్ నిర్మాణంపై సుప్రీంకోర్టు ఇచ్చిన మధ్యంతర ఉత్తర్వులు రాష్ట్ర ప్రయోజనాలకు విరుద్ధంగా ఉన్నాయి. మధ్యంతర తీర్పు వల్ల రాష్ట్రానికి అన్యాయం జరుగుతోంది. బాబ్లీ ప్రాజెక్ట్‌కు గేట్లు పెట్టకపోయినా తెలంగాణ ప్రాంతానికి శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ ద్వారా వచ్చే గోదావరి జలాలు నిలిచిపోవడం ఖాయం. మహారాష్ట్ర గోదావరి నది ఎగువ భాగాన ఎత్తిపోతల పథకాల ద్వారా నీటిని లాగేసుకొంటోంది. ఈ లిఫ్ట్‌లు పెట్టకుండా నిరోధిస్తే కొంత ప్రయోజనం ఉంటుంది. కేంద్ర ప్రభుత్వం చిత్తశుద్ధిని ప్రదర్శించి బాబ్లీ వివాదాన్ని న్యాయపరమైన దృష్టితో పరిశీలించి ఆంధ్రప్రదేశ్ ప్రయోజనాలను పరిరక్షించే విధంగా మహారాష్ట్ర ప్రభుత్వంతో కోర్టు వెలుపల పరిష్కార మార్గాన్ని కనుగొని ఉంటే ఈ ప్రమాదం నుంచి బయటపడి ఉండేవాళ్లం. మహారాష్ట్ర ప్రభుత్వ ఏకపక్ష ధోరణీ, కేంద్ర ప్రభుత్వ నిర్లక్ష్య ధోరణీ, రాష్ట్ర ప్రభుత్వ అలక్ష్యం తెలంగాణ ప్రయోజనాలను తీవ్రంగా దెబ్బతీశాయి. ఈ పరిస్థితుల్లో ఆందోళన కొనసాగించి బాబ్లీ ప్రాజెక్ట్ నిర్మాణాన్ని, గోదావరి నదిపై మహారాష్ట్ర ఎత్తిపోతల పథకాలను నిలుపు చేసేంతవరకూ ఉద్యమాన్ని కొనసాగించి న్యాయం జరిగే వరకూ పోరాటం చేస్తాం.

## మంత్రి పొన్నాల స్పందన

సాధారణంగా జరిగే నదీ ప్రవాహానికి అడ్డురావద్దని, సుప్రీంకోర్టు ఒక అంశంలో పేర్కొంది. రెండోది గేట్లు అమర్చడానికి వీలు లేదు. మళ్లీ ఆర్డర్ వచ్చేంతవరకు అమర్చరాదు. మూడవది ఇప్పటివరకు కట్టడానికి ఖర్చులుగానీ, నీళ్లుగానీ, ఈక్విటీగాని అడగరాదు. ఒరిజినల్ సూట్ ఫైనలైజ్ అయ్యేంతవరకు, అంటే నది లోపల నదీ ప్రవాహానికి ఎటువంటి కన్‌స్ట్రక్షన్ ఉండరాదు. గేట్లు అమర్చకూడదు. అంటే గేట్లు అమర్చితే తప్ప అక్కడ నీళ్లు నిలవవు. ఇది మన వాదనలకు అనుగుణంగా ఇప్పుడు ఉన్న పరిస్థితులలో ఈ జడ్జిమెంట్ ప్రకారం మహారాష్ట్ర ఒక్క నీటి చుక్కను కూడా తీసుకుపోయే అవకాశం లేదు. సాధారణ ప్రవాహానికి అడ్డుకట్ట వేయరాదు అని చాలా స్పష్టంగా చెప్పారు. కాంపెన్సేషన్‌గానీ, నీళ్లు గానీ తీర్పు ఫైనలైజ్ అయ్యేంతవరకు అడగడానికి వీల్లేదు. రాష్ట్ర ప్రభుత్వ వాదనలకు అనుగుణంగా మహారాష్ట్ర ప్రభుత్వం దొంగతనంగా గానీ లేదా ఉత్తర్వుల వల్లగానీ ఒక్క నీటి చుక్కను తరలించు కుపోవడానికి

వీలులేదు. తెలుగుదేశం పార్టీ రాష్ట్ర ప్రభుత్వం మీద బురదవేయడం, రాజకీయ లబ్ధి పొందడం కోసమే. చట్టపరంగా, ఒప్పందాల పరంగా రాష్ట్ర ప్రభుత్వం చేసిన వాదనలకు అనుగుణంగానే ఈ రోజు సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. ఈ తీర్పు రాష్ట్ర ప్రభుత్వం యొక్క వాదనలకు నిదర్శనం. రాష్ట్ర ప్రభుత్వం చెప్పిన అభ్యంతరాల మేరకు ఇది ఉల్లంఘన కిందకు వస్తుందని కేంద్ర ప్రభుత్వం గుర్తించి మహారాష్ట్ర ప్రభుత్వానికి ఆదేశం ఇచ్చినా మహారాష్ట్ర ముఖ్యమంత్రి నిరంకుశంగా, అప్రజా స్వామికంగా, రాజ్యాంగానికి వ్యతిరేకంగా వ్యవహరించిన తీరు పట్ల ఒక ప్రజాస్వామ్య రాష్ట్రప్రభుత్వం తమ నిరసన తెలియజేసిందే తప్ప మరో విషయం కాదు.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున పరాశరన్ వాదనలు

బాబ్లీ బ్యారేజ్ నిర్మాణం పూర్తయితే శ్రీరాంసాగర్ నీరు రివర్స్ ఫ్లోలో వెనక్కు వెళ్లిపోతాయి. 1980 జులై 26న వెలువడిన గోదావరి జలవివాద ట్రిబ్యునల్ తీర్పునకు వ్యతిరేకంగా బాబ్లీని నిర్మిస్తున్నారు. దీనిపై ఆంధ్రప్రదేశ్ అభ్యంతరాలను ఒరిజినల్ సూట్‌లో పొందుపరిచాం. ఈ కేసుపై తుది తీర్పు వెలువరించేంతవరకు ప్రాజెక్ట్ నిర్మాణం కొనసాగించకుండా, నీరు నిల్వ చేయకుండా మహారాష్ట్ర ప్రభుత్వాన్ని నియంత్రించాలి. ప్రాజెక్ట్‌కు పర్యావరణ అనుమతులు లేవు. బాబ్లీ గేట్లు అక్టోబర్ తర్వాతే తెరుస్తామని మహారాష్ట్ర చెబుతోంది. అయితే శ్రీరాంసాగర్‌లో మార్చ్ వరకు 1076 అడుగుల మేర నీరు ఉంటుంది. దీనివల్ల రివర్స్‌ఫ్లోలో మహారాష్ట్ర ఈ నీటిని వాడుకునే అవకాశం ఉంది. గోదావరి ట్రిబ్యునల్ అవార్డు మేరకు ఆంధ్రప్రదేశ్ శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ నిర్మించింది. ఇప్పుడు దాని జల విస్తృత భాగం (వాటర్ స్ప్రెడ్ ఏరియా)లో మహారాష్ట్ర అక్రమంగా నిర్మాణం చేపట్టింది. అది బ్యారేజో, మరో మినీ ఆనకట్టో కాదు. అది వాస్తవానికి ఒక మినీ రిజర్వాయర్. ఆంధ్రప్రదేశ్ అనుమతి లేకుండా ప్రాజెక్ట్ పరిధిలో రిజర్వాయర్‌ను ఎలా ఏర్పాటు చేస్తారు? శ్రీరాంసాగర్ కింద ముంపునకు గురయ్యే మహారాష్ట్ర భూ భాగానికి ఇప్పటికే రు. 4.5 కోట్లు పరిహారం చెల్లించాం. సొంత ఖర్చుతో రోడ్లు, వంతెనలు నిర్మించి ఇచ్చాం. శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ బెడ్ లెవెల్ 1069 అడుగులైతే, బాబ్లీ బెడ్ లెవెల్ 1073 స్థాయిలో ఉంది. ప్రాజెక్ట్ ఎత్తు 1109 అడుగుల వరకు ఉంది. శ్రీరాంసాగర్ పూర్తిస్థాయి నీటిమట్టం 1091 అడుగుల వరకు ఉంటుంది. కానీ బాబ్లీ గేట్లు 1073 అడుగులపై నుంచి ఉంటాయి. అంటే శ్రీరాంసాగర్ నుంచి 60 టి.ఎం.సి ల వరకు నీటిని మహారాష్ట్ర సులభంగా లాగేసుకోవచ్చు. తాగునీటి పేరుతో ఇలా శ్రీరాంసాగర్ నీటిని తోడుకోవడానికి మహారాష్ట్ర ప్రయత్నిస్తోంది. మహారాష్ట్ర తాగునీటి అవసరాలకు కావలసింది కేవలం 0.1 టి.ఎం.సి ల నీరే. కాగా మహారాష్ట్ర 2.7 టి.ఎం.సి.ల సామర్థ్యంతో కడుతోంది. ప్రాజెక్ట్ సామర్థ్యాన్ని 1.9 టి.ఎం.సిల స్థాయికి తగ్గించినట్టు మహారాష్ట్ర చెబుతోంది. 1.9 టి.ఎం.సిల నీటిని తీసుకోవడానికి 13 గేట్లు అవసరం లేదు కదా. బాబ్లీ ప్రాజెక్ట్‌కు కేంద్రం నుంచి ఎలాంటి అనుమతులు లేవు. ఈ విషయాన్ని కేంద్ర జలసంఘం సాంకేతిక సమితి కూడా నిర్ధారించింది. 2006 ఏప్రిల్ లో సిడబ్ల్యూసి సాంకేతిక మండలి ప్రాజెక్ట్‌ను సందర్శించి యథాతథ స్థితి కొనసాగించాలంటూ ఒక నివేదిక కూడా ఇచ్చింది. మహారాష్ట్రకు తాగునీరు ఇచ్చేందుకు ఆంధ్రప్రదేశ్‌కు ఎలాంటి అభ్యంతరమూ లేదు. కానీ ఆ పేరుతో బ్యారేజీ కట్టి 60 టి.ఎం.సిల నీటిని వాడుకోవడానికి మాత్రం అంగీకరించం.

## న్యాయవాది రామకృష్ణారెడ్డి వాదనలు

ఏ రాష్ట్రమూ మరో రాష్ట్ర ప్రాజెక్ట్ పరిధిలో నిర్మాణం చేపట్ట కూడదు. మరీ ముఖ్యంగా అది మరో రాష్ట్ర ప్రయోజనాలపై ప్రభావం చూపేదిగా ఉండకూడదు. ఇదే విషయాన్ని సుప్రీంకోర్టు గతంలో ఇచ్చిన తీర్పులో స్పష్టంగా పేర్కొంది. బాబ్లీ ప్రాజెక్ట్‌కు ప్లానింగ్ కమిషన్ నుంచి గానీ, కేంద్ర జలసంఘం నుంచి గానీ మహారాష్ట్ర అనుమతుల కోసం ప్రతిపాదించలేదు. ఏకపక్షంగా కట్టుకుంటూ పోతోందని కాంగ్రెస్ ఎంపి మధుయాష్కి తరఫున వాదిస్తున్నారు.

## మహారాష్ట్ర ప్రభుత్వ వాదనలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దాఖలు చేసిన దరఖాస్తును పూర్తిగా వ్యతిరేకిస్తున్నాం. బాబ్లీ బ్యారేజ్ నిర్మాణం ఇంకా పూర్తికాలేదు. ఇప్పటి వరకూ కొంత భాగం మాత్రమే నిర్మించాం. బ్యారేజ్ నిర్మాణం 326 మీటర్ల మేర భూ ఉపరితలం మీద మాత్రమే పూర్తయింది. దీనివల్ల గోదావరి నదీజల సహజ ప్రవాహానికి ఎలాంటి అడ్డంకీ ఉండదు. ఆంధ్రప్రదేశ్‌కు జలనష్టం ఉండదు. గేట్లను పూర్తిస్థాయిలో ఏర్పాటు చేసేంతవరకు జలప్రవాహానికి ఎలాంటి అడ్డంకీ ఉండదు. ముంపు ప్రాంతానికి ఇంతకుముందే పరిహారం చెల్లించామని ఆంధ్రప్రదేశ్ చేస్తున్న వాదనల్లో నిజం లేదు. పరిహారం చెల్లించడం గానీ, భూసేకరణగానీ, సహాయ పునరావాస చర్యలుగానీ జరగలేదు. 2009 డిసెంబర్ వరకు గేట్లు పెట్టబోమని హామీ ఇస్తున్నాం. ఉభయరాష్ట్రాల ఉమ్మడి ముంపు ప్రాంతం నుంచి బాబ్లీ ప్రాజెక్ట్‌లోకి వచ్చే నీరు 0.6 టి.ఎం.సి.లు మాత్రమే. ఆ నీటిని ఉమ్మడి పర్యవేక్షణలో ఆంధ్రప్రదేశ్‌కు వదిలిపెట్టడానికి మహారాష్ట్ర సిద్ధంగా ఉంది. మహారాష్ట్ర చూపిన మూడు పరిష్కార మార్గాలు ఆంధ్రప్రదేశ్ ఏకపక్షంగా తిరస్కరించింది. గోదావరి జలాల్లో 60 టి.ఎం.సి.ల పైన వచ్చే నీటినంతా ఆంధ్రప్రదేశ్ వాడుకోవచ్చు. ట్రిబ్యునల్ తీర్పు ప్రకారం రాష్ట్ర సరిహద్దుల్లోని నీటిని వాడుకునే అధికారం మహారాష్ట్రకు ఉంది. అయితే ఆంధ్రప్రదేశ్ దీన్ని వక్రీకరించి చెబుతోంది. బాబ్లీ వద్ద మహారాష్ట్ర కడుతున్నది డ్యాం కాదు. కేవలం బ్యారేజీ మాత్రమే. రబీలో ఏడు వేల హెక్టార్లకు సాగునీరు, 54 గ్రామాలకు తాగునీరు అందించడమే ఈ బ్యారేజీ లక్ష్యం. కరువు కాలంలో తాత్కాలిక నీటి వినియోగం కోసం ఈ బ్యారేజ్‌ను చేపడుతున్నాం. ప్రాజెక్ట్ గేట్లు 11 మీటర్ల నుంచి 7.5 మీటర్లకు తగ్గించడానికి గతంలో కేంద్ర జలవనరుల సంఘం వద్ద జరిగిన సమావేశంలో ఆంధ్రప్రదేశ్ అధికారులు అంగీకరించారు. ఇంజనీర్లు సూచించిన ఈ పరిష్కారానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అంగీకరించలేదు. ఆంధ్రప్రదేశ్ రాజకీయ ఒత్తిళ్ల కారణంగానే న్యాయస్థానాన్ని ఆశ్రయించింది. 2009 తర్వాత బ్యారేజ్‌కు పెట్టే గేట్లను ప్రతి సంవత్సరం అక్టోబర్ 28 తర్వాతే తెరుస్తాం. దీనివల్ల మహారాష్ట్రకు వచ్చే నీరు 0.6 టి.ఎం.సిలు మాత్రమే ఉంటుంది. వీటిని కూడా ఆంధ్రప్రదేశ్‌కు వదిలిపెట్టడానికి మహారాష్ట్రకు అభ్యంతరం లేదు. ◆

**చరిత్రను ఒకదానికీ మరోకదానికీ సంబంధం లేని సంఘటనల పరంపరగా చూపి ప్రజలను మాయచేయడానికి లేని తటస్థత ఆపాదించారంటున్నారు ఎస్. నర్సింగరావు**

# చరిత్ర అనుత్పాదకం కాదు!

ఈ సమాజం ఉనికిలోకి ఎలా వచ్చింది? ఎలా మనగల్గుతోంది? సమాజ భవిష్యత్తు ఏమిటి? ఈ విషయాలను పరిశీలించడం కంటే ఉన్నత విజ్ఞానం మరొకటి ఉండదు. ఈ విజ్ఞానాన్ని కల్గించే హ్యూమానిటీస్ సబ్జెక్ట్‌ల ప్రాముఖ్యత ఎనలేనిది. అయితే మన రాష్ట్రంలో చరిత్ర, ఇతర హ్యూమానిటీస్ గ్రూపులను జూనియర్ కళాశాల స్థాయిలో పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నారు. ప్రస్తుతం చరిత్రను బోధనాంశంగా గల కళాశాలలను వేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. 2001-02 విద్యా సంవత్సరంలో అప్పుడు అధికారంలో ఉన్న తెలుగుదేశం ప్రభుత్వం చరిత్ర, ఇతర హ్యూమానిటీస్ గ్రూపులను (జి.వో. నెం. 36) రద్దు చేసింది. సమాచార, సాంకేతిక విజ్ఞానంలో వస్తున్న గణనీయమైన 'ప్రగతి'ని పరిగణనలోకి తీసుకుంటూ ఈ హ్యూమానిటీస్ గ్రూపులు నిరుపయోగమైనవనీ, అనుత్పాదకమైనవనీ ప్రకటించింది. ఈ విధానానికి హిస్టరీ కాంగ్రెస్, ఇతర వామపక్ష మేధావులు నిరసన తెలపడంతో ఆ జివోను ఉపసంహరించుకుంది. ఆ జివోను రద్దు చేసినప్పటికీ ఈనాడు అధికారంలో ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వం తెలుగుదేశం విధానాన్నే భుజాన వేసుకుని మోస్తున్నది.

ఆర్థిక సంస్కరణలు, ప్రపంచీకరణ నేపథ్యంలో సమాజంలో మానవ విలువలు తరిగిపోతూ, మార్కెట్ సంస్కృతి విస్తరిస్తూ డబ్బుకు ప్రాధాన్యత విపరీతంగా పెరిగిపోతున్నది. చదువు ఇంకెంతమాత్రం విజ్ఞాన సముపార్జనకు, వ్యక్తిత్వ వికాసానికి కాక కెరియర్ ఏర్పరచుకోవటానికి పెట్టుబడి పెట్టే వ్యాపారంగా మారిపోయింది. విద్యార్థులకు ఆసక్తి ఉన్న సబ్జెక్ట్‌లను చదివించటం కాక త్వరగా ఉద్యోగాలను సంపాదించి పెట్టే సబ్జెక్ట్‌లను లక్షలు ఖర్చు పెట్టి చదివించటం మనం చూస్తున్నాం. ఇందులో భాగంగానే ఇంజనీరింగ్, మెడిసిన్, కంప్యూటర్ సాఫ్ట్‌వేర్, బయోటెక్నాలజీ లకు దారులు వేసే సైన్సు సబ్జెక్ట్‌లకు విపరీతమైన మోజు ఏర్పడింది. ఈ క్రమంలో మరొక తప్పుడు అభిప్రాయం కూడా ఎక్కువగా వినిపిస్తున్నది, అదేమిటంటే సైన్సు సబ్జెక్ట్‌లు ఉత్పాదకమైనవేగాక అవి తెలివి కల విద్యార్థులు చదివేవి, తెలివిలేని వారు మార్కులు తక్కువ వచ్చే వారు మాత్రమే హ్యూమానిటీస్ సబెక్ట్‌ల వైపు వెళతారనేది. హ్యూమానిటీస్ సబ్జెక్ట్‌ల పట్ల ప్రభుత్వ నిరాదరణకు ఇటువంటి తప్పుడు అభిప్రాయాలు తోడై చరిత్ర, ఇతర హ్యూమానిటీస్ సబ్జెక్ట్‌లు పూర్తిగా కనుమరుగయి పోయే ప్రమాదం పొంచి ఉంది. అదే జరిగితే సమాజ గమనాన్ని అధ్యయనం చేసి లోటుపాటులను పరిశోధించటానికి భవిష్యత్తులో మానవవనరులు కరువైపోతాయి. బుద్ధి జీవులు లేకుండా పోతారు.

హ్యూమానిటీస్ సబ్జెక్టుల ప్రాముఖ్యతను తొక్కిపెడ్తున్న ప్రభుత్వ విధానం ఏ వాస్తవాలను రుజువుచేస్తోంది? ఈ నిర్లక్ష్య విధానం వేళ్లుఎక్కడ పాతుకునిఉన్నాయి? ఈ ప్రశ్నలను పరిశీలించాల్సిన అవసరముంది.

అటు కేంద్రంలో గానీ, ఇటు రాష్ట్రంలో గానీ స్వాతంత్ర్యానంతరం పరిపాలిస్తున్న కాంగ్రెస్, బిజెపి, తెలుగుదేశం పార్టీలన్నీ సంపన్న వర్గాలకు చెందినవి. మన దేశంలో, రాష్ట్రంలో చేతివేళ్లమీద లెక్కపెట్టేటట్టు ఉన్న ఉన్నత వర్గాలవారు అసంఖ్యాకంగా ఉన్న వ్యవసాయ కూలీ, పేద, మధ్యతరగతి రైతులు, కార్మికులు, మధ్యతరగతి ప్రజలను పరిపాలిస్తున్నారు. అంటే సమాజాన్ని స్థూలంగా ఉన్నవాళ్లు, లేనివాళ్లు అనే వర్గాల కింద విభజించారు. అసమానతలు నెలకొని ఉన్న ఈ సమాజంలో పాలకవర్గంగా ఉన్న ఉన్నత, సంపన్నవర్గాల భావజాలమే రాజ్యమేలుతోంది. పాలకవర్గాలు తమ భావజాలాన్ని ఉగ్గుపాలతో నేర్పిస్తారు. ఈనాడు పాఠశాలల్లోనూ, కళాశాల స్థాయిలోనూ బోధించే చరిత్ర, హ్యూమానిటీస్ సబ్జెక్టులన్నీ పాలకవర్గ భావజాలానికి సంబంధించినవే. అందుకనే ఆ చరిత్ర రాజులు, చక్రవర్తుల చరిత్రగా ఉంటుంది తప్ప, ప్రజల చరిత్రగా ఉండదు. సోషియాలజీ ఈ అర్ధవలస అర్ధభూస్వామ్య సమాజాన్ని, పెట్టుబడిదారీ సమాజాన్ని ఒక పరిపూర్ణమైన వ్యవస్థగా చూపుతుంది తప్ప ఈ సమాజం మారుతుందని చెప్పదు. ఆర్థికశాస్త్రం ఇది వర్గసమాజమని గుర్తించడం దగ్గరే ఆగిపోయి, ఈ వ్యవస్థకు అనుగుణమైన సూత్రాలను ఆవిష్కరిస్తుంది. సంక్షేమ ఆర్థికశాస్త్రంగా రూపుదిద్దుకుంది. ఆ 'సూత్రాల'నే బోధిస్తుంది. పౌరశాస్త్రం 'ఉత్తమ' పౌరులు ఎలా ఉండాలో తెలియజెప్పుతుంది. పరిపాలనాశాస్త్రం (నిరంకుశ) అధికార యంత్రాంగాన్ని రూపొందించుతుంది. ఇదంతా ఈ సమాజాన్ని రక్షించే పాలకవర్గాల భావజాలం.

మరి ప్రత్యామ్నాయం చూపకుండా - చరిత్ర, హ్యూమానిటీస్ సబ్జెక్టులను ఎలా చదివితే 'ఉత్పాదకరంగా' ఉంటాయో చెప్పకుండా, నిర్లక్ష్యం చేయబూనుకోవడమంటే పాలకవర్గాల భావజాలం సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నదని పాలకవర్గాలే చెప్పుకోవడం కాదా?

కాంగ్రెస్ ప్రభుత్వం ప్రపంచబ్యాంకుకు రాష్ట్రాన్నీ, ప్రజలనూ దోచిపెడ్తోందని అందిరికీ తెల్సిందే. ప్రపంచీకరణ వైపుగా రాష్ట్రాన్ని ప్రభుత్వం తీసుకెళ్తోంది. అంతర్జాతీయ పనివిభజనలో భాగంగా కేవలం పరాయి దేశాలకు ఉపకరించే సమాచార, సాంకేతిక విజ్ఞాన శాస్త్రాలు, ఇతర శాస్త్రాలకు సంబంధించిన శాస్త్రవేత్తలను, సాంకేతిక నిపుణులను

తయారుచేసే ఫ్యాక్టరీగా రాష్ట్రాన్ని మారుద్దామనే పథకం తప్ప ఇది మరొకటి కాదు. అమెరికా అధ్యక్షుల హైదరాబాద్ పర్యటన ఈ నేపథ్యంలోనే కొనసాగింది. ఇది నయా వలస లక్షణం. అమెరికాకు ప్రపంచబ్యాంకు రాష్ట్రాన్ని తాకట్టు పెట్టి మీరే పాలకులని చేతులు జోడించే ఇక్కడి పాలకులకు 'చరిత్ర'తో పనేముంది? ఇతర హ్యూమానిటీస్ సబ్జెక్టులతో అవసరమేముంది? వారి చరిత్ర వారికి నిరుపయోగంగా, అనుత్పాదకంగా కన్పించడంలో ఆశ్చర్యమేముంది? నీలకంఠశాస్త్రి, మహాజన్, మజుందార్ లాంటి అధికారిక చరిత్రకారులు చేసిన పరిశోధన వెలువరించిన ఉద్గ్రంథాలు అనుత్పాదకమేనా? అవునని ఈ ప్రభుత్వం తన విధానాల ద్వారా చెబుతోంది. మనం ఒప్పుకోవాలి కూడా.

'చరిత్ర' నుంచి తర్కం వస్తుంది. ఒక జాతి వ్యక్తిత్వం, ఆత్మస్థైర్యం, నైతిక విలువలు ఆ జాతి చరిత్రలో ఇమిడి ఉంటాయి. అందుకే చరిత్రకున్న ప్రాముఖ్యత మరే విషయానికి ఉండదు. అయితే ఈ వ్యవస్థలో చరిత్ర, అర్థికశాస్త్రం, సోషియాలజీలను వక్రీకరించినంతగా మరే ఇతర సబ్జెక్టులను వక్రీకరించలేదంటే అతిశయోక్తి కాదు. తమ పరిపాలన సజావుగా సాగడానికి, ప్రజలను మాయ చేయడానికి చరిత్ర, హ్యూమానిటీస్ లకు లేని తటస్థత ఆపాదించారు. చరిత్రను సంఘటనల పరంపరగా – ఒక ఘటనకూ, మరో ఘటనకూ సంబంధం లేని విధంగా బోధించారు. సమాచారాన్నీ, వాస్తవాలనూ ఒక కుప్పగా పోశారు. ఇదే చరిత్ర అని చెప్పారు. ఐతే అనేక పోరాటాల అనంతరం విద్యా రంగంలో కూడా కొన్ని మార్పులు చేరాయి. ఎన్‌సిఇఆర్‌టి ప్రచురించిన పాఠ్య పుస్తకాలు ఇందుకు మంచి ఉదాహరణ. ఆర్ఎస్ శర్మ తదితరులు రాసిన చరిత్ర పాఠ్య పుస్తకాలు కొంత ప్రజల ప్రయోజనాలకు అద్దం పట్టాయి. సామాజిక, ఆర్థిక సంబంధాల పరిశీలనకు తావిచ్చాయి. అయితే ఈ ప్రపంచీకరణ బిజెపి కేంద్రంలో అధికారంలో ఉన్నప్పుడు కాషాయీకరణతో ఆ పుస్తకాలు కూడా క్రమేణా అనేక మార్పులకు గురై సాధారణ 'చరిత్ర' పుస్తకాల స్థాయికి వచ్చి చేరాయి. చరిత్ర, ఇతర హ్యూమానిటీస్ సబ్జెక్ట్‌లను శాస్త్రీయ దృష్టితో పరిశీలించడంలో విజ్ఞాన శాస్త్ర స్థాయికి అభివృద్ధి పరచడంలో ఘోరంగా వైఫల్యం చెందినా, పాలక వర్గం వీటి ప్రాముఖ్యతను గుర్తించడం లేదు. ఇది కాకతాళీయం కాదు. ఈ వ్యవస్థలో ఆ సబ్జెక్ట్‌లు ఇక పరిణితి చెందవనే వాస్తవాన్ని రుజువుచేయడమే.

## చరిత్ర అంటే ఏమిటి?

ప్రకృతితో మానవుడు చేస్తున్న పోరాటమే చరిత్ర. 'మానవుడితో మనం చరిత్రలోకి ప్రవేశించాం' అందుకనే ప్రజలే చరిత్ర నిర్మాతలని మార్క్స్ మహాశయుడు చెప్పారు. జంతువులకు కూడా చరిత్ర ఉంటుంది కాని, ఆ జీవితం వాటికి ప్రకృతి ప్రసాదించింది. అవి చేస్తున్న పోరాటంతో ప్రకృతిని మార్చలేవు. మానవుడికి మాత్రమే ప్రకృతిని మార్చగలిగే శక్తి ఉంది. మార్చటం ద్వారా ప్రకృతిని అర్థం చేసుకునే మేధస్సు ఉంది. అంతిమంగా ప్రకృతిపై ఆధిపత్యాన్ని నెలకొల్పడం జరుగుతోంది. ఉత్పత్తి కోసం జరుగుతున్న నిరంతర పోరాటం, సమాజ పురోగమనానికి చోదకశక్తి. ఆ ఉత్పత్తి జరిగే సంఘర్షణలో మానవులు అనివార్యంగా సంబంధాలను ఏర్పరచుకుంటారు. ఆ సంబంధాలను ఉత్పత్తి సంబంధాలనీ, ఆర్థిక సంబంధాలనీ పిలుస్తారు. ఆ పునాది పైనే ఆ చారిత్రక పరిస్థితికి సంబంధించిన భావజాలం నిర్మితమవుతుంది. ఆదిమ సమాజం విచ్ఛిన్నమై, బానిస సమాజం ఉనికిలోకి వచ్చినప్పటి నుంచి అంటే సమాజం వర్గాలుగా విడిపోయినప్పటి నుంచి వర్గపోరాటాల చరిత్ర సమాజ చరిత్రగా ఉంటూ వచ్చింది.

ఈ శాస్త్రీయ దృక్పథంతోనే చరిత్ర, ఇతర హ్యూమానిటీస్ సబ్జెక్టులను పరిశీలించాలి. అభివృద్ధిపరచాలి. ఈ శాస్త్రీయ దృష్టితో పరిశీలిస్తే ఈ వ్యవస్థ పరిపూర్ణమైంది కాదనీ, ఆ అసమానతలు తొలగి పోతాయనీ, మానవ సమాజానికి ఉజ్వలమైన భవిష్యత్తు ఉందనీ స్పష్టమవుతుంది. ◆

రాజకీయ రంగంలో అవినీతిని నిరోధించటానికి ప్రజాసంస్థలు నిరంతరం ఉద్యమించాలని, కేంద్రంలో లోక్‌పాల్ వ్యవస్థను, రాష్ట్రంలో లోకాయుక్తను పటిష్టపరచాలంటున్నారు **వి. లక్ష్మణ రెడ్డి**

# రాజకీయ రంగంలో అవినీతి

నేడు భారతదేశ రాజకీయ రంగంలో అవినీతి వేగంగా పెరుగుతూఉంది. ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్‌నేషనల్ 91 దేశాలను పరిశీలించగా అత్యధిక అవినీతి చోటు చేసుకున్న దేశాలు బంగ్లాదేశ్, నైజీరియా, ఉగండా, ఇండోనేషియా, కెన్యాలు కాగా అతి తక్కువ అవినీతి గల దేశాలుగా ఫిన్‌ల్యాండ్, డెన్మార్క్, న్యూజిల్యాండ్, ఐస్‌ల్యాండ్, సింగపూర్, స్వీడన్ లుగా పేర్కొన్నది. భారతదేశం అవినీతి విషయంలో 91 దేశాలలో 72వ స్థానం కలిగిఉంది. ప్రభుత్వ కార్యాలయాలను, ఆస్తులను తన స్వంత లాభాం కోసం వినియోగించుకోవటమె, రాజకీయ అవినీతిగా పరిగణించవచ్చును. ప్రభుత్వ ప్రతినిధిగా ఉండే రాజకీయ నాయకులు తమ కోసం, తమ పిల్లల కోసం తమ వారసుల కోసం అవినీతి పరులుగా మారి, రాజకీయ సంస్థలను ధనార్జన కేంద్రాలుగా మారుస్తున్నారు. ఈ విధంగా సంపదను కూడబెట్టటాన్ని సమాజం ఆమోదిస్తూ, ప్రశ్నించకుండా ఉంటే, సమాజం అవినీతిమయం అవుతుంది. నేడు రాజకీయాలలో నల్లధనం ప్రధాన భూమిక వహిస్తుంది. నల్లధనం అవినీతికి ఆక్సిజన్‌గా పనిచేస్తుండగా, అవినీతి నల్లధనానికి ఆక్సిజన్‌గా తోడ్పడుతుంది. దాదాపుగా అన్ని రాజకీయ పార్టీలు అవినీతి మయంగా మారాయన్న భావన ప్రజలలో నేడు నెలకొని ఉన్నది. అవినీతి ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా ఉండటమే కాకుండా రాజకీయ వ్యవస్థ ప్రజాస్వామ్యయుతంగా నడవటానికి, నిరోధకంగా మారుతుంది. రాజకీయ పార్టీలలో పారదర్శకత లోపిస్తుంది. అంతర్గత ప్రజాస్వామ్యం ఉండటం లేదు. అధికార కేంద్రీకరణ బలోపేతం అయి అవినీతి మరింత పెరగటానికి దారి తీస్తుంది. రాజకీయ పార్టీలు ఏవీ తమ ఆదాయ వ్యయాలను ప్రజల ముందు గాని, పార్టీ సభ్యుల ముందు గాని పెట్టటం లేదు. నూతన ఆర్థిక విధానాలు 1991 నుండి ప్రారంభం అయిన తరువాత కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లు గణనీయంగా పెరగటం, విదేశీయ నిధులు ప్రపంచ బ్యాంక్ రుణాలు వేగంగా పెరగటం వలన, అధికార రాజకీయ పార్టీల నాయకుల అవినీతి గణనీయంగా పెరిగింది. నూతన పారిశ్రామిక విధానంతో నష్టాలలో ఉన్న ప్రభుత్వ కంపెనీలను ప్రైవేట్ కంపెనీలకు ధారాదత్తం చేయటంలో అవినీతి ప్రబలంగా చోటు చేసుకుంటోంది. ఉత్తర ప్రదేశ్‌లో ప్రభుత్వ పంచదార మిల్లులను 1/10 వంతు ధరలకే ప్రైవేట్ వ్యక్తులకు ధారాదత్తం చేశారు. ఇలాంటి ఉదాహరణలు సరళీకృత ఆర్థిక విధానంలో కోకొల్లలు. సేవా దృక్పథంతో కొనసాగవలసిన రాజకీయ వ్యవస్థ వ్యాపార మయం అయింది. నైపుణ్యం గల విజ్ఞానవంతులు రాజకీయాలలోకి అడుగు పెట్టలేని స్థితి ఏర్పడింది. తక్కువ నాణ్యత గల్గి, కేవలం అర్థబలం, అంగబలలాతో, కుల, మత, ప్రాంతీయ భేదాలను రెచ్చగొట్టి రాజకీయాలలో కొనసాగుతున్నారు. భారతదేశంలో వేలాది కోట్ల రూపాయలు బోఫోర్స్ స్కాం, గడ్డి స్కాం, ఇరిగేషన్ ప్రాజెక్టుల స్కాంలు కొనసాగుతున్నా, వీటికి పాల్పడుతున్న రాజకీయ నాయకులపై సరి అయిన శిక్షలు పడనందున నిర్భయంగా అధికార పార్టీల రాజకీయ నాయకులు అవినీతిని మూడు పువ్వులు ఆరుకాయలుగా పెంచి పోషిస్తున్నారు. తద్వారా సంపాదించిన ధనంతో ఎన్నికల్లో ఓట్లను కొనుగోలు చేయటం, ఉచితంగా మద్యంను సరఫరా చేయటం లాంటి దుశ్చర్యలతో అధికార పగ్గాలను చేపట్టి మరింత ఆదాయాన్ని సమకూర్చుకొంటున్నారు. ఈ క్రమంలో విద్యావంతులు, మేధావులు, సంఘ సేవకులు, రాజకీయాలలో అడుగు పెట్టలేని స్థితి ఏర్పడింది. గ్రామ సర్పంచ్ ఎన్నికలలో సైతం 10 లక్షలకు పైగా వెచ్చించే స్థితి నెలకొంది. కార్పొరేషన్‌లలో కార్పొరేటర్ల ఎన్నికలలో కూడ 15 లక్షలకు పైగా వ్యయం చేసున్నారు. సగటున శాసనసభ్యుల ఎన్నికలలో కోటి రూపాయలకు పైగాను లోకసభ ఎన్నికలలో ఐదు కోట్లకు పైగాను వ్యయం చేస్తున్న స్థితిలో సేవా తత్పరత గల సామాన్య ప్రజలకు, కార్యకర్తలకు చట్టసభలలో చోటు దక్కే స్థితి లేదు.

రాజకీయ అవినీతి నేరాలను పెంచుతుంది. పెట్టుబడులను నివారిస్తుంది. ఆర్థికాభివృద్ధిని కుంటుపరుస్తుంది. కేంద్ర రాష్ట్ర బడ్జెట్‌లను నిరుపయోగం చేసి ప్రజలకు దక్కకుండా నిర్వీర్యం చేస్తుంది. కోట్లాది రూపాయలు ఎన్నికల సమయంలో వెచ్చిస్తున్న రాజకీయ నాయకులు వాటిని తిరిగి అనేక రెట్లు రాబట్టుకోవటానికి చేసే ప్రయత్నంలో అవినీతి మరింత పెరుగుతుంది. ఆనాటి ప్రధాని రాజీవ గాంధీ అంచనా ప్రకారం పేదరిక నిర్మూలన కార్యక్రమాలకు కేటాయిస్తున్న ప్రతి రూపాయిలో 15 పైసలు మాత్రమే పేదలకు దక్కుతోంది. అవినీతి ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా ఉండటమే గాక, రాజకీయ వ్యవస్థ ప్రజాస్వామ్యయుతంగా నడపటానికి నిరోధకంగా మారుతోంది.

వినియోగ తత్వం పెరగటం, విద్యా, వైద్యం వ్యాపారవస్తువులుగా మారటం, వరకట్న సమస్య తదితర కారణాలతో సామాన్య ఉద్యోగ వర్గాలలో కూడా అవినీతి పెరుగుతోంది.

రాజకీయ రంగంలో అవినీతిని నిరోధించటానికి పెద్ద ఎత్తున ప్రజాసంస్థలు నిరంతరం ఉద్యమించాలి. కేంద్రంలో లోక్‌పాల్ వ్యవస్థను,

**అవినీతికి - రాజకీయానికి విడదీయరాని బంధం ఏర్పడిందనీ, డబ్బుపెట్టి గెలిచిన అభ్యర్థులకు, దాన్ని రాబట్టుకోవడానికి, సంపాదనే ధ్యేయంగా మారిదంటున్నారు భండారి అంకయ్య**

# అవినీతి రాజకీయాలు అడుగంటుతున్న విలువలు

ఉత్తర ప్రదేశ్ శాసనసభకు జరిగిన ఎన్నికల్లో ఓటమిపాలైన అప్పటి ముఖ్యమంత్రి ములాయంసింగ్ యాదవ్ 'సమాంతర ప్రభుత్వం నడిపిన ఎన్నికల కమిషన్ తమ కొంపముంచిందని' దుయ్యబట్టారు. తమ కనుసన్నల్లో పని చేసే ప్రధానకార్యదర్శి, డిజిపితో సహా ఎక్కువమంది ఉన్నతాధికారులు స్థానభ్రంశం ఆయన్ని కలచి వేసింది. ఇష్టారాజ్యంగా వ్యవహరించే అవకాశానికి కళ్లెం వేసింది. అందుకే అంతకోపం.

అయితే అక్కడి పరిస్థితులు ఆకళింపు చేసుకున్న వారికి, ఓటర్ల మనోభావాలు తెలుసుకున్న వారికి ములాయం ప్రకటన 'ఆడలేక మద్దెల ఓడన్న' సామెత గుర్తురాక మానదు. చివరి విడత పోలింగ్ పూర్తవగానే ఓ టి.వి. ఛానల్ లో ఓ వ్యక్తిని ఓటు ఎందుకు వేయలేదని వాకబు చేస్తే అతడు వెలిబుచ్చిన అభిప్రాయం ఆ రాష్ట్ర పరిస్థితులకు అద్దం పడుతుంది. "ఓటు ఎందుకు వేయాలి? వేస్తే ఏం ప్రయోజనం? పాలనతీరు మారదు. ఎందుకంటే ఎవరు గెలిచినా తేడా ఏం ఉండదు. అందరూ స్వార్థపరులే. ఎక్కువ మంది నేరగాళ్లు, గుండాలే. ఎవరు వచ్చినా మనకు ఒరగబెట్టేదేమీ ఉండదు." ఈ శాసనసభ ఎన్నికల్లో 11 కోట్ల పైచిలుకు ఓటర్లు ఉంటే కేవలం 46 శాతం ఓటర్లు మాత్రమే ఓటు హక్కు వినియోగించుకున్నారు. గత హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్ ఎన్నికల్లో సరాసరి 43 శాతం మాత్రం పోలవడానికి ఆశ్చర్యానికి గురిచేస్తుంది. సంపన్నులు నివాసం ఉండే బంజారాహిల్స్, జూబ్లిహిల్స్ ప్రాంతాల్లో ఇది 38 శాతం దాటకపోవడం గమనార్హం. ఇది ఓటర్ల నిరాసక్తతకు, ఎన్నికల పట్ల విముఖతకు ప్రబల నిదర్శనం. అంతేకాదు మధ్యతరగతి, ఎగువ మధ్యతరగతి, మేధోజీవులు, పెద్ద మనుషులు కనీసం తమ పేర్లు ఓటర్ల జాబితాలో ఉందో లేదో చూసుకోవడానికి ఉత్సుకత చూపడం లేదంటే, ప్రస్తుత రాజకీయ వ్యవస్థ పట్ల ఉన్న ఏవగింపు కారణమని స్పష్టమవుతోంది. రాజకీయాలు అవినీతి అక్రమాలకు పర్యాయపదాలుగా మారిపోతున్నాయి. ప్రజాహితాన్ని ఆకాంక్షించాల్సిన రాజకీయ పార్టీలు అధికారం పరమావధిగా పని చేస్తున్నాయి. అందుకే 'గెలుపు గుర్రాలని' వెదికి వెదికి, పట్టుకుని గోదాలోకి దింపుతున్నాయి. రాంపూర్ నియోజకవర్గం నుంచి మళ్లీ గెలిచిన పట్టణాభివృద్ధి శాఖా మంత్రి ఆజంఖాన్ ఫలితాలను ప్రకటిస్తున్న సమయంలో ప్రభుత్వం పడిపోతుందని గ్రహించి తన కార్యాలయంలో ఎన్నో ఫైళ్లను ధ్వంసం చేస్తూ బిజీగా ఉండిపోయారంటే, ఎంతటి అక్రమాలకు అతను ఒడిగట్టి ఉంటారో ఊహించవచ్చు. విషయం పసిగట్టిన పోలీసులు ఆయన కార్యాలయాన్ని 'సీలు' చేయడం సిగ్గుచేటుగా భావించలేదు. అది వేరే విషయం.

గతంలో కొలువుదీరిన శాసనసభల్లో 4072 ప్రతినిధుల్లో 700 మందికి నేర చరిత్ర ఉందని సాక్షాత్తు ఎన్నికల కమిషన్ పరిశీలనలో తేలింది. ఇలాంటివారి వల్లే రాజకీయాల్లో అవినీతి పెరిగిపోతోంది. నిజాయితీ గల అభ్యర్థులు దొరకడం లేదా అంటే రాజకీయ ప్రముఖులు

---

రాష్ట్రంలో లోకాయుక్తా వ్యవస్థను పటిష్టపరచాలి. ఎన్నికల వ్యయాన్ని గణనీయంగా తగ్గించి, సామాన్య కార్యకర్తలకు కూడా ఎన్నికలలో పోటీ చేసే వాతావరణం కల్పించాలి. మీడియా, న్యాయ వ్యవస్థలు, ప్రధాన భూమిక వహించి అవినీతిని ప్రశ్నించి, నిరోధించాలి. అన్ని రాజకీయ పార్టీలు విరాళాలను చెక్కుల రూపంలో తీసుకుని ఆదాయ, వ్యయాల పట్టికలను ప్రజల ముందు ఉంచాలి. ఆర్థిక వ్యవస్థలో నల్లధనం ఉత్పన్నమయే పరిస్థితిని నివారించాలి. ప్రతి ఓటరులో ఆత్మగౌరవాన్ని పెంపొందించి, తమ ఓటును అమ్ముకునే స్థితిని నివారించాలి. ఎన్నికల సమయంలో ఎలక్ట్రానిక్ మిడియాలలో, రేడియోలలో తగిన సమయాన్ని ఉచితంగా కేటాయించి, ప్రభుత్వమే ప్రచార సామాగ్రిని అందించి ఎన్నికల వ్యయాన్ని, గణనీయంగా తగ్గించటం ద్వారా, మంచివారు మౌనాన్ని వీడి, రాజకీయ రంగంలోకి ప్రవేశించగలరు. ఎన్నికల, పరిపాలన, ఆర్థికసంస్కరణలను, అవినీతికి ఆస్కారం లేని విధంగా ప్రవేశపెట్టి అమలు చేయాలి. అవినీతి లేని ప్రజాస్వామ్య వ్యవస్థ వికసించాలంటే బలమైన పారదర్శకత గల, పోటీతత్వం గల, సేవాతత్పరత గల, రాజకీయ పార్టీలు కావాలి. అంతిమంగా ప్రజల చైతన్యమే రాజకీయ రంగంలో అవినీతికి చరమగీతం పాడగలదు. ఆస్తి హక్కుపై పరిమితులు విధించాలి. వారసులకు తమఆస్తులు నేరుగా చెందే విధానంను సవరించి, అమెరికా మాదిరిగా ప్రభుత్వానికి కొంత పన్నులరూపంలో చెల్లించే విధానం రావాలి. ఆదాయ పన్నులను సక్రమంగా వసూలు చేసే విధానం రావాలి. ◆

ఇచ్చే సమాధానం మంచివాళ్ల మతిపోగొడుతుంది. "ఒక నియోజకవర్గం లో మా పార్టీ అభ్యర్థి విజయం సాధించాలంటే ఎదుటి పార్టీ అభ్యర్థిని అన్ని విధాలుగా ఎదుర్కోవాలి కదా. అంటే, డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెట్టగలగాలి. నయానో, భయానో లొంగ దీసుకునే కండ బలం ఉండాలి. ఓటర్లను ప్రలోభపెట్టే చాతుర్యం ఉండాలి. అందువల్ల కొన్ని చోట్ల అభ్యర్థులు అవినీతిపరులైనా, నేర చరిత్ర ఉన్నా వారిని పోటీలోకి దింపకుండా ఉండలేక పోతున్నాం. ఇది అనివార్యమవుతోంది. ఎందు కంటే మా పార్టీ గెలవాలి కదా" ఇది నేటి రాజకీయ పరిస్థితి. దీన్ని కొంతలోతుగా విశ్లేషించుకుందాం.

ఎన్నికల్లో పెడుతున్న విపరీత వ్యయం గురించి ఒక అంచనా ప్రకారం అయిదేళ్లకోసారి జరిగే ఎన్నికల్లో పార్లమెంట్, శాసనసభలకు ఎనిమిది వేల కోట్లు ఖర్చు అవుతోంది. ఈ రోజుల్లో ఒక శాసనసభా నియోజకవర్గానికి ఒక కోటి పైబడి ఖర్చు చేయడం మామూలైంది. అప్పట్లో తమిళనాడులోని సైదాపేట, కర్నాటకలోని కనకాపురా పార్లమెంట్ ఉపఎన్నికల్లో ఊహకందనంత వ్యయం – సుమారుగా 70–80 కోట్లు నమ్మశక్యంగా లేకపోయినా వాస్తవమని విశ్లేషకులు భావిస్తున్నారు. పేదరాష్ట్రంగా చెప్పుకునే బీహార్‌లో సైతం ఒక్కో పార్లమెంట్ స్థానానికి 2 నుండి 3 కోట్లు ఖర్చు చేస్తున్న వైనం ఆశ్చర్యం కలిగించడం లేదు. కృష్ణా జిల్లాలో ఓ గ్రామ పంచాయతీ సర్పంచ్ పదవికి ఒక కోటి పై బడి ఖర్చు చేసిన వాస్తవం విస్మయం గొల్పుతుంది. ఎన్నికల కమిషన్ పరిమితిని దాదాపు ఎవరూ పట్టించుకోవడం లేదు. ప్రమాణ పత్రం అబద్ధాలతోనే ప్రారంభమౌతుందన్న వాజపేయ్ వ్యాఖ్య ఇందుకు ఓ గీటురాయి.

ఏతావాతా తేలేదేమిటి? ఎన్నికల్లో గెలుపుకోసం అనైతిక పద్ధతులు అనుసరిస్తున్నారు. అనవసర ఖర్చులు మితిమీరి పోతున్నాయి. ఎన్నిక లంటేనే డబ్బుతో కూడుకున్న పని. అందువల్ల అవి డబ్బున్న వాళ్ల వ్యవహారంగా మారిపోయింది. నిజాయితీగా రాజకీయాల్లో నిలదొక్కుకునే పరిస్థితి లేదు. ఎన్నికల్లో చేస్తున్న ఖర్చును పెట్టుబడిగా భావిస్తున్నారు. ఇది ఒక వ్యాపారంగా మారిపోయింది. మూలమంతా ఇక్కడే ఉంది. అవినీతికి – రాజకీయానికి విడదీయరాని బంధం ఏర్పడింది. విపరీతంగా డబ్బుపెట్టి గెలిచిన అభ్యర్థులు, దాన్ని రాబట్టు కోకుండా ఉండలేరు. సంపాదనే ధ్యేయంగా మారిన తర్వాత నీతి నియమాలకు తిలోదకాలు ఇవ్వక తప్పదు. పర్యవసానంగా అవినీతి విశృంఖలత్వం సభ్య సమాజాన్ని కలవర పరుస్తున్నది.

ప్రజా ప్రతినిధులకున్న 'విశేషాధికారాలను' దుర్వినియోగం చేస్తున్న ఎందర్నో మనం చూస్తున్నాం.

సొమ్ముచేసుకోవడాన్ని అభివృద్ధి నిధుల కేటాయింపులో 15 నుంచి 30 శాతం కమిషన్లు తీసుకుంటున్న రుజువులు సభాపతినే కంగుతిని పించాయి. ఎంపిలాడ్సు పథకాన్నే రద్దు చేస్తే బావుంటుందని సోమనాథ్ చటర్జీ అభిప్రాయపడ్డారంటే అవినీతి తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. అయిదు సంవత్సరాల్లో ఒక్కో ఎం.పి.కి 10 కోట్లు కేటాయించి ఎంతగా దండుకుంటున్నారో వివరాలు తెలిసిన వారు గుండెలు బాదుకోవాల్సి వస్తుందంటే అతిశయోక్తి కాదు. శాసనసభ్యులకు ఉన్న విశేషాధికారం కూడా పెక్కు సందర్భాల్లో దుర్వినియోగం జరుగుతున్న నిజాలు ఎన్నో బయట పడుతున్నాయి. ఇలాంటి ప్రతినిధులు నియోజకవర్గ అభివృద్ధి చేయలేక ప్రజలకు ముఖం చూపలేక తప్పించుకుంటున్న సంఘటనలూ వెలుగులోకి వచ్చాయి.

ముడుపులు తీసుకుని పార్లమెంట్‌లో ప్రశ్నలు అడిగిన ఎం.పీలు ప్రజాస్వామ్య వ్యవస్థకే తలవంపులు తెచ్చారు. ఇప్పుడు బహిష్కృతులై ఏమీ తెలియని అమాయకుల్లా నటిస్తున్నారు.

పాస్‌పోర్టుల కుంభకోణం జాతి చరిత్రలోనే ఓ మాయని మచ్చగా మిగిలిపోతుంది. ప్రపంచ దేశాల దృష్టిలో భారత ప్రజాప్రతినిధులు మోసగాళ్లుగా, ద్రోహులుగా ముద్ర వేసుకుంటున్నారు. డబ్బు కోసం కక్కుర్తిపడి బినామీ పేర్లతో మనుషుల రవాణా చేస్తున్న కొందరు ఎంపీలు, ఎంఎల్ఏలు మన పరువును మంటగలుపుతున్నారు.

స్థానిక ప్రభుత్వాల ప్రతినిధులు సైతం వీరికేమాత్రం తీసిపోమని నిరూపించే ఎన్నో సంఘటనలు ఉన్నాయి. ప్రజావసరాలు పక్కనబెట్టి అధికారాన్ని ఆదాయ మార్గాలుగా భావిస్తున్న వారేం తక్కువగా లేరు.

అక్రమార్జనకు ఎన్నో మార్గాలు కనిపెట్టి బదిలీల్లో, కాంట్రాక్టుల్లో అవినీతి అధికారులతో కుమ్మక్కై వారి ద్వారా ప్రజల్ని దోపిడీ చేస్తున్న వైనం చూడలేక సామాన్య ప్రజానీకం రాజకీయాన్నే ఏవగించుకునే దశకు వచ్చింది. ఇలాంటి వారికి శిక్షలు పడిన దాఖలాలు లేకపోవడంతో వ్యవస్థ పట్ల సాధారణ జనానికి విశ్వాసం సడలిపోతోంది.

ఇక్కడ మనం జస్టిస్ పి.బి. సావంత్ 2005లో ముగ్గురు మంత్రుల అవినీతి పై అన్నాహజారే మహారాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలోని ఒక వ్యాఖ్యను గుర్తు చేసుకుంటే బావుంటుంది. ఆయన ఎమన్నారంటే, వేగంగా విస్తరిస్తున్న ఒక ప్రత్యేక వర్గం అక్రమార్జనకూ, అధికారానికీ పబ్లిక్ ఆఫీసులను సాధానాలుగా చూస్తున్నారు. అక్రమాలకు, అవినీతికి పాల్పడి ఎన్నికల్లో చేసే అసమంజస వ్యయాన్ని నిలువరించకపోతే ఏర్పడే పరిణామాలు చాలా విపరీతంగా ఉంటాయి.

ఈ అవినీతి రాజకీయాలు విశ్లేషించుకున్నప్పుడు రెండు రకాల కారణాలు కనిపిస్తున్నాయి :

**మొదటిది :** రాజకీయ పార్టీలు మనుగడకోసం, ఎన్నికల్లో గెలుపు కోసం అతిగా ఖర్చు పెట్టడం వల్ల అక్రమార్జన అనివార్యం అవుతోంది. ఇదొక విషవలయంగా మారుతోంది. రాజకీయాల్లో చాలామంది మంచి వాళ్లు ఉన్నప్పటికీ ఈ ఊబిలోనే కూరుకుపోతున్నారు.

**రెండవది :** అనైతిక పద్ధతుల్లో గెలుస్తున్న వ్యక్తులు, అధికారంలోకి రాగానే తాము ప్రజాసేవకులమని విస్మరిస్తున్నారు. ప్రత్యేక వర్గంగా భావిస్తున్నారు. స్వార్థం హద్దులు దాటి నీతి నియమాలను తుంగలో తొక్కుతున్నారు. కోట్లకు పడగలెత్తడానికి పెడదారులు తొక్కుతున్నారు. రాజ్యాంగ విలువలకు శిలువలు వేస్తున్నారు. ఎందరో కటారాలు, కాసిపేటలు పుట్టుకొస్తున్నారు. శిబుసోరెన్లు, షాబుద్దీన్లు నాయకులుగా చలామణి అవుతున్నారు. పప్పుయాదవ్, అరుణ్‌గావ్లీ లాంటి వాళ్లు అవసరమౌతున్నారు. మన్మోహన్‌సింగ్, అరుణ్‌జైట్లీ లాంటి వాళ్లు ఎన్నికల్లో ప్రజామోదం పొందలేకపోతున్నారు. ఇది కుహనా రాజకీయ సంస్కృతికి దర్పణం పడుతుంది.

అయితే అవినీతి ఒక్క రాజకీయ రంగానికే పరిమితం కాలేదు. అతి పవిత్రంగా భావించే న్యాయవ్యవస్థ కూడా ఇందుకు మినహాయింపు కాకపోవడం ఎంతో బాధాకరం. రెండేళ్ల క్రితం గుజరాత్‌లో మెజిస్ట్రేట్ ఒకరు కేవలం 40 వేలు లంచంగా ముట్టజెప్తే సాక్ష్యాత్తు రాష్ట్రపతికి, ప్రధాన న్యాయమూర్తికి సమన్లు జారీ చేయడం మనం మరిచిపోలేం. మహారాష్ట్రలో అవినీతికి పాల్పడిన న్యాయమూర్తులను 15 శాతం మందిని ఒకేసారి పదవి నుండి తప్పించడం సాధారణ విషయం కానేకాదు.

ఎందరో ఉన్నతాధికార్లు అక్రమార్జనతో కోట్లు కూడబెట్టిన వైనం ఎసిబి దాడుల్లో ఇటీవల చూస్తూనే ఉన్నాం. రక్షణ శాఖలో కూడా అవినీతి మకిలి అంటుకున్నది. అప్పటి దేశ ప్రధానమంత్రిగా ఉన్న రాజీవగాంధీ బోఫోర్స్ కుంభకోణం ఇంకా కుదిపేస్తునే ఉంది. 'తెహల్కా డాట్ కామ్ కొనుగోళ్ల వ్యవహారం ఎందరో అవినీతిపరుల్ని బయట పెట్టింది. కొందరి ఉద్యోగాలకు ఉద్వాసన పలికించింది. సాలీనా మనదేశంలో ఒక లక్షా యాభై వేల కోట్ల నుండి రెండు లక్షల కోట్ల రూపాయల అవినీతి జరుగుతున్నట్లు అంచనా. ఇది ఆంధ్రప్రదేశ్ బడ్జెట్‌కు రెట్టింపు.

అయినా రాజకీయ రంగం ప్రజాజీవనంలో అవినీతికి అతి పెద్ద బాధ్యత వహించవలసి వస్తుంది. మన జీవితాన్ని స్పృశించే అన్ని అంశాలకూ రాజకీయాలకూ సంబంధం ఉన్నదని బాపూజీ నాడు చెప్పిన మాటలు ఒక్కసారి గుర్తు చేసుకుందాం. అయితే ప్రజల సమస్యలు తీర్చాల్సిన రాజకీయమే ఇప్పుడు ఒక సమస్యగా మారింది. ఈ సంస్కృతి మారాలి. రాజకీయం ప్రజలకోసం అయినప్పుడు అది వారి చుట్టూనే తిరగాలి. ప్రజలు కేవలం ఓటర్లుగా, ఏక్‌దిన్ కా సుల్తాన్‌లు కాకూడదు. ప్రజలు నిర్ణయాధికారం కలిగిన ప్రభువులుగా మన ప్రజాస్వామ్య వ్యవస్థ రూపుదిద్దుకోవాలి.

## ఇందుకు కొన్ని పరిష్కార మార్గాలు ఉన్నాయి

- ఆటగాళ్లని మార్చడం కాదు ఆట నియమాలు మారాలి. ఇప్పుడున్న ఎన్నికల తీరు తెన్నులు మారాలి. విధానాలు కొన్ని మారాలి. ఉదా : దామాషా పద్ధతి ఎన్నికలు, రాష్ట్ర అధినేతను నేరుగా ఎన్నుకోవడం, ఎన్నికల ఖర్చు ప్రభుత్వం భరించే విధానం.
- కుటుంబ, వారసత్వ రాజకీయాలకు స్వస్తి పలకాలి. రాజకీయ పార్టీల్లో అంతర్గత ప్రజాస్వామ్యం ఉండే విధంగా చర్యలు తీసుకోవాలి.
- నేర చరిత్రకు, అక్రమార్జనకు కొత్త నిర్వచనం చెప్పుకోవాలి.
- శిక్షార్హమైన నేరం చేసిన వారు చట్టసభల్లో ప్రవేశించకుండా విధి విధానాలు మార్చుకోవాలి.
- అవినీతి, అక్రమార్జనపరుల ఆస్తులు ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడమే కాకుండా వీరికి కఠినతరమైన శిక్షలు అమలయ్యే విధంగా చట్టాలు రావాలి.
- నేర పరిశోధనా వ్యవస్థను రాజకీయనేతల ప్రమేయం లేని విధంగా సంస్కరణలు తేవాలి.
- పారదర్శకత, జవాబుదారీతనం మరింత మెరుగవ్వాలి.
- ఇప్పుడున్న చట్టాలను ప్రజావసరాలకు అనుగుణంగా మార్చుతేవాలి.

ఇలాంటి అంశాలన్నింటినీ అన్ని పక్షాలు చర్చించి సముచిత విధానాలు నిర్ణయించాల్సిన బాధ్యత అందరి మీదా ఉంది.

అవినీతి లేని ప్రజాస్వామ్యం సాధించుకోవడమంటే మంచి పాలన అందించడం అని ప్రతీ ఒక్కరూ భావించాలి. అది మంచి రాజకీయాల వల్ల మాత్రమే సాధ్యమవుతుందని మరచిపోరాదు. అప్పుడే ప్రజల కనీస అవసరాలు తీరి సుఖ, శాంతులతో జీవించగలుగుతారు. ◆

### ఆపరేషన్ దుర్యోధన!

ప్రజల సమస్యలను తీరుస్తామని రకరకాల వాగ్దానాలతో ఎన్నికలలో గెలిచిన ఎం.పిలు ప్రజల సమస్యలను పార్లమెంట్‌లో ప్రశ్నించడానికి తీసుకున్న లంచాల వివరాలు. ఇందులో వివిధ పార్టీల ఎం.పి.లు ఉన్నారు.

| పేరు | పార్టీ | నియోజకవర్గం | నగదు (రు.) |
|---|---|---|---|
| అన్నా సాహెబ్. ఎం.కె. పాటిల్ | బిజెపి | ఎర్నడొల, మహారాష్ట్ర | 45,000 |
| వై.జి. మహాజన్ | బిజెపి | జల్‌గాం, మహారాష్ట్ర | 35,000 |
| సురేష్ చందేల్ | బిజెపి | హమీర్‌పూర్, హిమాచల్‌ప్రదేశ్ | 30,000 |
| ఛత్రపాల్‌సింగ్ లోధా | బిజెపి | రాజ్యసభ సభ్యులు, ఒరిస్సా | 15,000 |
| ప్రదీప్ గాంధి | బిజెపి | రాజ్‌నంద గాంవ్, ఛత్తీస్‌ఘడ్ | 55,000 |
| చంద్రప్రతాప్ సింగ్ | బిజెపి | సింధీ, ఉత్తర్‌ప్రదేశ్ | 35,000 |
| నరేంద్ర కుమార్ ఖుష్‌వాహ | బిఎస్‌పి | మీర్జాపూర్, ఉత్తర్‌ప్రదేశ్ | 55,000 |
| లాల్‌చంద్ర కోల్ | బిఎస్‌పి | రాబర్ట్సగంజ్, ఉత్తర్‌ప్రదేశ్ | 35,000 |
| రాజారాంపాల్ | బిఎస్‌పి | బిల్‌హౌర్, ఉత్తర్‌ప్రదేశ్ | 35,000 |
| రాంసేవక్ సింగ్ | కాంగ్రెస్ | గ్వాలియర్, మధ్యప్రదేశ్ | 50,000 |
| మనోజ్ కుమార్ | ఆర్‌జెడి | పలాము, జార్ఖండ్ | 1,10,000 |

## అవినీతిపరులు - కుంభకోణాలు - ఆరోపణలు - కుట్రలు

ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్ ప్రకారం 2005లో భారతదేశం అవినీతిలో ఇరాన్, బోస్నియా, గెబాన్‌లతో 88వ స్థానంలో ఉంది. ఈ సంవత్సరం ర్యాంకింగ్స్‌లో 18 స్థానాలు ఎగబాకి 70వ స్థానానికి చేరుకుంది. ఈ సర్వేలో 163 దేశాలను పరిగణనలోకి తీసుకున్నారు. మన దేశం చైనాతో సమానంగా నిలిచింది. ఒక పక్క నూటయాభై ఏళ్ల ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ సంబరాలనూ, వందేళ్ల భగత్‌సింగ్ శతజయంతి ఉత్సవాలనూ, కొద్ది రోజుల్లో అరవైఏళ్ల స్వాతంత్ర్యాన్నీ జరుపుకోబోతున్న భారతదేశంలో రేఖా మాత్రంగా కొన్ని కుంభకోణాల వివరాలు కింద ఇవ్వబడ్డాయి. ఇవన్నీ కూడా దేశాధినేతలూ, ప్రముఖులూ - ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, పార్టీలూ సిద్ధాంతాలతో నిమిత్తం లేకుండా చేసిన అవినీతికి తార్కాణాలు. ఈ కోట్లాది రూపాయల ప్రజాధనంతో విద్య, వైద్యం, తాగునీరు, సాగునీరు లాంటి ఎన్నో ప్రజల మౌలిక అవసరాలను తీర్చే ప్రాజెక్టులను పూర్తి చేయవచ్చు.

| | |
|---|---|
| 1947/48 | జీపులు, రైఫిల్స్, బాంబర్లు, రక్షణ వాహనాల కొనుగోళ్లలో కృష్ణమీనన్ ఒక బోగస్ బ్రిటిష్ కంపెనీకి అడ్వాన్స్‌గా డబ్బులు చెల్లించారు. దిగుమతి అయిన తరువాత అవన్నీ నిరుపయోగమైనవని తేలింది. |
| 1949 | ఒక వజ్రాల వ్యాపారికి లీజ్ పొడిగింపుకై వింధ్యప్రదేశ్ వాణిజ్య మంత్రి రు. 25,000 లంచం తీసుకున్నారు. |
| 1951 | చట్ట విరుద్ధంగా సైకిళ్ల విడిభాగాల దిగుమతుల్లో వాణిజ్య పరిశ్రమల కార్యదర్శి అవినీతికి పాల్పపడ్డారు |
| 1957 | ముంద్రా అనే వ్యాపారికి ఒక కోటి రూపాయల అప్పు ఇప్పించడంలో ఎల్.ఐ.సి వారు, టి.టి. కృష్ణమాచారి, ఎచ్.ఎం. పటేల్‌లు అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారు. |
| 1962 | ది ధర్మ తేజ షిప్పింగ్ కంపెనీ కుంభకోణం - ఈ బోగస్ కంపెనీ పేరిట దేశం నుంచి డబ్బు తరలిపోయింది. |
| 1964 | పంజాబ్ ముఖ్యమంత్రి ప్రతాప్‌సింగ్ కైర్యాన్, తన కుటుంబ సభ్యులు అక్రమంగా ఆస్తులు కూడబెట్టుకోవడానికి సహకరించారు. |
| 1971 | స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి రు. 60 లక్షల నగదును రుస్తుమ్ నగర్‌వాలా ఇందిరాగాంధీ పేరిట అక్రమంగా డ్రా చేసుకున్నారు. |
| 1974 | పాండిచ్చేరి వ్యాపారులు దిగుమతుల లైసెన్సును పొందడానికి 21 మంది పార్లమెంట్ సభ్యుల సంతకాలను ఫోర్జరీ చేసారు. దీనికి కాంగ్రెస్ ఎం.పి. తుల్‌రామ్ సహకరించారు. |
| 1982 | చుర్హాత్ లాటరీ కుంభకోణం - చిల్డ్రన్ వెల్ఫేర్ సొసైటీ పేరిట చట్ట విరుద్ధంగా డబ్బులు వసూలు చేసారు. |
| 1987-89 | బోఫోర్స్ కుంభకోణం |
| 1992 | హర్షద్ మెహతా స్టాక్ ఎక్స్ఛేంజ్ కుంభకోణం |
| 1993 తరువాత | ఎబిబి లోకో డీల్, చక్కెర కుంభకోణం, జైన్ డైరీలు, యూరియా కుంభకోణం, గడ్డి కుంభకోణం, టెలికాం కుంభకోణం, ఇండియన్ బ్యాంక్ కుంభకోణం, జయలలిత టాన్సీ భూముల కుంభకోణం, సిఆర్‌బి, హెడిడబ్ల్యూ సబ్‌మెరైన్ కుంభకోణం, బిటుమిన్ కుంభకోణం, జె.ఎం.ఎం. ముడుపుల కుంభకోణం, సెయింట్ కిట్స్ కుంభకోణం, అనంత్‌నాగ్ ట్రాన్స్‌పోర్ట్ సబ్సిడీ కుంభకోణం, హవాలా కుంభకోణం, కేరళలో ఎస్.ఎన్.సి. లావలీన్ కుంభకోణం, కేతన్ పారేఖ్, బారక్ మిసైల్ ఒప్పందాల కుంభకోణం, తెహల్కా కుంభకోణం, హౌసింగ్ కుంభకోణం, ఎం.పి. ట్రేడింగ్, ఎం.పి. లాడ్స్ నిధుల దుర్వినియోగం, వైద్య పరికరాల కుంభకోణం, న్యూస్‌ప్రింట్ కుంభకోణం, తారు కుంభకోణం, భూ కుంభకోణం, మందుల కుంభకోణం, అటవీ కుంభకోణం, ఆయుర్వేద కుంభకోణం, ధోవతుల - చీరల కుంభకోణం, బొగ్గు కుంభకోణం, అడవుల రిజర్వ్ కుంభకోణం, వక్ఫ్ కుంభకోణం, సుఖోయ్ ఎస్.యూ-30 విమానాల కొనుగోలు ఒప్పందంలో కుంభకోణం, తెల్గి స్టాంప్ పేపరుల కుంభకోణం, ఆయిల్ ఫర్ ఫుడ్ కుంభకోణం, హ్యూమన్ ట్రాఫికింగ్... |

మన రాష్ట్రంలో గత కొన్ని సంవత్సరాలలో జరిగిన కుంభకోణాలు (రు.కోట్లలో)

మద్యం కొనుగొళ్లు - 550, ఏలేరు - 200, స్కాలర్‌షిప్పులు - 100, నకిలీ స్టాంపులు - 300, నీరు మీరు - 2300, పనికి ఆహారం - 1500, పిఎస్‌యులలో పెట్టుబడుల ఉపసంహరణ - 500, టైమర్లు - 50, సచివాలయం 'డి' బ్లాక్ నిర్మాణం - 50, ఐఎంజి - 1000, నగర శివార్లలో భూముల లావాదేవీలు - 1500 ; ముఖ్యమంత్రి సహాయ నిధి కుంభకోణం, అర్బన్ బ్యాంకుల కుంభకోణం, సోమశిల కుంభకోణం, స్టేషనరీ కుంభకోణం, స్వల్ప వ్యవధి విద్యుత్ ప్రాజెక్టుల కుంభకోణం, నకిలీ మద్యం, ఇంజనీరింగ్, మెడికల్ కళాశాలల కుంభకోణం, బెరైటీస్ కుంభకోణం, కొల్లేటి భూముల దురాక్రమణ, సంఘీ ప్లాంటేషన్స్ కుంభకోణం, వోక్స్‌వ్యాగన్, జలయజ్ఞం, డిపెప్, హ్యూమన్ ట్రాఫికింగ్...



- సిడిఆర్‌సి సేకరణ

**రాజకీయరంగంలో అవినీతి కేవలం రాజకీయవాదుల లంచగొండితనం, ఆర్థిక కుంభకోణం మాత్రమే కాదని, అది సామాజిక, సాంస్కృతిక, పాలనావిధాన సమస్య అని అంటున్నారు ఎన్. వేణుగోపాల్**

# ఇది సామాజిక విలువల సమస్య

ఏ పత్రిక తెరిచినా, ఏ టెలివిజన్ వార్తలు చూసినా రాజకీయ నాయకుల అవినీతి వార్తలు, పాలనాపరమైన కుంభకోణాలు లేకుండా ఒక్క రోజు గడవడం లేదు. సమాజం యావత్తూ పైనుంచి కింది దాకా అధికారం, అవకాశం ఉన్నవాళ్లందరూ ఎంతో కొంత అవినీతికి పాల్పడుతూ సమాజం మొత్తంలో అవినీతి పెచ్చరిల్లి పోవడానికి కారణమవుతూ అవినీతి ఒక సర్వవ్యాపిత అంశం అయిపోయింది. తాము చేసినంతవరకూ అవినీతి కాదనీ అవతలి వారు చేసిన ఏ పనయినా అవినీతి అని స్వయం సమర్థన, ఇతరుల మీద విమర్శ కూడ అవినీతి విస్తరించడానికి కారణమౌతున్నాయి.

అంతర్జాతీయ స్థాయిలో ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్ వంటి సంస్థల నుంచి ప్రారంభించి దేశీయ, ప్రాంతీయ స్థాయిలోని ప్రచార సాధనాల వరకూ అవినీతి మీద పరిశోధనలు జరుపుతున్నాయి. అవినీతి మీద ఇంత పెద్ద ఎత్తున పరిశోధనలు జరుగుతున్నప్పటికీ, సమాచారం వెలువడుతున్నప్పటికీ క్రమక్రమంగా సామాజిక విలువల్లో అవినీతి పట్ల నిర్లిప్తత పెరుగుతోంది. ఒకప్పుడు అవినీతిని, అవినీతిపరులను అసహ్యించుకున్న స్థాయిలో ఇవాళ అసహ్యం కాదు గదా వ్యతిరేకత కూడ ఉండడంలేదు. ఒకరకంగా అవినీతి పట్ల, అక్రమార్జన పట్ల ఆకర్షణ పెరుగుతున్నది. అవినీతి ద్వారా ఆస్తులు సంపాదించడం సమర్థతగా, ఘనతగా చూడబడుతున్నది. ప్రత్యర్థులు ఎంత ప్రయత్నించినా, అవతలి వాళ్ల అవినీతి గురించి ఎన్ని ప్రచారాలు చేసినా ఎన్నికలలో అవినీతి పరులు సునాయాసంగా గెలుస్తున్నారు. గెలిచిన ప్రతి గ్రామస్థాయి వార్డ్ మెంబర్ నుంచీ శాసనసభ్యుడి నుంచీ పార్లమెంట్ సభ్యుడి దాకా ప్రతి ఒక్కరి జీవితాలు కనీసం స్థానిక ప్రజలకైనా సంపూర్ణంగా తెలుసు గనుక ఎన్నికల రాజకీయాలలో ఆ ప్రజాప్రతినిధులు ఎట్లా కోట్లకు పడగెత్తారో ప్రజలు చెబుతూనే ఉన్నారు. అయినా అవినీతి ప్రభావం ఎన్నికల ఫలితాల మీద ఉండడం లేదు. అవినీతిపరులే మళ్లీ గెలుస్తున్నారు. దేశ రక్షణకు అవసరమైన శతఘ్నుల కొనుగోలు కుంభకోణంలో ఆరోపణలు ఎదుర్కొని కూడా ఒక ప్రధానమంత్రి ఎటువంటి విచారణ, శిక్ష లేకుండా తప్పించుకున్నాడు. అవినీతి చర్యలో ఉండగా పట్టుబడి కెమెరా కన్నుకు దొరికిన రాజకీయ నాయకులెందరో ఎటువంటి శిక్షలు లేకుండా రాజకీయాలలో కొనసాగుతున్నారు. ఒకరకంగా రాజకీయ అవినీతిని ప్రజలు పట్టించుకోవడం లేదేమో, అందరూ అవినీతిపరులే అయినప్పుడు ఎవరిని వేలెత్తి చూపగలం అనే నిర్లిప్తత పెరుగుతున్నదేమో అనిపించే వాతావరణం నెలకొన్నది. అవినీతి ఆరోపణలు చేసేవారికీ, ఎదుర్కొనే వారికీ కూడ ఏదో ఒక స్థాయిలో అవినీతి చరిత్ర ఉండడం వల్ల అసలు అవినీతి ఒక చర్చనీయాంశనీయమే కాకుండా పోయిందేమో అని పిస్తుంది. కానీ వ్యవస్థ పట్ల నమ్మకం నిలిపి ఉంచడానికి, ఎప్పుడో ఏదో ఒక మంచి పని జరుగుతుందని ప్రదర్శించి చూపడానికి అప్పుడప్పుడు చిన్న చేపలను పట్టుకోవడం, వారి అవినీతి గురించి విస్తృతంగా వార్తా కథనాలు వెలువడడం, వారి మీద ఎంతో కొంత విచారణ కూడా జరగడం సర్వసాధారణమైపోయింది.

ఎక్కడో ఒక చోట అటువంటి చిన్నస్థాయి ఉద్యోగులకు, అంగ బలం, అర్థబలం పెద్దగా లేని వర్గాల నుంచి వచ్చిన వారికి శిక్షలు కూడా పడవచ్చు. కానీ పెద్ద చేపల అవినీతి ఎప్పటికీ బయటపడదు. బయటపడినా విచారణ దాకా రాదు.

ఇటువంటి స్థితిలో మనుషుల అక్రమ రవాణా, నకిలీ పాస్‌పోర్ట్ కుంభకోణం మళ్లీ ఒకసారి రాజకీయ అవినీతి కుంభకోణపు తేనెతుట్టను కదిలించింది. రాష్ట్రంలో నిన్న మొన్ననే బయటపడి అప్పుడే మతిమరపు పాలైన డిపెప్ కుంభకోణం, దేశంలో పార్లమెంట్ ప్రశ్నల ముడుపుల కుంభకోణం కాలగర్భంలో కలిసిపోగా ఒక కొత్త అలలాగా నకిలీ పాస్‌పోర్ట్‌ల కుంభకోణం వచ్చింది. సముద్రంలో ఒక కెరటాన్ని మించి మరొక కెరటం వచ్చినట్టు మరొక కుంభకోణం బయటపడేదాకా ఈ నకిలీ పాస్‌పోర్ట్‌ల కుంభకోణం మన ప్రచార సాధనాల స్థలాన్ని ఆక్రమిస్తుంది.

దేశంలో ఇంత విరివిగా, ఇంత పెద్ద ఎత్తున సాగుతున్న అవినీతి కుంభకోణాలను ఎప్పటికప్పుడు విస్మృతిలో జారవిడవకుండా అసలు ఈ అవినీతికి మూలం ఏమిటి, ఇది ఎందువల్ల జరుగుతోంది, దీనివల్ల లాభపడుతున్నది ఎవరు, దీని వల్ల నష్టపోతున్న దేశ సంపద ఎంత, ఆ సంపదను ఉత్పత్తి చేస్తున్న శ్రమజీవుల న్యాయమైన వాటాను ఈ అవినీతిపరులు ఎట్లా దోచుకుపోతున్నారు, ఇటువంటి అవినీతి ప్రపంచ చరిత్రలో ఏ పర్యవసానాలకు దారితీసింది వంటి చారిత్రక, సామాజిక, రాజకీయార్థిక పరిశీలన జరపవలసి ఉంది. అంతర్లోతైన పరిశీలన జరపకుండా పైపైన అవినీతి గురించి ఎంత మాట్లాడినా, ఎంత తీవ్రంగా ఖండించినా, దాన్ని మూలాల నుంచి పెకలించడం సాధ్యం కాదు.

భారత చరిత్రలో పాలనాపరమైన అవినీతి గురించి ప్రస్తావన కౌటిల్యుని అర్థశాస్త్రం నుంచే ఉన్నప్పటికీ ఆధునిక కాలపు అవినీతి

గురించే మాట్లాడుకుంటే సరిపోతుంది. ఆధునిక భారతదేశపు పాలనా విధానంలో అవినీతిని ప్రవేశపెట్టిన వారు బ్రిటిష్ పాలకులే. అసలు తమ సీమ నుంచి మరొక ప్రాంతానికి వచ్చి ఆ ప్రాంతాన్ని కబళించి అక్కడ రాజ్యాధికారాన్ని నెరపడమే సాంస్కృతిక అవినీతి. కాని ఇక్కడ మనం అవినీతిని అంత విశాలార్థంలో కూడ చర్చించనక్కర్లేదు.

అవినీతి అంటే పాలనా అధికారాన్ని ఉపయోగించి తనకు అందవలసిన దానికన్నా ఎక్కువ సొమ్ము సంపాదించడం, ఆస్తి సంపాదించడం, తన కుటుంబ సభ్యులకు, ఆశ్రితులకు అర్హత లేని అధికారం కట్టబెట్టడం అవినీతి అని ప్రపంచ బ్యాంక్ ఇచ్చిన నిర్వచనమే తీసుకున్నా భారత ప్రభుత్వ పాలనా యంత్రాంగంలో అవినీతి వలస పాలనా కాలంలోనే ప్రవేశించింది. 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం 1937లో ఎన్నికలు జరిగి అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వాలు 1939 నాటికే అవినీతి మయమైపోయాయి. ఆ మాట స్వయంగా గాంధీ ఒప్పుకున్నాడు. 'ప్రస్తుతం విచ్చలవిడిగా కొనసాగుతున్న అవినీతిని ఆమోదించడం కంటే, కాంగ్రెస్‌ను గౌరవంగా సమాధి చేయడానికే నేనిష్టపడతాను' అని గాంధీ 1939 మే లో అన్నాడు.

అలా 1937లో అవినీతిని అలవాటు చేసుకున్న కాంగ్రెస్ ఈ 70 సంవత్సరాలలో దేశంలోని అన్ని అక్రమాలకు కన్నతల్లి అయినట్టుగానే అవినీతిని కూడ పెంచి పోషించింది. 1947 తరువాత అవినీతి గురించి పరిశోధించడానికి, ఆ సమస్యను పరిష్కరించే మార్గాలు కనిపెట్టడానికి ఎన్నో కమిషన్లు వచ్చాయి. ఎన్నో నివేదికలు వెలువడ్డాయి. అవినీతి పెరిగిందే తప్ప తరగలేదు. పది సంవత్సరాల కింద దేశంలో అవినీతి గురించి పరిశోధనాత్మక గ్రంథం రాసిన సీనియర్ ప్రభుత్వాధికారి ఎస్.ఎస్. గిల్, దేశంలో కాంగ్రెస్ పాలనాకాలంలో అవినీతి ప్రయాణం ఎట్లా సాగిందో వివరించారు. తన మంత్రుల అవినీతి పట్ల మౌనం వహించిన జవహర్‌లాల్‌నెహ్రూ అవినీతికి సాధికారిత కల్పించాడని, ఆ తరువాత ఆయన కూతురు ఇందిరాగాంధీ తన ఖజానా నింపుకోవడానికి అవినీతిని సుస్థిరం చేసిందని, ఆ తరువాత రాజీవ్‌గాంధీ స్వయంగా తానే రక్షణసామగ్రి కొనుగోళ్ల కుంభకోణంలో ఆరోపణలు ఎదుర్కొన్నాడనీ, ఆ తరువాత ప్రధాని పి.వి. నరసింహారావు అవినీతి ఆరోపణలపై బోను ఎక్కవలసి వచ్చిందని ఆయన రాశాడు.

ఆ తరువాత ప్రధానుల కాలంలో అవినీతి మరింత విస్తరించింది. ఈ విస్తరణ కూడ ఒకవైపు పరిమాణంలోను, మరొకవైపు రంగాలలోనూ, మరొకవైపు నిర్లజ్జపూరితంగానూ, బహిరంగంగానూ సాగింది. ఇందిరా గాంధీ పాలనా కాలంలో నగర్‌వాలా కుంభకోణం పేరుతో బయటపడిన అవినీతి కేవలం అరవై లక్షల రూపాయలు. అంటే మూడు దశాబ్దాల కింద ప్రధాన మంత్రి హోదాలో అవినీతి కొన్ని లక్షలకు, బహుశా కొన్ని కోట్లకు మించేది కాదన్నమాట. రాజీవ్‌గాంధీ పాలనా కాలానికి బోఫోర్స్ శతఘ్నుల కుంభకోణంలో అరవై కోట్ల రూపాయలు ముడుపులు చేతులు మారాయని బేనామీ ఖాతాలలో రాజీవ్‌గాంధీ ఆ మొత్తాన్ని స్విస్‌బ్యాంకుల్లో దాచుకున్నా రని ఆరోపణలొచ్చాయి. ఆ తరువాత రాష్ట్రాల ముఖ్యమంత్రులు, మంత్రులు, ఎం.ఎల్.ఏ.లు కూడ వందల కోట్ల అవినీతికి పాల్పడుతు న్నారని వార్తలు వస్తున్నాయి. గతంలో దేశ ప్రయోజనాలకు భంగకరం కాని ప్రజాసంక్షేమ కార్యక్రమాలు కాని రంగాలలోనే అవినీతి జరుగుతుండేది. కాని, ఆ తరువాత రక్షణ రంగంలో భారీ ఆయుధ సామాగ్రి నుంచి శవపేటికల కొనుగోళ్లు దాకా, పశువుల దాణా నుంచి పిల్లల పాలపొడి దాకా, లోక్‌సభలో ప్రశ్నల అడగడం నుంచి ప్రాథమిక విద్య పరికరాల దాకా అవినీతి లేని రంగం లేకుండా పోయింది. మరీ ముఖ్యంగా నూతన ఆర్థిక విధానాల తర్వాత ప్రపంచీకరణ క్రమంలో దేశంలోని పాలనారంగంలో అధికార వర్గంలోనూ, ప్రజాప్రతినిధులలోనూ అవినీతి మరింత పెరిగిపోయిందని ఎన్నో అధ్యయనాలు చూపుతు న్నాయి. జవహర్‌లాల్ నెహ్రూ విశ్వ విద్యాలయ అర్థశాస్త్ర నిపుణులు అరుణ్ కుమార్ 1999 లో ప్రచురించిన 'ది బ్లాక్ ఎకానమీ ఇన్ ఇండియా' అనే అధ్యయనంలో ప్రపంచీకరణకు అక్రమార్జనకు ఉన్న అవినాభావ సంబంధాన్ని వివరించారు.

అవినీతి గురించిన చర్చలలో సింహభాగాన్ని ఆ అవినీతితో ముడిపడిన డబ్బు లెక్కలు ఆక్రమిస్తాయి. ఒక అవినీతి కుంభకోణం బయటపడగానే బ్యాంక్ ఖాతాలలో ఎంత సొమ్ము ఉంది, ఎక్కడెక్కడ ఎన్ని ఆస్తులు ఉన్నాయి, ఇంట్లో ఎంత బంగారం దొరికింది వంటి వివరాలన్నీ ప్రధానమైపోతాయి. ఒక రకంగా చూస్తే ఇవన్నీ పరిశీలకుల, పాఠకుల మనస్సులలో ఈర్ష్యను, అసూయను అటువంటి ఆస్తులు తాము సంపాదించలేకపోయామే అనే దుగ్ధను కలిగిస్తాయి. ఈ ఆర్థిక కోణం గురించి ప్రకటించడం చాలా అవసరమే గాని అదే ఏకైకం అయిపోవడం వల్ల ఈ ప్రమాదం ఉంది. అందువల్ల అవినీతి గురించి చేసే చర్చ దాని ఇతర కోణాలన్నింటినీ కూడ పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది.

అవినీతిని ప్రధానంగా సామాజిక విలువల సమస్యగా చూడాలి. పాలనాపరమైన అవినీతి మరింత ఎక్కువగా సామాజిక విలువల సమస్య అవుతుంది. అవినీతిలో మౌలికం అయిన అంశం ఒక వ్యక్తి తన అధికార పరిధిని మించి అధికారాన్ని వినియోగించడం. నిజానికి చట్టబద్ధపాలన, రాజ్యాంగబద్ధ పాలన సక్రమంగా జరిగితే ఏ మనిషికైనా ప్రభుత్వ ఉద్యోగం చేసేటప్పుడు, గ్రామ సేవకుని స్థాయినుంచి రాష్ట్రపతి స్థాయిదాకా ప్రతి ఒక్కరికీ అధికార పరిధి ఏమిటో స్పష్టమైన నిర్దేశ సూత్రాలు ఉంటాయి. ఆ నిర్దేశసూత్రాలను ఉల్లఘించే హక్కు ఎవరికీలేదు. అటువంటి ఉల్లంఘనలవల్ల ఎవరికైనా ప్రయోజనం చేకూరేటప్పుడు ఆ ప్రయోజనం పొందేవారు అటువంటి ఉల్లంఘనకు పాల్పడమని ప్రభుత్వ అధికారి మీద ఒత్తిడి తేస్తారు. ఎంత ఒత్తిడి వచ్చినా నిర్దేశక సూత్రలనూ ఉల్లంఘించబోం అని అధికారులు, ఉల్లంఘించకూడదు, ఉల్లంఘిస్తే ఉద్యోగం వదులుకోవలసిందే, శిక్ష భరించవలసిందే అని సమాజం చెప్పినప్పుడు మాత్రమే ఉల్లంఘనలు జరగకుండా ఉంటాయి.

కనుక డబ్బు సంపాదిస్తున్నారా, ఆస్తులు కూడబెట్టుకుంటున్నారా, తరతరాలకు తరగని సంపద పోగు చేసుకుంటున్నారా అనే ప్రశ్నలకన్న ముఖ్యంగా తమ అధికార పరిధిలోపల పాటించవలసిన నియమాలను పాటిస్తున్నారా, ఉల్లంఘిస్తున్నారా అనేది ముఖ్యమైన ప్రశ్న. భారత సైన్యం తన అవసరాల కోసం శతఘ్నిని కొనదలచుకున్నప్పుడు, అంతర్జాతీయ మార్కెట్లో నాలుగు శతఘ్నులు పోటీ పడినప్పుడు వాటిలో అన్నిటికన్నా నాణ్యమైనదాన్ని ఎంచుకోవలసి ఉండింది. కాని, ఆ శతఘ్నుల కంపెనీలలో ఒకటి ప్రధానమంత్రికి అక్రమంగా ముడుపులు ఇచ్చి నాణ్యతతో సంబంధం లేకుండా తమ శతఘ్నులే కొనమని సూచించింది.

ఇక్కడ సమస్య డబ్బుల కన్న ముఖ్యంగా ఒక ప్రధానమంత్రి చేసిన నియమోల్లంఘన. అక్కడ మొదలు పెడితే ఇటీవల ఒక టౌన్ ప్లానింగ్ అధికారి ఇంట్లో దొరికిన ఆస్తులు చూస్తే ఆ ఆస్తులన్నీ ఆయన టౌన్ ప్లానింగ్ నిబంధనలు అతిక్రమించి భవన నిర్మాణాలకు ఇచ్చిన అనుమతుల వల్ల సంపాదించినవి. అంటే ఆయన అక్రమార్జన మీద దృష్టి మీద పెట్టవలసిందే కాని అంతకన్నా ముఖ్యంగా నియమోల్లంఘన మీద కేంద్రీకరించాలి. ప్రతి ప్రభుత్వ ఉద్యోగానికి కొన్ని నియమాలు ఉంటాయని, ఆ నియమాలను ఉల్లంఘించకూడదని, స్వప్రయోజనం కొరకు ముడుపుల కొరకు వాటిని ఉల్లంఘించడం మరింత దుర్మార్గమని ఒక సామాజిక విలువ ప్రచారంలోకి రావాలి. అంటే ప్రభుత్వానికి ఒక నియమబద్ధ పాలన అలవాటు కావాలి.

ఇదంతా సామాజిక విలువలలో ఒక పార్శ్వం కాగా మరొక పార్శ్వం ఈ అవినీతిపరులు ఎందుకు అవినీతికి పాల్పడుతున్నారు అని ఆలోచించడం, ఆ కారణాలను కనిపెట్టడం కూడ చాలా అవసరం. దీనికి రాజకీయ రంగంలో మాత్రమే తీసుకున్నప్పుడు కూడ అనేక కారణాలు ఉన్నాయి. సమాజంలో మొత్తంగా ఎన్నో చారిత్రక సాంస్కృతిక కారణాలు ఉన్నాయి గాని ఆ వివరాలలోకి పోనవసరం లేదు. ప్రభుత్వ పాలనలో ఉన్నవారికి అవినీతికి పాల్పడవలసిన కారణాలేమిటో చర్చించాలి.

రాజకీయ నాయకులను తీసుకుంటే ప్రస్తుతం రాజకీయాలు ఒక వ్యాపారంగా మారి రాజకీయ నాయకులు కాదలచుకున్న వాళ్లు ప్రతిరోజూ పెట్టుబడి పెట్టవలసి వస్తోంది. ఎన్నికలలో నిలబడదలచు కుంటే మరింత పెద్ద ఎత్తున పెట్టుబడి పెట్టవలసి వస్తుంది. ఎంత చిన్న స్థాయి రాజకీయ నాయకుడైనా తన చుట్టూ ఒక బృందాన్ని పోషించడం, ఒకటో రెండో వాహనాలు నిర్వహించడం, వచ్చే పోయే అతిథులకోసం ఒక భవనం నివాస గృహంగా ఉంచుకోవడం అత్యవసరమైపోయింది. అంటే రాజకీయాలకు ప్రజా సేవ అనే అర్థం మారిపోయి వ్యాపారం అర్థం స్థిరపడింది. ఏదైనా ఒక వ్యవహారం వ్యాపారంగా ఉన్నదంటే లాభనష్టాల పునాది మీద ఉన్నదన్నమాట. అంటే పెట్టుబడికి ప్రతిఫలాన్ని ఆశిస్తున్నదన్నమాట. మరి ప్రతిఫలం ఎక్కడినుండి వస్తుంది? రాజకీయాల వల్ల తనకు సమకూరిన అధికారాన్ని దుర్వినియోగం చేసి పాలనాపరమైన పనులలో అక్రమాలు సాగించి అవినీతికి పాల్పడితే తప్ప ప్రతిఫలం రాదు. వార్డ్ మెంబర్‌కైనా ఇదే పరిస్థితి, ముఖ్యమంత్రికైనా, కేంద్రమంత్రి కైనా ఇదే పరిస్థితి.

అంటే ఇవాల్టి రాజకీయ వ్యవస్థలోనే అవినీతిని పెంచిపోషించగల సారవంతమైన వనరులు ఉన్నాయి. ఎన్నికలలో లక్షలు, కోట్లు ఖర్చు పెట్టి ఎవరైనా ఎం.ఎల్.ఏ.గానో ఎం.పి గానో ఎన్నికయ్యేది కేవలం తమపేరు పక్క పొడి అక్షరాలు రాసుకునేందుకు కాదు. ఎన్నికలలో పెట్టిన లక్షలను, కోట్లను వారు పెట్టుబడిగా మాత్రమే పరిగణిస్తున్నారు. రాజకీయాలు అత్యంత లాభసాటి వ్యాపారం గనుక ఒక కోటి ఖర్చు పెట్టి ఎన్నికైతే ఐదు సంవత్సరాల పాలనాకాలం తిరిగే సరికి ఆ పెట్టుబడి పది రెట్లో, ఇరవై రెట్లో కావాలని ఆశిస్తున్నారు. ఇటీవలి కాలంలో ఐక్య సంఘటన ప్రభుత్వాలు మొదలైన తర్వాత పాలనా కాలం ఐదు సంవత్సరాలు ఉంటుందనే నమ్మకం లేదు కనుక పదవి ఎప్పుడైనా ఊడిపోయే అవకాశం ఉంది గనుక ఉన్న ఒకటి రెండు సంవత్సరాలలోనే తమ డబ్బు ఆ ఐదు రెట్లో, పది రెట్లో పిల్లల్ని పెట్టాలని ఆశిస్తున్నారు.

రాజకీయ నాయకుల వ్యవహార సరళి ఇలా ఉండగా ప్రభుత్వ అధికారులు, ముఖ్యంగా జిల్లాల స్థాయిలో సామంత ప్రభువులుగా చలామణి అవుతున్న ఐ.ఏ.ఎస్., ఐ.పి.ఎస్. అధికారులు, రాష్ట్ర సెక్రటేరియట్‌లలోనూ, కేంద్ర సెక్రటేరియట్‌లలోనూ చక్రాలు తిప్పుతూ దేశ ఆర్థిక వనరుల గురించి ప్రజా ప్రతినిధుల కన్న ఎక్కువ తెలిసిన అధికారగణం తమ అధికారాన్ని దుర్వినియోగం చేసి కోట్ల రూపాయలు వెనుకేసుకుంటోంది.

ఇంత పెద్దస్థాయిలో అక్రమార్జనకు రెండు కారణాలు ఉండే అవకాశం ఉంది. ఒకటి భవిష్యత్తు గురించి స్థిరమైన నమ్మకం లేకపోవడం, రేపు ఏమౌతుందో, తమ మనుగడ ఇప్పుడు ఉన్నట్టుగానూ ఇంతకన్నా మెరుగ్గానూ ఉంటుందో లేదో అపనమ్మకం ఉన్నవారు రేపటి కోసం రక్షణగా ఆస్తులను సంపదను పోగేసుకుంటారు. దేశంలో ఐదు దశాబ్దాలకు పైగా ప్రణాళికా బద్ధ అభివృద్ధి జరిగినా విద్య, వైద్యం, ఆరోగ్యం, ఆశ్రయం, ఆహ్లాదకరమైన వాతావరణం వంటివి మాత్రమేకాక కనీస అవసరాలు కూడా తీరని స్థితిలో కోట్లాది ప్రజానీకం ఉన్నప్పుడు తాము, తమ కుటుంబాలు, తమ ముందరితరాలు ఏ విషయంలోనూ, ఎటువంటి లోటూ లేకుండా బతకాలని కోరుకునే మధ్యతరగతి, స్థిరమైన సంపాదనను, ఆస్తులను కోరుకుంటోంది. ఆ ఆస్తులను కూటబెట్టడం ఎంత వక్రమార్గాలలో జరిగినా ఫరవాలేదని అనుకుంటోంది. ప్రపంచీకరణ తరువాత అంతర్జాతీయ సంపన్నులతో పోటీ పడుతున్న దేశీయ సంపన్నవర్గం ప్రపంచ కుబేరుల జాబితాలోకి ఎక్కాలని ప్రయత్నిస్తుండగా, మధ్యతరగతి పైపైకి ఎగబాకాలని ప్రయత్నిస్తోంది. దేశీయ సంపన్నులేమో రాజకీయ వర్గాల అండతో తమకు అనుకూలమైన రాజకీయ విధానాలను తయారు చేయించుకొని కోట్లకు పడగెత్తుతుంటే మధ్యతరగతి అదే మార్గంలో తమకు అవకాశం ఉన్నచోటల్లా అవినీతికి పాల్పడి అక్రమార్జన సాధిస్తున్నది.

ఒకప్పుడు ఇటువంటి అక్రమార్జన ఖర్చు పెట్టడానికి కూడా సరైన మార్గాలు ఉండేవి కావు. కాని ప్రపంచీకరణ తరువాత ఇబ్బడి ముబ్బడిగా పెరిగిన వినియోగదారీ సంస్కృతి మన మార్కెట్లోకి విపరీతంగా దిగుమతి అవుతున్న బహుళజాతి సరుకులు, అవసరం ఉన్నా లేకపోయినా వాటిని కొనేలా మత్తులో ముంచే వ్యాపార ప్రకటనలు – ఈ రకమైన ఒక విష వలయం ప్రతిమనిషినీ అవినీతి చక్రంలోకి లాగుతోంది. నిరాడంబరంగా ఉండడమే, పొదుపుగా ఉండడమే, అవసరాలను తీర్చుకొంటూ, కోరికలకు కళ్లాలు వేయడమే పాటించవలసిన విలువలుగా ఉండిన గత కాలం నుంచి ఇప్పుడు మధ్య తరగతి విలువలన్నీ మారిపోయాయి. ఎంత ఆడంబరంగా ఉంటే అంత గొప్ప. తమను, సంపదను ఎంత ప్రదర్శించుకుంటే అంత పైస్థాయిన ఉన్నట్టు. అవసరాలు తీరినా తీరకపోయినా, ఆకాశ్నాంటే కోరికలను ఎన్ని తప్పుల పనులకైనా పాల్పడి తీర్చుకోవచ్చు. ఇవే ఇవాళ రాజ్యం చేస్తున్న విలువలు. అందువల్ల అవినీతి సమస్యను కేవలం ఆర్థిక సమస్యగా మాత్రమే చూడడానికి వీల్లేదు. ఈ అవినీతిలో రాజకీయ పాలనావిధానాలు భాగమే, ఆర్థిక విధానాలు భాగమే, మారుతున్న సామాజిక విలువలు భాగమే.

ఒకవైపు రాజకీయ నాయకులు, మరొకవైపు ఉన్నతాధికార వర్గం కలిసికట్టుగా సమాజంలో ప్రవేశపెడుతున్న ఈ అవినీతి ఈ ఐదు దశాబ్దాలుగా కాంట్రాక్టు పద్ధతిలో, ఏ పనైనా సులభంగా త్వరగా జరగాలంటే లంచమే రాజమార్గంగా చూపించడంలోనూ విజయం సాధించింది.

దేశంలో ప్రభుత్వ నిధులన్నీ ఏ ప్రజా సంక్షేమ కార్యక్రమం మీద అమలు కావాలన్నా, ఆ నిధులను వెచ్చించడానికీ, లక్ష్యాలు రాబట్టడానికీ ప్రభుత్వ శాఖలు ఉన్నాయి. కాని ప్రభుత్వం, ప్రభుత్వ శాఖలు చేయవలసిన పనులు కూడా కాంట్రాక్టర్లకు అప్పగించి ఆ పనులు కాంట్రాక్టర్లు చేసి పెట్టినందుకు అధికారంగానే ప్రభుత్వం అంచనా వేసిన దాని కన్నా 15 శాతం, 20 శాతం, 25 శాతం ఎక్కువ కాంట్రాక్టర్లకు ముట్టజెప్పడం 1950ల నుంచి సాగుతోంది. అంటే వెయ్యి కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని ప్రభుత్వం అంచనా వేసిన పథకానికి ప్రభుత్వం కాంట్రాక్టర్లకు పన్నెండు వందల కోట్లు అప్పజెప్పుతోంది. నిజానికి ఆ పనికి వెయ్యి కోట్లు ఖర్చు అవుతోందని అంచనా వెయ్యడం కూడా తప్పుడు లెక్కే. దాన్ని ఏ ఆరు వందల కోట్లలోనో ముగించి కాంట్రాక్టర్లు నేరుగా ఆరు వందల కోట్లు జేబులో వేసుకుంటారు.

ఆంధ్రప్రదేశ్ విషయానికే వస్తే నాగార్జునసాగర్ ప్రారంభమైననాడు కొన్ని వేల రూపాయలు కూడా చేతిలో లేని కాంట్రాక్టర్లు ఇవాళ ఆ నాగార్జునసాగర్ నిధుల నుంచి వందల కోట్లు సంపాదించి రాష్ట్రాన్ని పాలించే దశకు ఎదిగారు. ఈ కాంట్రాక్టర్ వ్యవస్థే తన పని కోసం ఒక పైరవీకారు వ్యవస్థను సృష్టించింది. ఈ పైరవీకార్లు ప్రభుత్వ అధికార్లకు-కాంట్రాక్టర్లకు మధ్య మధ్యవర్తులుగా పని చేసి తమ పనులు త్వరగా సులభంగా చేసి పెట్టినందుకు అధికారులకు ముడుపులు చెల్లిస్తారు. కాలక్రమంలో ఈ ముడుపులు ఒక శాతం, రెండు శాతం నుంచి పదిహేను శాతం దాకా వాటాలుగా నిర్ణయం అయిపోయాయి. ఇటీవలనే నీటి పారుదల శాఖలో 750 కోట్ల రూపాయల పనులకు బాధ్యత వహించే ఒక చీఫ్ ఇంజనీర్ ఆ నిధులలో నుంచి 75 కోట్లు తనకు వస్తాయని, కనుక 5 కోట్లు లంచం ఇచ్చైనా ఆ పదవి తాను తెచ్చుకుంటానని అన్నాడని, నీటి పారుదల శాఖలో బహిరంగంగా వినవస్తోంది. ఈ రకంగా చీఫ్ ఇంజనీర్ సంవత్సరానికి 75 కోట్లు తిన్నప్పుడు మా వాటాలు మేమెందుకు తినకూడదు అని ఆ శాఖలోని ఇంజనీర్ల దగ్గర నుంచి అటెండర్ల దాకా ప్రతి ఒక్కరు ప్రశ్నించే ఒక వాతావరణం ఏర్పడింది.

చాలా మంది అవినీతి గురించి మాట్లాడేవాళ్లు ఈ అవినీతి పైనుంచి కిందికి ఇలా ప్రవహిస్తున్నదనే విషయం, పైననే అత్యధికంగా ఉందన్న విషయం మరిచిపోయి ఫైలు కదల్చడానికి పది రూపాయలో యాభై రూపాయలో అడుగుతున్న అటెండర్లదీ, గుమాస్తాలదీ పెద్ద అవినీతి అయినట్టు మాట్లాడుతారు. పెద్ద ఎత్తున జరుగుతున్న అవినీతిని ఆకర్షణగా చూసే మధ్యతరగతి కూడా చిన్న అవినీతి మీద మాత్రం కత్తులుదూస్తుంది. అందువలనే లోక్‌సత్తా వంటి సంస్థలు చిన్న అధికారుల అవినీతి మీద కండక్టర్లు ఐదు పైసలు మిగుల్చుకోవడం మీద, పెట్రోల్ బంక్‌లో బాయిస్ ఒక పాయింట్ తక్కువ పోయడం మీద ఆందోళన చేసినప్పుడు మధ్యతరగతి మద్దతు దొరికింది. సరిగ్గా అదే సమయంలో ఈ రాష్ట్రంలో బహుళజాతి సంస్థల ప్రవేశం, వారికి వందల ఎకరాలు భూమి కట్టబెట్టడం మొదలై అప్పటి ప్రభుత్వం వందల కోట్ల రూపాయల ముడుపులు సేకరించింది. దాని గురించి అటు లోక్‌సత్తా గానీ, ఇటు మధ్యతరగతి కానీ ఏమీ మాట్లాడలేదు.

రాజకీయ అవినీతిని తగ్గించడానికి ఒక మార్గంగా ఎన్నికల ఖర్చును ప్రభుత్వమే భరిస్తే రాజకీయ పార్టీలు అవినీతికి పాల్పడవలసిన అవసరం ఉండదని ఒక వాదన వస్తోంది. అంటే ఎన్నికలలో జరుగుతున్న అక్రమాలను యథాతథంగా ఉంచి వాటిని ఒక చోటు నుంచి మరో చోటుకి మార్చాలని ఈ వాదన ఉద్దేశ్యం. ఒక్క ఎన్నికలు మాత్రమేకాదు, మొత్తంగా పాలనా వ్యవస్థలోనే, రాజకీయ పక్షాల నిర్మాణంలోనే రాజకీయ నాయకులకూ, అధికారవర్గానికీ ఉన్న అవకాశాలలోనే, సమాజంలో పెరిగిపోతున్న వస్తు వ్యామోహంలోనే అవినీతికి మూలాలు ఉన్నాయని గుర్తిస్తే కేవలం ఎన్నికల ఖర్చును మాత్రమే అవినీతికి మూలంగా చూడనక్కర్లేదనీ, అక్కడ అతుకులు, మాట్లు వేసినంత మాత్రాన అవినీతి ప్రవాహం ఆగదని అర్థం అవుతుంది.

రాజకీయ నాయకులకు, అధికారవర్గానికి నిధుల ఖర్చు మీద ఉండే అపరిమిత అధికారాలను తగ్గించాలి. ఈ అధికారాలను ప్రజల బహిరంగ పర్యవేక్షణ కిందికి తేవాలి. రాజస్థాన్‌లో అరుణా రాయ్ చేపట్టి అంతిమంగా సమాచార హక్కు చట్టంగా పరిణమించిన ఆందోళనలో వ్యక్తం అయినట్టు ప్రభుత్వం ఖర్చు పెట్టే ప్రతి పైసా ఎక్కడ, ఎందుకొరకు, ఎవరిద్వారా ఖర్చు అవుతున్నదో, ఎవరికి చేరుతున్నదో ప్రజలందరికీ తెలిసేలా ఉండాలి. స్వయంగా రాజీవ్ గాంధీయే అంగీకరించినట్టు ప్రజాసంక్షేమ పథకాల మీద వంద పైసల కేటాయింపు జరిగితే పదిహేను పైసలు మాత్రమే లబ్ధిదారులకు చేరుతున్నాయి. రాజీవ్‌గాంధీ ఆ మాట అని ఇరవై ఏళ్లు గడిచిన తరువాత కూడా ఆ 85 పైసలు ఎవరి ఆస్తులుగా, ఎవరి భోగంగా, ఎవరి ఖాతాలోకి చేరాయో గుర్తింపు జరగలేదు. ప్రతి రోజూ, ప్రతిక్షణమూ అటువంటి గుర్తింపు జరగాలి, అట్లా అవినీతికి గురైన ఆస్తులనూ సంపదలనూ జప్తు చేయడం జరగాలి.

అదే విధంగా రాజకీయ నాయకులకు, అధికారవర్గానికి ప్రజల పనులు చేయడంలో తమ సొంత నిర్ణయాన్ని, వేగాన్ని ఉపయోగించే అవకాశం ఉండకూడదు. ఏ పని అయినా ఒక పద్ధతి ప్రకారం, వరుస ప్రకారం, అవసరానికి తగినట్టుగా మాత్రమే జరుగుతుందని, ముడుపులు చెల్లించినందువల్ల అటు పని ఇటూ, ఇటు పని అటూ మార్చడానికీ, పక్షపాతం కనబర్చడానికీ, కొందరిమీద వివక్ష కనబర్చడానికీ వీలులేదని ప్రకటించాలి. అందుకు మినహాయింపులు జరిగినట్టు కనిపిస్తే ఆ రాయకీయ నాయకులు మీద, ఉద్యోగులమీద తక్షణ చర్యలు తీసుకోవాలి. ఈ పనులు ప్రభుత్వమే చేయాలని అంటే మళ్లీ మేకల క్షేమాన్ని తోడేళ్ల చేతుల్లో పెడుతున్నట్టే. రాజకీయ నాయకులూ, ప్రభుత్వ అధికార్లూ ప్రజలను గొర్రెలు చేసి తాము తోడేళ్లుగా, పులులుగా ప్రవర్తిస్తున్న ఒక విషాద సందర్భంలో మేకల సంక్షేమాన్ని మేకలే పరిరక్షించుకోవల్సి ఉంది. ఇవాళ్టికివ్వాళ తోడేళ్లను, పులులను అంతరింప చేయడం సాధ్యం కాకపోవచ్చు. కాని తమ బాగుకొరకు మేకలు తోడేళ్లమీద, పులులమీద నిరంతర నియంత్రణను కొనసాగించవలసి ఉంటుంది. నిరంతర జాగరూకతే ప్రజాస్వామ్యానికి చెల్లించ వలసిన మూల్యం అని ప్రజా స్వామ్యపు మూలసూత్రం చెప్తుంది. ఆ నిరంతర జాగరూకత వహించి ప్రజాస్వామ్యాన్ని కాపాడుకున్నప్పుడు మాత్రమే అవినీతిరహితమైన వ్యవస్థను సాధించుకోవడం కొనసాగించుకోవడం, సాధ్యమౌతాయి. ◆

**అభివృద్ధి పేరుతో, పథకాల పేరుతో కోట్లు ఖర్చు చేసే ప్రభుత్వం, అంతరించిపోతున్న జానపద కళల పట్ల శ్రద్ధ వహించి, ఆ కళారూపాలను కాపాడుకోవాల్సి ఉందంటున్నారు వి. ప్రతిమ**

# కనుమరుగవుతున్న కళారూపాలు

జానపద కళలు మన చరిత్రంత ప్రాచీనమైనవి. ఈ కళలన్నీ కూడ జనుల స్వయంసంపద. ఆదిమమానవునికి సంతోషం కలిగిన పుడూ, దుఃఖం కలిగినపుడూ, కోపమొచ్చినపుడూ, ప్రేమ కలిగినపుడూ ఇలా రకరకాల హావభావాలని గమనిస్తూ, అలవాటు చేసుకుని వాటిని అందరి ముందూ ప్రదర్శించడం మొదలుపెట్టాడు. క్రమంగా వాటికి ఒక రూపం ఇచ్చాడు. ఇలా మానవుల అనుభూతులకు మానసిక చైతన్యానికి, విజ్ఞాన వినోదాలకూ, ఆనందో త్సాహాలకూ ప్రతీకలుగా అన్ని కళలకూ పునాదులుగా జానపదాలు అగ్రభాగాన నిలిచాయి.

పునాదులు అని ఎందుకనుకుంటున్నామంటే, ఇవ్వాళ మన కున్నటువంటి అన్ని రకాల వినోదాలకూ మూలం జానపదకళలే. నాటకం లేని కాలంలో మనుషులు నిద్రరాని రాత్రులలో, వాన కురిసే పగళ్లలో కథలు చెప్పుకుంటూ, స్వంతంగా పాటలు పాడుకుంటూ, ఆటలు ఆడుకుంటూ, పాదాలు కదిపి నృత్యాలు చేస్తూ రకరకాలుగా వాళ్ల సంతోషాలనూ, తృప్తినీ, విజయాన్నీ మొత్తం అనుభూతులన్నింటినీ వెల్లడి చేస్తూ జానపద కళలకు పునాదులు వేశారు.

నాటకాలు రావడానికి ముందు ఇలా ప్రజానీకానికి ఒక్క జానపద కళారూపాలు మాత్రమే వినోదంగా నిలిచాయి. జానపద గేయాలనీ, సంగీతమనీ, జానపద నృత్యమనీ, జానపద సాహిత్యమనీ, తోలుబొమ్మ లాటలు, బుర్రకథలు, తప్పెటగుళ్లు, యక్షగానాలూ, జముకుల కథలు, పిచ్చికుంటల కథలు, పగటి వేషాలు, బుడబుక్కలవాళ్లు, వీధి భాగవతులు, దొమ్మరాటలు, కృష్ణలీలలు, పండరి భజనలు, జంగమ కథలు, గరగ నృత్యాలు... ఇలా చెప్పుకుంటూ పోతే వందలాది జానపద కళారూపాలు చరిత్రపుటల్లో ప్రజలకి వినోదాన్నీ, విజ్ఞానాన్నీ పంచి ఇచ్చాయి.

అయితే కేవలం వినోదం కోసమే కాకుండా యాచనకి మూలంగా ఈ కళారూపాలు ఏర్పడ్డాయన్న వాదన కూడ ఉంది. మనిషి ఆకలి కోసం ఎదుట మనిషిని చేయిచాచి అడగడానికి మొహమాటపడి, తమకి తెలిసిన ఏదో ఒక ప్రదర్శన, ఏదో ఒక కళని ప్రదర్శించి యాచన చేయడం జరుగుతోంది. చాలమంది రోడ్డు మీద అద్భుతమైన చిత్రాలు చిత్రిస్తుంటారు. ఆ చిత్రకళకి మెచ్చి, అబ్బురపడి కళారసదృష్టి ఉన్న వాళ్లు డబ్బులు వేస్తుంటారు. ఇలా ఏదో ఒక సృజనాత్మక కళని ప్రదర్శించి దాతలు ఇచ్చింది పుచ్చుకోవడం, దీని మూలంగా కూడ జానపద కళా రూపాలు ఏర్పడిఉండొచ్చు.

స్త్రీలు పనులు చేసేటప్పుడు అంటే విసిరేప్పుడు (విసుర్రాయి పాటలు) రోకలిపోట్లు వేసేపుడు, నార్లునాటేటప్పుడు, కలుపుతీసేటప్పుడు, ఇలా రకరకాల పనివేళల్లో శ్రమ తెలీకుండా ఉండడం కోసం పాటలు పాడుతూ ఉంటారు. పనీ, పాటా అని అందుకే అంటారు. పెండ్లి పాటలు, నలుగుపాటలు వంటి సందర్భానుసారమైన వేడుకల్లో పాడేపాటలు కూడ ఉన్నాయి. నాలుగైదు గంటల పాటు సాగే కథా గేయాలు కూడ ఆడవాళ్ల పాటల్లో ఉన్నాయి. తెలుగు, తమిళ, కన్నడ భాషల వారంతా కూడ ఈ స్త్రీల పాటలు ఎక్కువ భాగం తెలుగులోనే పాడతారు. స్త్రీల పాటలు కూడ జానపద కళారూపాల్లోని భాగమే.

అయితే జానపద కళారూపాలు శాస్త్రీయమైనవి కావు అని కొందరి అభిప్రాయం. కానీ మామూలు సంగీతానికీ, నృత్యానికీ ఎటువంటి శాస్త్రీయత ఉందో, జానపదానికీ అటువంటి శాస్త్రీయతే ఉంది. జానపద కళారూపాలలో సంగీతముంది, తాళముంది, నృత్యముంది, అభినయ ముంది, ఆహార్యముంది, వాయిద్యముంది, లయబద్ధమైన కలయికా, క్రమశిక్షణా ఉన్నాయి. త్యాగయ్యగారి కృతులకు, అన్నమయ్య గేయాలకూ ఎవరు స్వరాలు ఏర్పాటు చేశారు? ఎవరు తాళగతుల్ని ఏర్పరిచారు? అసలు ఆదిమ జానపద కళలే లేనట్టయితే ఈ శాస్త్రీయత ఎక్కడిది? ఎప్పుడైనా, ఎవరైనా చరిత్రపథంలోని సంస్కృతీ మూలాల్ని మరిచిపోవడం వల్ల అభివృద్ధి పథంలోకి నడకే సాధ్యం కానేరదు.

ఆ క్రమంలో మనిషి హావభావాలను, సంతోషాన్నీ, దుఃఖాన్నీ, తృప్తినీ వెల్లడించడం అయ్యాక జంతువుల లక్షణాల్ని ప్రదర్శించాల నుకున్నాడు. నృత్యం చేశాడు. నాగనృత్యం, మయూరి నృత్యం, పులిగాంగ్రిండిపులు, వివిధ రకాల జంతువుల అరుపులూ ఇలా అనేక అనుకరణలు. ఈ అనుకరణే క్రమంగా నాటక రూపందాల్చి వీధి నుండి గుడికీ, గుడి నుండి రాజమందిరానికీ, ఆపైన అన్ని హంగులనూ సంతరించుకుని ఆరుబయట రంగస్థలం వద్దకు చేరింది. ఇప్పుడెన్నో నాటక రంగస్థలాలు, ప్రదర్శనశాలలు వెలిశాయి, అది వేరే సంగతి.

ఆనాడు రాజులు ఆదరించిన జానపద కళల్లో ఎక్కువభాగం నృత్యానికే ప్రాధాన్యత ఇవ్వబడింది. దేవదాసీ నృత్యాల ఆదరణ ఎక్కువైంది. అక్కడినుండే జానపద కళల్లో దేవదాసీలు ముఖ్యపాత్ర వహించారని చెప్పవచ్చు. రాజుల వినోదానికీ, మనోవికాసానికీ దివ్యతారలుగా అలంకరించుకుని తమ కళల్ని ప్రదర్శించే వారు. వారిలో వారికి పోటీలు పెట్టి గంటల తరబడి వాళ్ల నాట్యం చేస్తోంటే రాజులు వినోదం చెందేవారు.

ఇదే విధంగా భోగం వాళ్లు, అద్వితీయ తారలని పిలవబడే మేళం భాగోతం కూడ జానపద కళారూపంగా జనాదరణ, ప్రాచుర్యం పొందింది. భోగం పడతులు తొలిసారిగా దేవతా సన్నిధిలో నాట్యం చేసి ఆ తర్వాత నాట్యాన్ని వృత్తిగా స్వీకరించేవాళ్లు.

ఇకపోతే ఎరుకలసాని. ఎరుకలసాని సోది చెప్పి తన కళను ప్రదర్శించేది. ఈ ఎరుకలసాని సమాజంలో ఎంత పలుకుబడిని, ఆదరణను సంపాదించిందో అంతటి స్థానాన్ని ఆనాటి సాహిత్యంలోనూ, కళారూపాల్లోనూ పొంది ప్రత్యేకంగా ఒక పాత్రగా వర్ధిల్లింది. ఎరుకల వేషధారణ, వారి జీవన విధానం, భాష, జరిగింది జరిగినట్లుగా సోది చెప్పడం మొత్తం వారి తీరుతెన్నుల గురించి ఆముక్తమాల్యదలో సవివరంగా చెప్పబడిందని మనందరికీ తెలుసు.

ఏకవీరాదేవి శైవదేవత. ఏకవీర పరశురాముని తల్లియైన రేణుకా దేవి అంశం అని అంటారు. ఈమె 'మువచారం' అనే గ్రామంలో వెలసి ఉండడం వల్ల 'మువచారమ్మ' అని పిలిచేవాళ్లు. ఈమెనే రాయలసీమ లోనూ, తెలంగాణలోనూ ఎల్లమ్మ దేవత అని అంటారు. ఈమె నగ్న దేవత, తండ్రి ఆజ్ఞను అనుసరించి పరుశురాముడు తన తల్లితలను ఖండించగా ఆ తలకాయ మాదిగవాడలో పడిందట. శిరస్సు లేకుండా ఉన్న ఆ విగ్రహం ముందు స్త్రీలు నగ్నంగా పూజిస్తూ నాట్యం చేసేవారట.

అలాగే మాతంగ మహాముని వలన ఆవిర్భవించిన 'ఛిక్కిణీకో మోపు' ఒక ప్రముఖమైన నాట్యవిన్యాసం. పదిహేడో శతాబ్దంలో ఈ ఛిక్కిణీ కళారూపాలు ఏర్పడినట్లుగా తెలుస్తోంది.

ఇక రెండువేల సంవత్సరాల నాటి 'చిందుభాగవతం' గురించి మనందరికీ తెలిసిందే. కానీ ఈ కళాకారులు ఆశించేది పట్టెడన్నమూ, పాతవస్త్రాలు మాత్రమే. వృత్తులననుసరించి జాతులు ఏర్పడినట్లే ఆ జాతులపై ఆధారపడి వారికి వినోదాన్ని చేకూరుస్తూ జీవించే మరికొన్ని తెగలు ఏర్పడ్డాయి. ఇవాల్టి ఆధునిక వినోద కళారూపాలనెన్నింటినో అధిగమిస్తూ ఎల్లమ్మ చిందుభాగోతం ఎంత ఖ్యాతిని గడించిందో మనందరికీ విదితమే. అలాగే సిరిసిరిమువ్వల చిడతుల రామాయణం, ఇది ఎక్కువగా తెలంగాణ ప్రాంతంలో ప్రాచుర్యంలో ఉంది. అత్యంత ప్రాచీనమైనది. ఇదే విధంగా నెల్లూరు జిల్లాలోని పల్లెల్లో శ్రామిక యువకులు ముప్పై, నలభై మంది కలిసి పనుల్లేని వేసవి కాలంలో ఒక గురువుని నియమించుకుని చిడతల రామాయణాన్ని నేర్చుకుని రకరకాలుగా కథారూపాలని ప్రదర్శిస్తారు.

పోతే కూచిపూడి, తంజావూరు నాట్యం మన తెలుగువాళ్ల కళా సృష్టే. మేలటూరు భాగవతులు, మేలటూరు మేల్వంతి, శూలమంగళం కళాకారులు, పూత్తుకూడి వీధినాటకాలు, ప్రేక్షకులను ఎప్పుడు పడితే అప్పుడు ఆనందపరిచే కొంటెకోణంగీ ఇవ్వన్నీ కూడ తెలుగువారు సృష్టించినవే. ఒకనాటి కాలంలో దేదీప్యమానంగా వెలిగిన యక్షగానం జానపద కళారూపాల్లో ముఖ్యమైనది. ఈనాడు మనం చూస్తోన్న వీధి భాగవతులు మాతృకలు ఈ యక్షగానానివే. యక్షగానాలు అత్యంత ప్రాచీనమైనవి. ఇప్పటికీ లేపాక్షి రామాయణం యక్షగానం తమిళనాడులోని తెలుగు ప్రాంతాల్లో (కృష్ణగిరి జిల్లా) శ్రీరామ నవమి సందర్భంగా ఏడు శుక్రవారాల పాటు ఆడతారు. వంశపారంపర్యంగా పాత్రలను కట్టి ఆడతారు. అంటే శ్రీరామ పాత్రధారి తన కొడుకుల్లో ఒకరికి శ్రీరాముడి పాత్రని, రామగానాన్ని నేర్పుతాడు. అలాగే మిగిలిన పాత్రధారులు కూడ తమ కుటుంబంలో ఒకరికి ఆయా పాత్రల గానాన్ని నేర్పుతారు. ఇది బాల్యం నుండే అలవాటు చేస్తారు.

వాల్మీకి నాయకులు, వడ్డెరలు, కంసాలులు వంటి నాలుగైదు తెలుగు కులాల వాళ్లు కలిసి ఆడే యక్షగానం ఏడవ శుక్రవారం 'ఎదురు చప్పరం' పేరుతో ఎదురెదురుగా రెండు వేదికలని వేసి రామరావణ యుద్ధాన్ని కళ్లకు కట్టినట్లు చూపడం ఈ కళారూపం ప్రత్యేకత.

అలాగే దానవేంద్రుని యక్షగానం కూడా ఎన్నో ఏళ్లనుండి ప్రదర్శించబడుతోంది. దీన్ని 'ప్రహ్లాదుని విజయం' అని కూడా అంటారు. వామన చరిత్ర యక్షగానం కూడ అన్ని కులాలవాళ్లు కలిసి ఆడతారు. నూట యాభై ఏళ్లుగా యక్షగానాలు ఆడుతోన్న ఈ వంశీకుల్ని 'ఈ యక్షగానాన్ని ఇంకా ఇంకా ప్రదర్శించే అవకాశముందా' అని ప్రశ్నించినపుడు 'నూట యాభై ఏళ్లుగా ఆడుతున్నాం – ఇక మీద కాపాడుకోలేమా' అని గొప్ప ఆత్మవిశ్వాసంతో జవాబిస్తారు.

మరీ 'దానవేంద్రుని చరిత్ర' లోని హిరణ్యకశిపుడిని చూసినపుడు సాక్షాత్తూ 'ప్రహ్లాద చరిత్ర'లోని హిరణ్యకశిపుడు నడిచొచ్చాడా అన్నట్లుంటుంది. ఆ వేషంకానీ, హావభావాలు కానీ, మాటతీరు కానీ ప్రేక్షకులని అబ్బురపరుస్తుంది. ఇక చెక్కబొమ్మలాట, తోలుబొమ్మలాట, బుడబుక్కలు, పగటివేషాలు తప్పెటగుళ్లు, హరికథలు, బుర్రకథలు వంటివన్నీ ఆంధ్రదేశంలో ఆబాలగోపాలాన్నీ ఆనందింప చేసినవే. ముఖ్యంగా తోలుబొమ్మలాటల గురించి అనేక శాసనాల్లో ఉదహరించబడి ఉంది. ఈ కళాకారుల మాతృభాష మరాఠీ అయినప్పటికీ అచ్చ తెలుగులో వీరు ప్రదర్శనలివ్వడం విశేషం. ఈ బొమ్మలాడేవారు ఎక్కువమంది ఉండడం వల్ల బళ్లారి జిల్లాలోని ఒక గ్రామానికి 'బొమ్మలాటపల్లి' అన్న పేరు వచ్చింది.

ఈ తోలు బొమ్మలాటల మీద, వారి జీవన విధానాల మీద, అణగారిపోయిన ఈ కళ మీద ఇటీవల సన్నపురెడ్డి వెంకట్రామిరెడ్డి రాసిన 'తోలుబొమ్మలాట' అన్న నవల ఆర్ద్రంగా పాఠకుల మనసుల్ని హత్తుకుంది. అంతర్జాతీయ బహుమతిని పొందింది. ఈ బొమ్మలాటల వాళ్లు ఊరు తర్వాత ఊరు, చాంద్రాయణం చేసుకుంటూ, ప్రదర్శనలిచ్చుకుంటూ దేశదిమ్మర్లుగా తిరుగుతూంటారు. చావులూ, పుట్టుకలూ, వివాహాలూ, వేడుకలూ అన్నీ వారికి దారిలోనే జరిగి పోతూంటాయి.

అలాగే సంచారకులం వాళ్లైన దాసరి కులం వాళ్లు గ్రామ గ్రామాన తిరుగుతూ బుర్రకథలు రకరకాలుగా చెప్తుంటారు. చేతిలో గుమ్మడి కాయ బుర్రతో చేసిన తంత్రీవాద్యం ఉంటుంది. వీరి మాతృభాష తెలుగు.

'అయ్యా మాకేం తక్కువైందని మీ దగ్గరికొచ్చాననుకుంటున్నారు. ఏడంతస్తుల మేడా, ఏడుదున్నలపాడ, ఆవువిస్తరి' అంటూ గొప్పలు పలికే పిట్టల దొరలు, బొడిగాని కలాపం, యానాది భాగోతం, గమ్మత్తుల గారడీ విద్యలు, గరగనృత్యం, గొల్లసుద్దులు, దొమ్మరాటలు (సర్కస్ చేసేవాళ్లు) బతకమ్మలు, బోనాలు ఇలా ఎన్నెన్నో కళారూపాలు ఆంధ్రదేశంలో ప్రాచుర్యంలో ఉండేవి. ఇప్పుడు వీటిలో పదిశాతం కూడ మిగిలివుండకపోవడం నిజంగా విచారింపదగినది.

సీమవాసుల గొరవయ్యాల నృత్యం, తలమీద ఎలుగుబంటి చర్మంతో తయారు చేసిన కీరిటం, ఒక చేతిలో ఢమరుకం, వేరొకచేతిలో త్రిశూలం, మెడలో తెల్లని గవ్వలహారం, నడుంచుట్టూ జింక చర్మంతో సృజనాత్మకంగా తయారు చేసిన సంచి, పిల్లనగ్రోవి వాయిస్తూ అపురుపంగా కనిపించే ఈ వేషధారణ ఆంధ్రదేశంలో మరెక్కడా కన్పించదు. వీరు కురబలు కొత్త కురబోళ్లు. ఒక్క అనంతపురం జిల్లాలో మాత్రమే వివిధ ప్రాంతాల్లో ఈ గొరవయ్యలు కన్పిస్తారు.

జిత్తులమారి కత్తులగారడీ కూడ జానపద కళారూపమే. బతుకు పోరాటం కోసం కత్తులతో చెలగాటమాడే కత్తుల గారడీ వాళ్లు ఈనాటికీ మనకి కన్పిస్తుంటారు. కత్తులను ఈదరినుండి ఆదరికి పొదురుకుని కంఠాన్ని

సగం వరకూ కోసుకున్నట్లు శరీరమంతా రక్తమయం చేసుకుని, రక్తం రొమ్ములమీద ధారలుగా కార్చుతూ, చూసేవాళ్ల గుండె గొంతులోకొచ్చినట్టయి, వారిలో జాలి కల్గించి యాచన చేస్తూ ఉంటారు. ముఖ్యంగా చిన్న పిల్లల్ని ఎరగా పెట్టి ఈ జిత్తులమారి కత్తుల గారడీ ప్రజల్ని భయభ్రాంతుల్ని చేస్తుంది. దీన్ని ఆపించాలని కూడ చాల ప్రయత్నాలు జరిగాయి. అలాగే కర్రసాములూ, కత్తిసాములూ కూడ అందంగా, సుందరంగా ప్రేక్షకులను ఆనందపరిచే విధంగా రకరకాల విన్యాసాలు చేస్తారు. యువకులు తమకు నచ్చిన యువతుల్ని ఆకర్షించడానికి ఎక్కువగా ఈ ప్రదర్శన చేసేవారు.

ఇకపోతే ప్రముఖంగా చెప్పుకోవలసింది కోలాటం నృత్యాలు. ఆంధ్రుల ప్రజాజీవితంలో అన్ని జానపద కళారూపాలతో పాటు ఈ కోలాట నృత్యం కూడ పెనవేసుకుపోయింది. కోలాట అనే శబ్దం కోల+ఆట అన్న రెండు విశేష శబ్దాల రూపం. కోల అంటే కర్ర. అంటె రెండు చేతులలోనూ కర్రముక్కలను పట్టుకుని పదాలు పాడుతూ గుండ్రంగా తిరుగుతూ, లయానుగుణంగా అడుగులు వేస్తూ, ఒకరి చేతిలోని కర్రముక్కని వేరొకరి చేతి కర్రముక్కతో తాకించే ఆట. సుమారు యాభై రకాల కోపులతో కోలాటాలు ఆడేవాళ్లున్నారు. ఇప్పటికీ ఈ కళారూపం చాల పల్లెల్లో ప్రచారంలో ఉండడం విశేషం. కళాకారులలో తెలుగు, తమిళ, కన్నడ భాషల వారున్నా పాటలన్నీ తెలుగులోనే ఉంటాయి.

ఇప్పటికీ ఈ ఆట అనేక ధనికకుటుంబాల్లో 'దాండియా'గా ఉంది. నెల్లూరు జిల్లా సూళ్లూరుపేటలో చెంగాళమ్మ తిరునాళ్లలో ఈనాటికీ సుళ్ల ఉత్సవం జరుగుతుంది. అనాదిగా అక్కడ సుళ్ల ఉత్సవం జరుగు తుండడం వల్లనే ఆ ఊరికి సూళ్లూరుపేట అన్న పేరు సార్థకమైంది.

వానలు పడనపుడు ఊరి వారందరూ కలిసి చేసే పండగ వానరాయుడి పాటలు. అన్ని భాషల వాళ్లు చేస్తారు ఈ పండగని. వాన రాక కోసం పాటలు పాడుతూ ఊరంతా తిరుగుతారు.

పొగిడింపులు, డికాంబరీ వేషం వంటి ఎన్నో ఆటలు జానపదుల సంపదే. జంగమకథల్లో లింగాయితులు వీరభద్రుని పుట్టుక గురించి చెప్తూ వింతవేషంలో కత్తులు తిప్పుతూ ఆడతారు. వీళ్ల మాతృభాష కన్నడమైన ప్పటికీ కథను మాత్రం వీళ్లు తెలుగులోనే చెప్తారు. నగారి, కొమ్ము వాయిద్యాలను వాడుతూ, కత్తితిప్పుతూ వీళ్లు వీరభద్ర చరిత్రాన్ని చెప్తారు. ముండలభాగోతం అనే ఆటలో, బాల్యంలోనే విధవలైన స్త్రీల పాత్రలను ధరించి పురుషులు ఆడే ఆట ఇది. హాస్యాన్నీ, రసికతను మేళవించి ఆడేవారు. ఇందుకోసం మైళ్లకి మైళ్లు నడిచి వెళ్లేవారట ఆనాడు పురుషులు. ఇది జానపద కళారూపమే అయివుండచ్చును గానీ అణగారిపోవడమే బావుంది. స్త్రీలను కించపరిచే ఆటలైనా పాటలైనా, సాహిత్యమైనా, సామెతలైనా కనుమరుగై పోవడమే సమంజసం.

హిందూ, ముస్లిం తేడా లేకుండా చాల ప్రాంతాల్లో పీర్లపండుగ జరుపుకుంటారు. ముస్లిం వీరుల స్మారకార్థం శోకతప్త హృదయాలతో జరుపుకునే కార్యక్రమం ఇది. హస్తాకృతి కలిగిన రూపాలను తయారుచేసి వాటిని అలంకరించి, ఊరేగించి పూజిస్తారు. వాటినే పీరులంటారు. 'హుసేనా హుసేనా' అంటూ పీరులను కీర్తిస్తూ అలావా చుట్టూ గీతాలను ఆలపిస్తారు. 'ధులా' అనే కళారూపంగా దీనిని పిలుస్తారు. ఈ సందర్భంగా నిప్పులగుండం తొక్కే సాంప్రదాయం కూడ ఇప్పటికీ ఉంది.

అలాగే ముస్లింలలోనే మరో తెగ ఫకీర్లు. వీరు కేవలం ముస్లింలను మాత్రమే యాచిస్తారు. కంజరను చేతిలో మీటుతూ సూఫీపాటలు పాడుతూ ఇంటింటికీ తిరుగుతుంటారు. ఉర్దూతో పాటు తెలుగులో కూడా పాటలు పాడుతారు.

ఇకపోతే 'ఏరువాకా సాగారో రన్నో చిన్నన్నా', రోజులుమారాయి సినిమాలోని పాట ఈతరం వారికేమో గానీ, పోయినతరం వారందరికీ గుర్తుండే ఉంటుంది. ఆ పాట పాడింది వింజమూరి అనసూయాదేవి. 'మొక్కజొన్న తోటలో, ముసిరిన చీకట్లలో' వంటి పాటలు కూడ ఆమె పాడినవే. మూడు గంటలు ఏకంగా జానపద సంగీతంతోనే కచేరీ చేసిన రోజులు కూడ ఉన్నాయంటుదామె. అనసూయదేవి గారి చెల్లి సీత కూడ మంచి పాటగత్తె అని మనందరికీ తెలుసు.

అయితే జానపద గేయాలు అనగానే మనకి చప్పున నండూరి వారి ఎంకిపాటలు గుర్తొస్తాయి. ఎంకి తెలుగువారికి తరాలతరబడి నిలిచిపోయిన కలల కథానాయిక. అదే క్రమంలో 'అమ్మి'ని సృష్టించి శభాష్ అన్పించుకున్న పులికంటి కృష్ణారెడ్డి ఇవ్వాళ మనకున్న ఆధునిక జానపద కవి. రచయితలు, మాండలికాలు తమ రచనల్లోకి తీసుకురాక ముందు నుండే కృష్ణారెడ్డి జనుల జీవితాలతో మమేకమై పాటలు, పదాలు, గేయాలు, కవితలు, కథలూ కూడ రాసినవాడు. అంతే కాకుండా ఆయన ఆటగాడు కూడ మనందరికీ తెలుసు.

గీర్వాణాంధ్ర భాషల్లో సాముగరిడీలు చేసిన కృష్ణదేవరాయల కీర్తిని జానపదంలో ఒదిగించిన సాహితీ సేద్యగాడు పులికంటి

'కత్తిపట్టినపుడు కయ్యాన మొనగాడు
కలము పట్టినపుడు కయితల్లో గెట్టోడు
బండరాళ్లకు పాణమిప్పించినోడు
రాగి తీగెల్లోన రాగమెరిగినవాడు
రాయలమ్మీ తెలుగు కోయిలవాడు' అంటాడు.

నాటకం, సినిమా, రేడియో, టెలివిజన్ వంటి ఆధునిక వినోద సాధనాల మూలంగా జానపద కళలు ఒక్కొక్కటిగా అణగారిపోతున్నాయి, అణగారిపోయాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ దాడి మూలంగా మన ఆర్థిక వ్యవస్థ మాత్రమే కాకుండా మన సంస్కృతి మూలాలు కూడ పెకలించవేయబడుతున్న నేపథ్యంలో ఈ జానపద కళారూపాలను ఆదరించేవారెవరు?

వేలువేలు కుమ్మరించి డిస్కోలకెళ్లడానికి పైతరగతి యువత ఆసక్తి చూపిస్తుంటే, సినిమాలు, షికార్లు, టి.వి.లు నాటకాలు, సంగీత కచేరీలే కాక పై తరగతి జీవితాన్నందుకోవాలని మధ్యతరగతి ఎగబడు తోంది. ఈ క్రమంలో జానపద కళారూపాలను ఆదరించి ఆవిష్కరించేవారెవరు?

ఒకనాటి జీవిత విధానానికీ, విజ్ఞాన వినోద వికాసాలకూ ఆలవాలమైన జానపద కళాసంపదను కాపాడుకోవలసిన బాధ్యత మనందరి మీదా ఉంది.

అభివృద్ధి పేరుతో, వివిధ పథకాల పేరుతో కోట్లు కుమ్మరించే ప్రభుత్వం అంతరించిపోతున్న ఈ జానపద కళల పట్ల శ్రద్ధ వహించి, వారికి సాయపడి ఆ కళారూపాలను కాపాడుకోవాల్సి ఉంది.

మన కుటుంబాల్లో జరుపుకుంటున్న అనేక వేడుకల్లో, పెళ్లిళ్లలో, నలుగుల్లో, పుట్టినరోజుల్లో, చావువిందుల్లో ఒక్కొక్క కళారూపాన్ని మనం ఆదరించి ప్రదర్శింప చేయగలిగితే కొంతవరకూ మన పురాసంస్కృతి కాపాడుకున్న వాళ్లమవుతాం, మేధావులందరి ఆలోచన కూడా ఇదే. ◆

చరిత్ర వ్యాఖ్యానంలో జాతీయవాదులు చేసిన పొరపాట్ల వల్ల వ్యక్తమయిన మతతత్వ దృక్పథాన్ని హిందూత్వ వాదులు ఉపయోగించుకుంటున్నా రంటున్నారు **ఎస్. మహబూబ్ బాషా**

# జాతీయతత్వం ఒళ్లో మతతత్వం కొమర్రాజు రచనల పరిశీలన

**భా**రతదేశంలో గత నూరేళ్లుగా మతతత్వం వ్యాప్తి చెందడానికీ, భారత చరిత్ర / రచనకూ, బోధనకూ చాలా సంబంధం ఉందన్న విషయం విస్తృతంగా అంగీకరించబడిన వాస్తవం. వాస్తవానికి భారతదేశంలో మతతత్వ చారిత్రక దృక్పథమే మతతత్వం యొక్క ప్రధాన భావజాలం అన్నా అతిశయోక్తి కాబోదు. మతతత్వ చారిత్రక దృక్పథాన్ని తీసేస్తే, మతతత్వ భావజాలంలో మిగలేది శూన్యమే.[1]

– *బిపన్ చంద్ర*

మతతత్వ భావజాలాన్ని సృష్టించడంలోనూ, దాన్ని వ్యాప్తి చేయడం లోనూ మతతత్వ చరిత్ర రచనా దృక్పథం బలమైన పాత్రపోషిస్తుందన్న విషయాన్ని పై వాక్యాలు స్పష్టం చేస్తున్నాయి. జాతీయోద్యమం ద్వారా ప్రభావితమై, వలసవాద చరిత్రకారుల, ముఖ్యంగా ప్రయోజనవాదుల, బౌద్ధికదాడిని 'సమర్థవంతంగా' ఎదుర్కొని భారతదేశ జాతీయ అస్తిత్వాన్ని నిరూపించడానికై వచ్చిన జాతీయవాద చరిత్రలు అనివార్యంగా మతతత్వ దృక్పథాన్ని కలిగి ఉండి ఆధునిక భారతదేశంలో మతతత్వం వ్యాప్తికి దోహదం చేసిన వాస్తవాన్ని పలువురు చరిత్రకారులు నిర్ద్వంద్వంగా నిరూపించి ఉన్నారు.[2] ఈ నేపథ్యంలో తెలుగులో 'జాతీయవాద' దృక్పథంతో వచ్చిన చరిత్రలను పరిశీలించి అవి ఏ విధంగా మతతత్వ దృక్పథాన్ని కలిగి ఉన్నాయో తెలుసుకోవాల్సిన అవసరం, మతతత్వ భావజాలం వివిధ మాధ్యమాల ద్వారా విశృంఖలంగా వ్యాపిస్తోన్న ఈ విషమ సమయంలో, ఎంతైనా ఉంది. దీనికై ఇరవయ్యవ శతాబ్ది ప్రథమ దశకంలో వెలుగు చూసిన 'హిందూ మహాయుగము', 'మహమ్మదీయ మహాయుగము' అనే కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారి పుస్తకాలను పరిశీలించడం జరిగింది. 'జాతీయవాద దృక్పథం'తో వచ్చిన ఆయన రచనల్లో మతతత్వ భావజాలం ఏ విధంగా, ఎంత లోతుగా చోటు చేసుకుందో పరిశీలించడం ఈ వ్యాసం ప్రధాన లక్ష్యం. అలాగే ఇటీవల ఆయన పుస్తకాలను పునర్ముద్రించినవారు ఏ రాజకీయ ప్రయోజనాల నాశించి ఆ పని చేశారో తెలిపి, వారి మతతత్వ రాజకీయాలను బట్ట బయలు చేయడం కూడా ఇంకో లక్ష్యం. వ్యాసం ప్రధాన విషయంలోకి వెళ్లేముందు వలసవాదుల కాలంలో మొదలైన భారతదేశ చరిత్ర రచనలోని వివిధ ధోరణులనూ, మతతత్వ భావజాల సృష్టిలో అవి పోషించిన పాత్రనూ స్థూలంగానే అయినా, తెలుసుకోవడం సమగ్ర అవగాహనకు ఇతోధికంగా తోడ్పడుతుంది.

## I

## వలస భారతదేశంలో చరిత్ర రచన : వివిధ ధోరణులు

భారతదేశ చరిత్ర, సంస్కృతులపై పరిశోధనలు పద్దెనిమిదవ శతాబ్దంలో ప్రారంభమయ్యాయి. ఈ విషయంలో ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభం దాకా మూడు ప్రధాన ఆలోచనా ధోరణులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఈ ఆలోచనా ధోరణులు కలవారిని 'ప్రాచ్య సిద్ధాంతవేత్త' లనీ, 'ప్రయోజనవాదు'లనీ, 'జాతీయవాదు'లనీ వర్గీకరించవచ్చు. యూరోప్ సమాజంలో మితిమీరిన పారిశ్రామికీకరణ ఫలితంగా విపరీతంగా పెరిగిపోయిన భౌతికవాద ధోరణిని తట్టుకోలేకపోయిన మాక్స్‌ముల్లర్ వంటి ప్రాచ్యసిద్ధాంతవేత్తలు ఆదర్శ సమాజాల వెతుకులాటలో ఉన్నప్పుడు, వారిలో చాలామందికి ప్రాచ్య ప్రపంచంలోని, ముఖ్యంగా భారతదేశంలోని, ప్రాచీన సంస్కృతిలో అట్టి ఊహాస్వర్గ – సమాజాలు కనిపించాయి. సంస్కృత భాషాధ్యయం చేసిన వీరు ఆర్యభాషా ప్రజల సంస్కృతి పట్ల గొప్ప ఉత్సాహం ప్రదర్శించారు. ఇండో–యూరోపియన్ మాతృభూమి సిద్ధాంతాన్నీ, సంస్కృత–గ్రీకు సంస్కృతుల ఉమ్మడి వారసత్వ సిద్ధాంతాన్నీ వారు రూపొందించారు. 'ఆర్యు'లను పరస్పర సంబంధంకల భాషలు మాట్లాడే ప్రజాసముదాయంగా కాకుండా ఒక ప్రత్యేక జాతిగా పరిగణించారు. ప్రాచీన భారతీయ సంస్కృతి పట్ల తీవ్రంగా ఆకర్షితులయిన వీరు వేదయుగ 'ప్రాభవాన్ని' ఘనంగా కీర్తించారు. పర్యవసానంగా ప్రాచీన భారతీయ సమాజంలోని సంఘర్షణలనూ, ఉద్రిక్తతలనూ విస్మరించి 'ప్రాభవాన్ని' మాత్రమే నొక్కి చెప్పారు. ప్రాచీన భారతచరిత్రను విమర్శనాత్మ కంగా చూడని ప్రాచ్యవాదుల వాదనలలోని హేతువును ప్రశ్నించకుండానే భారత జాతీయవాద చరిత్రకారులు, తమ రాజకీయోద్దేశాల సాధనకై, ప్రాచీన భారత 'ఘనత'ను అవిమర్శనాత్మకంగా ఆమోదించారు. ప్రాచీన భారతదేశాన్ని 'మహోజ్వలమైనది'గా పొగిడారు.[3]

భారత చారిత్రక ఆలోచనాక్రమాన్ని గణనీయంగా ప్రభావితం చేసినవారు 'ప్రయోజనవాదులు'. బ్రిటిష్ వలసపాలనకు చట్టబద్ధతను చేకూర్చి భారతీయుల ఆమోదం సాధించడమే తమ రచనల పరమ ప్రయోజనంగా గల వీరు భారత దేశానికి చరిత్ర అంటూ లేదనీ, భారతీయులు అనాగరికులనీ, బానిస మనస్తత్వం కలవారనీ, అరాచకత్వం లోనూ, నిరంకుశత్వంలోనూ మగ్గిపోయారనీ, అందుకే బ్రిటిష్ పాలన,

బ్రిటిష్ శాసన వ్యవస్థా భారతదేశ వెనుకబాటుతనాన్ని అంతం చేసి 'అభివృద్ధి' పథం వైపు, 'ఆధునికత' వైపు నడుపుతుందనీ, కాబట్టి భారతదేశానికి బ్రిటిష్‌వారి రాక దైవదత్తమనీ, బ్రిటిష్ పాలన భారతదేశంలోని పాలకనియంతలను తొలగించి భారత ప్రజానీకానికి ఆధునిక రాజకీయ స్పృహను కల్గిస్తుందనీ నమ్మబలికారు. ఈ ప్రయోజన వాదుల్లో అత్యంత ప్రముఖుడు జేమ్స్‌మిల్. మొట్టమొదటిసారిగా భారతదేశ చరిత్రకు సంబంధించి మతతత్వ వ్యాఖ్యానంతో రాయబడ్డ చరిత్ర 1818లో వెలుగుచూసిన, జేమ్స్ మిల్ హిస్టరీ ఆఫ్ బ్రిటిష్ ఇండియా పాలకుల మతం ప్రాతిపదికన జేమ్స్‌మిల్ భారతదేశ చరిత్రను 'హిందూ యుగం', 'ముస్లిం యుగం', 'బ్రిటిష్ యుగం' అని విభజించాడు. (తన రాజకీయాల కారణంగా 'బ్రిటిష్‌యుగం' అన్నాడేకాని 'క్రైస్తవయుగం' అనలేదు). ఇంగ్లిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ తన సివిల్ సర్వెంట్లకు శిక్షణ యిచ్చే హేలిబరీ కళాశాలలో ఈ పుస్తకం పాఠ్యగ్రంథంగా ఉండింది. భారతదేశానికి పాలకులుగా వచ్చిన సివిల్ సర్వీస్ అధికారులపై ఇది తీవ్ర ప్రభావాన్ని కల్గించింది. జేమ్స్‌మిల్ చేసిన ఈ నిర్హేతుకమైన యుగవిభజన నేటికీ భారతదేశ చరిత్ర రచనను ప్రభావితం చేస్తోందంటే దాని ప్రభావాన్ని అంచనా వేయవచ్చు. ఇందులో జేమ్స్‌మిల్ 'హిందూ సంస్కృతి'ని తీవ్ర పదజాలంతో తూలనాడాడు. 'హిందూ సంస్కృతి' వెనుకబడిన సంస్కృతి అనీ, ప్రగతికి శత్రువనీ, హేతువ్యతిరేకమయిందనీ విమర్శించిన మిల్ 'ముస్లిం సంస్కృతి'ని కొన్ని చోట్ల ఖండించినా మొత్తాని కి దాని పట్ల ఎక్కువ సానుభూతి కనపరిచాడు. ఈ కారణం వల్ల కూడా ప్రాచ్య సిద్ధాంతవేత్తల్లో కొంతమంది, ఆ తర్వాత అధికశాతం జాతీయవాద చరిత్రకారులూ 'హిందూ సంస్క ృతి'ని సమర్థించనారంభించి, ప్రాచీన భారతాన్ని శృతిమించిన విధంగా ప్రశంసించేదాకా వెళ్లారు.[4]

భారతదేశ సంస్కృతీ నాగరికతలను కించపరుస్తూ ప్రయోజన వాదులు చేసిన బౌద్ధికదాడిని సమర్థవంతంగా ఎదుర్కోవడానికై వాటికి సమాధానంగా జాతీయవాద చరిత్రలు వచ్చాయి. ఏయే విషయాల్లోనైతే భారతదేశం వెనుకబడిందని ప్రయోజనవాదులు విమర్శించారో ఆయా రంగాలన్నింటిలోనూ భారతదేశం 'అభివృద్ధి' సాధించి ఉండిందనీ, అంతే కాక ప్రపంచంలోని మిగతాదేశాలకన్నా ముందంజలోనే ఉండిందనీ, ఇంకొంచెం ముందుకెళ్లి యావత్ప్రపంచానికే నాగరికతను నేర్పింది భారతదేశమేననీ వాదిస్తూ జాతీయ అస్తిత్వ ప్రకటనకూ, జాతిలో ఆత్మవిశ్వాసాన్ని నింపడానికీ ప్రయత్నించారు. ఈ సందర్భంలో అంతకు ముందు ప్రాచ్య సిద్ధాంతవేత్తలు ప్రాచీన భారతదేశ సంస్కృతీ, నాగరికతల గూర్చి చేసిన ధనాత్మక వాదనలు జాతీయవాద చరిత్రకారులకు బౌద్ధిక ఆయుధాలుగా ఉపయోగపడ్డాయి. కానీ ఈ ప్రయత్నంలో వీరు భారత ప్రాచీన చరిత్రను మాత్రమే సొంతం చేసుకోగలిగారు.[5] పర్యవసానంగా మధ్యయుగ సంస్కృతంతా 'పరాయిది'గా, అంతకు మించి 'శత్రు సంస్కృతి'గా ప్రకటించబడింది.

తమ 'జాతీయవాద' రాజకీయాలకు మేధోబలాన్ని చేకూరుస్తుండటం తో జాతీయవాద చరిత్రకారులు ప్రాచ్యవాదులు చేసిన సిద్ధాంతాలను విమర్శనాత్మకంగా పరిశీలించకుండా వాటినలాగే ఆమోదించి ప్రాచీన భారత ఘనతను వేనోళ్ల కొనియాడారు; 'స్వర్ణయుగాలను' సృష్టించి సాంత్వన చెందారు. ఘనకీర్తి కల్గిన గత దర్శనం వర్తమాన కాలంలోని అవమానాలకూ, లేమికీ నష్టపరిహారంగా ఉపయోగించుకున్నారు. గత కాలపు 'ఘనకీర్తి' వర్తమానంలో ఊరట కల్గించింది. అంతటితో ఆగకుండా (వారిలో ఉన్న మతతత్వ దృక్పథం కారణంగా) 'మహోజ్వలమైన ప్రాచీన భారతీయ సంస్క ృతి' మధ్యయుగంలో ముస్లిం పాలన, విదేశీ పాలన కారణంగా పతనమైందన్నారు. భారత సమాజంలోని సర్వలోపాలనూ "ముస్లిం పాలన" కు అంటగట్టారు.

భారతదేశ చరిత్రను భారతీయులే రాసుకోవాలన్న స్పృహ బంకిం చంద్ర ఛటర్జీతో ప్రారంభమైందని చెప్పుకోవచ్చు. ఈ విషయాన్ని నొక్కి చెబుతూ "హిందూ చరిత్రంటూ లేదు. మన ఉదాత్త లక్షణాలను మనం పొగడకుంటే మరెవరు పొగుడుతారు?.. ఒక జాతి ఘనతను మరొక జాతి ప్రశంసించడం ఎప్పుడైనా జరిగిందా?.. హిందువులకు ఆ ఘనమైనలక్షణాలు ఎందుకులేవంటే, వాటికి సంబంధించిన లిఖిత ఆధారాలు లేవు గనుక" అన్నారు. అలాగే "తన గత వైభవాన్ని గురించి చారిత్రక స్మృతులు కలిగిన జాతి ఆ వైభవాన్ని కొనసాగించడానికి ప్రయత్నిస్తుంది. అది విస్మృతమైతే, దాన్ని పునరుద్ధరించడానికి ప్రయత్నిస్తుంది' అంటూ జాతీయ చైతన్యాన్నీ, జాతి ఉత్క ృష్టతనూ ఏర్పరచడంలో చారిత్రక చైతన్యం పోషించే విలువైన పాత్రను వివరించారు. 'భారతీయులకు చరిత్రలేదు, చారిత్రక స్పృహ అంతకన్నా లేదు' అనే సామ్రాజ్యవాద భావజాలం విపరీతంగా వ్యాపించి ఉండిన చారిత్రక సందర్భంలో వాటిని ప్రతిఘటిస్తూ వచ్చిన భావాలకు బంకించంద్ర మాటలు ఉదాహరణలు. ఈ భావజాలమే తర్వాత కొనసాగుతూ పోయింది.

జాతీయవాద దృక్పథంతో వచ్చిన కొన్ని చరిత్రలను ఇప్పుడు రేఖామాత్రంగా స్పృశిద్దాం. ఆర్.సి. మజుందార్ అభిప్రాయంలో నిజమైన అర్థంలో మొట్టమొదటి జాతీయవాద చరిత్ర రమేష్ చంద్రదత్ మూడు సంపుటాల్లో ప్రచురించిన 'సివిలైజేషన్ ఇన్ ఏన్షియెంట్ ఇండియా' (1889). ప్రాచీన భారతదేశ సాంస్క ృతిక, నాగరిక అస్తిత్వాన్ని నిరూపించడం ఈ పుస్తకం ఆశయం. 'హిందూ మహాయుగము'ను "రాయుటలో నాకు శ్రీ రమేష్ చంద్రదత్తు గారి గ్రంథము ముఖ్యాధార మైనద"ని లక్ష్మణరావుగారు తన పుస్తకానికి రాసిన 'మొదటి కూర్పు పీఠిక'లో తెలియజేశారు. (హి.మ.పు. xxxviii) ఆర్.కె. ముఖర్జీ పుస్తకం 'ది ఫండమెంటల్ యూనిటీ ఆఫ్ ఇండియా' భారతదేశ 'ఏకత్వాన్ని' నిరూపించ ప్రయత్నిస్తూ 'హిందూ' మతాన్ని దానికి ప్రాతిపదికగా చూపుతుంది. ఆయనే రాసిన 'ఏ హిస్టరీ ఆఫ్ ఇండియన్ షిప్పింగ్ అండ్ మారిటైమ్ అక్టివిటీ' భారతీయ 'అంతర్జాతీయ' వాణిజ్య చరిత్రను తెల్పుతుంది. కాశీ ప్రసాద్ జయస్వాల్ తన 'హిందూ పాలిటీ' (1924)లో ప్రాచీనకాలం నుంచీ భారతీయులకు ప్రాతినిధ్య రాజకీయాలు (రిప్రజెంటేటివ్ పాలిటిక్స్) తెలుసుననీ, ప్రాచీనకాలంలోనే గణతంత్ర విధానమూ, పార్లమెంటరీ వ్యవస్థా ఉండేవనీ వాదించారు. భారతదేశం ప్రాతినిధ్య రాజకీయాలంటే ఏమిటో ఎరుగదనీ, ఎల్లప్పుడూ పాలక నియంతల పదఘట్టనల కింద నలిగిపోయిందనీ, బ్రిటిష్ పాలనావ్యవస్థ వాటితో పోలిస్తే ఎంతో మెరుగైందనీ, కాబట్టి భారతీయులు జాతీయవాదం, గీతీయవాదం అని అరవకుండా బ్రిటిష్ పాలనను గమ్మున అంగీకరించాలని సామ్రాజ్యవాదులు వాదిస్తున్న సందర్భంలో దానికి ప్రతిస్పందనగా ఇది వచ్చింది. భారతదేశ అస్తిత్వ నిరూపణకై ప్రాచీన భారతదేశ చరిత్ర మీదే జాతీయవాద చరిత్రకారులు ఎక్కువగా దృష్టి కేంద్రీకరించారనేది దీనివల్ల మనకు స్పష్టమవుతుంది. ఈ కేంద్రీకరణ సంకుచితమవుతూ పోయి భారతదేశ చరిత్ర "హిందూ" చరిత్రకు కుదించబడింది. పర్యవసానంగా హైంద వేతరులు, ముఖ్యంగా ముస్లింలు, "పరాయి" వారిగా చిత్రీకరించ బడ్డారు. తద్వారా ఇక్కడి మూలాల నుండి నిరాకరించబడ్డారు. జాతీయవాద చరిత్రకారులు 'పరాయి' గుర్తింపును మధ్యయుగ పాలకులపై (ముఖ్యంగా

ఇస్లాంలో పుట్టినవారు) రుద్ది వారు సాధించిన గొప్ప విషయాలను చాలా వరకు గుర్తించ నిరాకరించారు. 'హిందూ'గా తాము భావించిన ప్రాచీన భారతదేశ చరిత్రను 'స్వంతం' చేసుకొంటూ 'ముస్లిం'గా (పరాయి) భావించిన మధ్యయుగ చరిత్రను తిరస్కరించారు. మైఖెల్ గాటలోబ్ మాటల్లో "హిందువుల మధ్య ఐక్యతను సాధించే ఇతోధిక తపన హైంద వేతరులను (ముస్లింలను) బాహిరపరచడానికి దారి తీసింది, పు. 39)

జాతీయవాద చరిత్రకారులు (కొన్ని అపవాదాలతో) ఇలా ఎందుకు చేశారు? ఈ ప్రశ్నకు స్పష్టమైన సమాధానం దొరకడం కష్టం. కానీ ఈ చరిత్రకారుల 'సాంస్కృతిక నేపథ్యం' ఈ విషయంలో గణనీయమైన ప్రభావాన్ని కలుగజేసిందనడంలో అనుమానాలకు తావు లేదు. ఈ చరిత్రకారుల్లో అధికశాతం మంది బ్రాహ్మణ, కాయస్థ మొదలైన ఆధిపత్య కులాల నుండి వచ్చివారు కావడమూ, 'హిందూ' ధర్మానికి రక్షకులుగా తమని తాము భావించడం, తద్వారా 'హిందూ' ధర్మాన్ని, ముఖ్యంగా 'హిందూ సంస్కృతి' అని తాము భావించిన దాన్ని వలసవాదుల దాడి నుండి రక్షించే బాధ్యతను తీసుకోవడం వల్ల, ఆ తాపత్రయంలో భాగంగా పైన వివరించిన అవాంఛనీయమైన భావాలను ప్రోది చేశారు. కానీ ఆశ్చర్యం కలిగించే విషయమేమంటే బ్రాహ్మణ / అగ్రకుల సామాజిక, చారిత్రక దృక్పథాన్ని ప్రశ్నించి ప్రత్యామ్నాయ 'బహుజన' జ్ఞానసిద్ధాంతాన్ని సృష్టించిన సామాజిక, సాంస్కృతిక విప్లవకారుడైన జ్యోతిబాపూలే వంటి బహుజన మేధావి కూడా 'ముస్లిం'ల విషయానికొచ్చే సరికి అలాంటి భావజాలాన్నే వ్యక్తం చేయడం. తన *శివాజీ పోవడ* (1869)లో శివాజీ పట్ల మితిమీరిన ఆరాధనా భావాన్ని వ్యక్తం చేస్తూ 'ముస్లిం'ల గూర్చి ఈ కింది విధంగా రాశాడు

*"కాబూల్ వదిలి, సింధులో మునిగి*
*గడ్డం ధరించి, హిందువులను వేధించి*
*బ్రాహ్మల పిలక కోరిగి, అవయవాలు తరిగి,*
*శివలింగాలు పగలగొట్టి, ఆలయాలు కూలగొట్టి*
*గొడ్డుమాంసం తిని, పందులను వదిలి*
*చిత్రపటాలను చించేసి, శిల్పాలను ధ్వంసించి*
*విగ్రహాలను కూలదోసి, కాబూల్‌కు పంపించి*
*హిందువులను చిత్రహింసలు పెట్టి, మతాన్ని తూలనాడి*
*రాజులను బంధించి, దేహాలను కొరతవేసి*
*ఆలయాలు కూల్చేసి, మినార్‌లు నిర్మించి"*

(ధనంజయ్ కీర్, మహాత్మా జ్యోతిరావ్ పూలే, ఫాదర్ ఆఫ్ ఇండియన్ సోషల్ రెవల్యూషన్, పాపులర్ ప్రకాశన్ బాంబే, 1997 (ప్రథమ ముద్రణ 1964), పేజీ 102. పై పద్యాన్ని ఇస్తూ ధనంజయ్ కీర్ ముస్లిం వ్యతిరేకతతో యిలా రాశారు : "కవి జ్యోతిరావ్, ముస్లిం ఉన్మాదుల మూకలు భారతదేశాన్ని దురాక్రమించిన తీరును ఇలా వర్ణించారు" (పేజీ 102)). శివాజీ గూర్చి వలసవాదుల కాలంలోనూ, తర్వాతి కాలంలోనూ రాసిన సాహిత్యకారులందరూ దాదాపుగా ఇలాగే రాశారు. తెలుగులో అది 'శివభారతం' అయినా, 'శివాజీ ప్రబంధం' అయినా ఇలాంటి భావజాలాన్నే కలిగి ఉన్నాయి.

దీనిని బట్టి చూస్తే రొమిలాథాపర్, బిపన్ చంద్ర మొదలైన వారు చెప్పినట్లుగా వలసవాదుల విద్యావ్యవస్థలోనే ('సోషియాలజీ ఆఫ్ ఎడ్యుకేషన్ ఇన్ మాడ్రన్ ఇండియా') ప్రాథమిక లోపం ఉంది. ఈ విషయాన్ని గూర్చి ఇంకా లోతైన పరిశీలన, పరిశోధన జరగాల్సిన అవసరం ఉంది.

జాతీయవాద చరిత్రకారుల్లో ఎక్కువమంది తమ సమకాలీన మతతత్వ రాజకీయాల ద్వారా తీవ్రంగా ప్రభావితులవడంచేత సదరు మతతత్వ రాజకీయాలను గత కాలపు, ముఖ్యంగా మధ్యయుగ రాజకీయాల విశ్లేషణకు అన్వయించారు. బ్రిటిష్ పూర్వ భారతరాజకీయాలను హిందూ-ముస్లిం పోరాటంగా చిత్రీకరించి అవే మతతత్వ రాజకీయాలు 19,20 శతాబ్దాల్లో కొనసాగుతున్నాయన్న అభిప్రాయం కల్గించారు. 'ప్రాతినిధ్య జాతీయవాదు'లయిన వారు తమ జాతీయవాద భావాలను బయటపెట్టుకునేందుకై మతతత్వ చారిత్రక వ్యాఖ్యానం వైపు మొగ్గు చూపారు. తాము భద్రంగా ఉండడానికై బ్రిటిష్ పాలనను విమర్శించడం ద్వారా కాకుండా 18,19 శతాబ్దాల్లోనూ, అంతకు ముందూ పాలించిన 'హిందూ' పాలకులను పొగడడం ద్వారా వీరు తమ జాతీయవాదాన్ని నిరూపించుకునే ప్రయత్నంచేశారు. మతతత్వ దృక్పథంతో భారతదేశ చరిత్రను వ్యాఖ్యానించిన బ్రిటిష్ చరిత్రకారుల అడుగుజాడల్లో నడిచి వీరుకూడా 18వ శతాబ్దంలోనూ, అంతకు ముందూ జరిగిన రాజకీయ ఘటనలను హిందూ - ముస్లిం పోరాటంగా, 19,20 శతాబ్దాల్లోని 'హిందూ-ముస్లిం వైరుధ్యాన్ని' శత్రువైరుధ్యంగా చిత్రీకరించారు. తమ అతివాద జాతీయ భావాల ప్రకటనలో భాగంగా అనేక మంది 'జాతీయవీరుల'ను (వీరి దృష్టిలో ముస్లింలతో పోరాడిన హిందూవీరులు) సృష్టించి, సదరు 'జాతీయ వీరపూజా కర్తవ్యాన్ని' నెరవేర్చే ప్రయత్నంలో భాగంగా అనేక కట్టుకథలనల్లారు. ఈ జాతీయవీరుల కట్టుకథలన్నీ అనివార్యంగా మతతత్వాన్ని సృష్టించి, పెంచి పోషించాయి. ఈ విధంగా భారత జాతీయ వ్యక్తిత్వాన్ని నిరూపించడానికై వీరు హ్రస్వదృష్టితో చేసిన ప్రయత్నాలు (అనేక సందర్భాల్లో అచేతనంగానే అయినా!) మతతత్వ దృక్పథాన్ని పటిష్టం చేశాయి. జాతీయవాదులు చేసిన పొరపాటు వల్ల చరిత్ర వ్యాఖ్యానంలో ప్రస్ఫుటమైన మతతత్వ దృక్పథాన్ని సమకాలీనంగానూ, తర్వాతా హిందూ మతతత్వవాదులు సమర్థవంతంగా ఉపయోగించు(కున్నారు) కుంటున్నారు.[6]

జాతీయవాద చరిత్రకారుల్లోనూ, అనేకమంది జాతీయ వాదుల్లోనూ మతతత్వ భావజాలం అంకురించడానికీ, అభివృద్ధి చెందడానికీ, అప్పటి వలస విద్యావ్యవస్థకూ, ముఖ్యంగా అప్పటి పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ బోధించిన చరిత్ర పాఠ్యాంశాలకూ అవినాభావ సంబంధం ఉంది. ఈ విషయాన్ని భారతదేశంలో మతతత్వ పుట్టుపూర్వోత్తర పర్యవసానాల గూర్చి విస్తృత పరిశోధన చేసిన ప్రముఖ చరిత్రకారుడు ప్రొఫెసర్ బిపన్‌చంద్ర మాటల్లో తెల్సుకుందాం.[7]

"పాఠశాలల్లో, కళాశాలల్లో భారత చరిత్ర బోధన మతతత్వ భావాల పెరుగుదలకు పెద్ద ఎత్తున దోహద పడింది. దాదాపుగా ఆధునిక పాఠశాలా పద్ధతి వచ్చినప్పటి నుంచీ, తరాల పాటు, చరిత్ర పట్ల వేరు వేరు స్థాయిలలో ద్వేషం నిండిన మతతత్వ వ్యాఖ్యానం ప్రచారం చేయబడింది. ఈ పనిని మొదట సామ్రాజ్య రచయితలు చేశారు. ఆ తర్వాత ఇతరులూ చేశారు. ఈ ప్రచారం ఎంత లోతుగా, ఎంత విస్తారంగా జరిగిందంటే దృఢమైన జాతీయవాదులు కూడ, అచేతనంగానే అయినప్పటికీ, ఆ చరిత్రలోని కొన్ని మౌలిక అంశాలు భారత చరిత్రకు సంబంధించిన మౌలిక సత్యాలు' అన్ని నమ్మడం మొదలెట్టారు. జాతీయవాద భావజాలంలోని హిందూ రంగులో వారు కూడ అవిభాజ్య భాగమైపోయారు..."

"చిన్నతనం నుంచి చరిత్రను మతతత్వ దృష్టి నుంచి చూడడం అలవాటయినందువల్ల, ఈ దృక్పథంలోని అంశాలే జాతీయవాదులలో

కూడ బలం పుంజుకున్నాయి. కాంగ్రెస్ నాయకులలో, కార్యకర్తలలో చాలమంది ఈ అంశాలలో కొన్నిటిని జీర్ణం చేసుకుని, వాటిని ప్రచారం చేస్తూ వచ్చారు. వారు ఆ పనిని అనుద్దేశ్యపూరితంగానే చేసి ఉండవచ్చు. పరిణామాల గురించి ఆలోచన లేకుండా చేసి ఉండవచ్చు. ఉదాహరణకు, భారతదేశం వెయ్యి సంవత్సరాలపాటు విదేశీపాలన కింద మగ్గిపోయిందనీ, ముస్లిం పాలన కింద భారత సమాజం, సంస్కృతి దిగజారిపోయాయని వాళ్లు అన్నారు."

## II

పైన వివరించిన నేపథ్యంలో భాగంగానే తెలుగులోనూ జాతీయవాద చరిత్రలు వచ్చాయి. జాతీయవాద దృక్పథంతో చరిత్రను రచించిన వారిలో కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, చిలుకూరు వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ మొదలైనవారు ముఖ్యులు.[8] (జాతీయోద్యమం ప్రభావం వల్ల కేవలం చరిత్ర రచనలే కాకుండా చరిత్ర / చారిత్ర కాంశాలూ/ చారిత్రకమానవులూ వస్తువుగా జాతీయోద్యమ సాహిత్యం కూడా వచ్చింది.) ప్రస్తుతవ్యాసం కొమర్రాజు వేంకటలక్ష్మణరావు గారి రచనల గురించి కాబట్టి ఆయన జీవిత విశేషాలనూ ఆయన మీది ప్రభావాలనూ తెలుసుకోవడం అవసరం.

ఇరవయ్యవ శతాబ్దపు మొదటి రెండు దశకాల్లో తెలుగుదేశంలో 'ఆధునికతను' సంతరింపజేయడానికి విశేష కృషి చేసిన వారు కొమర్రాజు లక్ష్మణరావు పంతులు (1876-1923). కనీసం అర్ధ శతాబ్దమైనా జీవించలేకపోయినా వీరు తెలుగు సమాజాన్ని గణనీయంగా ప్రభావితం చేశారు. తెలుగుగడ్డ మీదనే పుట్టినా కౌమార, యవ్వన దశలనూ, ముఖ్యంగా తన విద్యాభ్యాసకాలాన్ని మహారాష్ట్రలోని నాగపూర్‌లో గడిపారు. మరాఠీ భాషాసాహిత్యాలూ అక్కడ విస్తరిస్తున్న విజ్ఞాన వికాసాల వలనా, ముఖ్యంగా జాతీయోద్యమం ద్వారా ఉత్తేజితులయ్యారు. మహారాష్ట్రలోని బౌద్ధిక వాతావరణంతో ప్రభావితులైన వీరు 'కేసరి', 'మహారాష్ట్ర' వంటి పత్రికలలో వ్యాసాలు రాయడం ద్వారా సమకాలీన వాదోపవాదాలలో పాల్గొనేవారు. అంతేకాకుండా వీరేశలింగం రచనల ప్రభావం కూడా ఆయనపై ఉండింది. ఈ నేపథ్యంలో తెలుగుదేశానికి తిరిగివచ్చిన కొమర్రాజువారు తెలుగుదేశంలో తన ఉద్యమాలకు స్వీకారం చుట్టారు.

తెలుగు భాషాభ్యున్నతికీ, తెలుగువారిలో పఠనాసక్తిని పెంచడానికీ తన సహచరులతో కలిసి 1901 సెప్టెంబర్ 1న 'శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయా'న్ని హైదరాబాద్‌లో స్థాపించారు. 'ఆంధ్రజాతిని నవీన పద్ధతుల మీద ఐహికముగ నడిపిం'చడానికి 'పురాణయుగమునుంచి ప్రకృతిశాస్త్ర, రాజకీయ ఆర్థిక యుగమునకు మన ప్రజలను తీసుకొని' పోవడానికి కొందరు మిత్రులతో కలిసి 1906లో 'విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి' అనే పుస్తక ప్రచురణ సంస్థను నెలకొల్పారు. దీని ద్వారా దేశ చరిత్ర, జీవిత చరిత్ర, పదార్థ విజ్ఞాన శాస్త్రం, రసాయన శాస్త్రం, అర్థశాస్త్రం, భూగర్భశాస్త్రం మొదలైన విషయాలలో గ్రంథాలను ప్రకటింప జేశారు. అంతేకాకుండా తెలుగులో తొలి విజ్ఞాన సర్వస్వ నిర్మాణం చేశారు. 1912లో స్థాపించిన 'విజ్ఞాన చంద్రికా పరిషత్తు' ద్వారా పఠనాభిరుచిని పెంచడానికి ఉద్యమించారు. తెలంగాణాలో అపారంగా ఉన్న తామ్ర శిలాశాసనాలను, కాగితాలనూ, తాళపత్ర గ్రంథాలనూ సేకరించి ప్రచురించే నిమిత్తం 1922లో 'పరిశోధక మండలి' ని స్థాపించారు.

ఇరవయ్యవ శతాబ్దపు ప్రథమార్థంలో తెలుగులో చరిత్ర రచన, పరిశోధన ఒకరకంగా వీరితోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, ఆదిరాజు వీరభద్రరావు మొదలైనవారు ఆయన ప్రోత్సాహంతోనే చరిత్ర పరిశోధనా రంగంలో పురోగమించారు.[9]

'హిందూ దేశ కథా సంగ్రహము' శీర్షికన 'హిందూ దేశ చరిత్ర'ను 'హిందూ మహాయుగము', 'మహమ్మదీయ మహాయుగము', 'మహారాష్ట్ర మహాయుగము', 'బ్రిటిష్ మహాయుగము' అన్న నాలుగు భాగాలుగా రచించాలన్న బృహత్ పథకం కొమర్రాజు వారికుండింది. కానీ ఆయన అనేక కార్యక్రమాల్లో నిమగ్నమవడం చేత ఈ పథకం సగం మాత్రమే విజయవంతమై కేవలం మొదటి రెండు పుస్తకాలు మాత్రమే ఆయన పూర్తి చేయగలిగారు. ప్రస్తుత వ్యాసం ఈ రెండు పుస్తకాలకూ సంబంధించింది కాబట్టి వాటి గురించి కొంత తెలుసుకుందాం.

### 1. 'హిందూ మహాయుగము' అను హిందూదేశ కథా సంగ్రహం

ఇది మొదట 1907లో 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' ద్వారా ప్రచురితమైంది. అచ్చుపడిన 'యైదు నెలలలోనే వేయి ప్రతులును' వ్యయం కావడం వల్ల వెంటనే పునర్ముద్రించిన 500 ప్రతులు కూడా 1908 చివరికల్లా అమ్ముడుపోయాయి. 1912లో ఈ గ్రంథం ఐదవసారి ముద్రితమైంది. అందుకే 'ఇట్లు రెండేండ్లలో మూడు కూర్పులచ్చుపడిన తెలుగుపుస్తకములు మిక్కిలియుండ'వనీ, 'ప్రతి సంవత్సరమును ఒక కొత్త కూర్పు అచ్చుపడులాగున జేసి యాంధ్రజనులు ఈ గ్రంథమునకు అనన్య సామాన్య గౌరవము గలుగజేసిరి' అనీ మూడు, నాలుగు కూర్పులకు రాసిన పీఠికల్లో తన సంతోషాన్ని కొమర్రాజువారు వ్యక్తం చేశారు. విజ్ఞానచంద్రికా పరిషత్తు వారు తమచే నియమింప బడిన తెలుగుపరీక్ష నిమిత్తమై ఈ గ్రంథాన్ని పఠనీయంగా ఏర్పరిచారు. అంతేకాకుండా చెన్నపురి విశ్వవిద్యాలయపువారు ఈ 'హిందూ మహాయుగము'లోని 'కొన్ని భాగములు' 1909లో ప్రవేశపరీక్షకు (మెట్రిక్యులేషన్) 'చదవాల్సిన పుస్తకం (టెక్స్ట్)'గా పెట్టారు. అంతేకాక అచ్చటచ్చట ప్రాథమిక పాఠశాలలో ఈ పుస్తకాన్ని బాలురకు చదవాల్సిన పుస్తకంగా యేర్పరచడమైంది. ఒరిజినల్‌గా ఈ పుస్తకం 'చిన్న అక్షరములతో' ముద్రింపబడి 226 పుటలు కలిగి ఉండింది. ఇందులో 'హిందూదేశము : అందలిజనులు', 'ఋగ్వేదయుగము (క్రీ.పూ. 2000-1400)', 'క్షాత్రయుగము (క్రీ.పూ. 1400-1000)', 'సూత్రయుగము (క్రీ.పూ. 1000-557)', 'బౌద్ధయుగము (క్రీ.పూ. 500 క్రీ.శ. 500)', 'పౌరాణికయుగము (క్రీ.శ. 500-1200)', అన్న ఆరు ప్రకరణాలున్నాయి. అంతేకాక 16 పటములు కూడా ఉన్నాయి. ఈ గ్రంథం అక్కిరాజు రమాపతిరావు సంపాదకత్వాన 2002 డిసెంబరులో 'సుపథ ప్రచురణలు' ద్వారా పునర్ముద్రితమైంది.[10]

### 2. 'మహమ్మదీయ మహాయుగము' అను హిందూదేశ కథా సంగ్రహం

ఈ గ్రంథం మొదట 1908లో ప్రచురితమైంది. అక్కిరాజు రమాపతిరావు సంపాదకత్వంలో 2004లో 'సుపథ ప్రచురణలు' ద్వారా పునర్ముద్రితమైంది.[11] సుమారు 400 పేజీలు కల ఈ గ్రంథంలో 'ముసల్మానుల యుత్పత్తి, వారీ దేశమునకు వచ్చుట', 'అఫ్‌గాన్ రాజులు', 'మొగల్ ప్రభుత్వము', 'దక్షిణములోని మహమ్మదీయ రాజ్యములు',

'రాజపుత్రుల శౌర్యాగ్ని', 'విజయనగర సామ్రాజ్యము' అన్న ఆరు ప్రకరణాలున్నాయి. అంతేకాక 54 పటములున్నాయి. ఇందులో కొమర్రాజుగారు రాసిన 11 పేజీల సుదీర్ఘ 'పీఠిక' ఉంది. అంతేకాకుండా 'మధ్యయుగాల పూర్వాపరాలు–భారతదేశ చరిత్ర' శీర్షికతో అక్కిరాజు రమాపతిరావు రాసిన మతతత్వ పైత్యంతో కూడిన 13పేజీల 'ముందుమాట' వ్యాసం కూడాఉంది.

జాతీయవాద దృక్పథంతో వచ్చిన పై రెండు చరిత్ర గ్రంథాలలో మతతత్వ భావజాలం ఏ విధంగా, ఎంత తీవ్రంగా చోటుచేసుకుందో ఇప్పుడు పరిశీలిద్దాం.

*(మిగతా వచ్చే సంచికలో)*

### అంత్యసూచికలు

⌖ వ్యాస రచయిత – కో ఆర్డినేటర్, చరిత్రశాఖ, బాబాసాహెబ్ భీంరావ్ అంబేద్కర్ కేంద్రీయ విశ్వవిద్యాలయం, లక్నో.

⌖⌖ ఈ పత్రాన్ని రూపొందించడంలో అనేక సలహాలు, సూచనలు ఇచ్చిన సీనియర్ మిత్రులు ఎస్.సి. గఫార్, డా. జి. సాంబశివారెడ్డి, డా. బి.ఆర్. ప్రసాద్ రెడ్డి గార్లకూ, శ్రేయోభిలాషులు డా. ఐ. తిరుమలి, డా. లక్ష్మి గార్లకూ, పోరుమామిళ్ల 'పీపుల్ ఫర్ సోషల్ సైన్సెస్' మిత్రులకూ, వ్యాసాన్ని త్వరగా పూర్తిచేయమని చెబుతూ పలు సూచనలు చేసిన విరసం రవికీ, కర్నూలు మిత్రులు ఖదీర్ హమ్దర్ద్, నిసార్ అహ్మద్‌లకూ, దోస్త్ సైబాబాకూ కృతజ్ఞతలు.

1. బిపన్‌చంద్ర, 'ఆధునిక భారత చరిత్రకారులు – మతతత్వం' ఇన్ రొమిలా థాపర్, హర్బన్స్‌ముఖియా, బిపన్‌చంద్ర, *భారతదేశ చరిత్ర రచనలో మతతత్వం*, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, సెప్టెంబర్ 2001 (మొదటి ముద్రణ : 1985) పు. 41.

2. ఈ విషయానికి సంబంధించిన విస్తారమైన చర్చకై చూడండి రొమిలా థాపర్ మొ., *భారతదేశ చరిత్ర రచనలో మతతత్వం*, పై.ఉ.; బిపన్‌చంద్ర, 'ది యూజ్ ఆఫ్ హిస్టరీ' ఇన్ కమ్యూనలిజమ్ ఇన్ మాడ్రన్ ఇండియా, వికాస్ పబ్లిషింగ్ హౌజ్, న్యూ ఢిల్లీ, 1996 (ప్రథమ ముద్రణ : 1984) పు. 209–236; రొమిలా థాపర్, ది పాస్ట్ అండ్ ప్రిజుడిస్, నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా, 1994 (ప్రథమ ముద్రణ 1975).

3. రొమిలా థాపర్, 'మతతత్వం – ప్రాచీన భారతదేశ చరిత్ర రచన' ఇన్ రొమిలా థాపర్ మొ; పై.ఉ; పు. 6–9 ఇంకా చూడండి రొమిలా థాపర్ 'ఇంటర్‌ప్రెటేషన్స్ ఆఫ్ ఏన్షియంట్ ఇండియన్ హిస్టరీ' ఇన్ ఏన్షియంట్ ఇండియన్ సోషల్ హిస్టరీ; సమ్ ఇంటర్‌ప్రెటేషన్స్, ఓరియంట్ లాంగ్‌మాన్, 2004 (ప్రథమ ముద్రణ 1978) పు. 1–22; రామ శరణ్ శర్మ, 'హిస్టరియోగ్రఫి ఆఫ్ ఏన్షియంట్ ఇండియన్ పాలిటి అప్‌టు 1930 ఇన్ ఆస్పెక్ట్స్ ఆఫ్ పొలిటికల్ ఐడియాస్ అండ్ ఇన్‌స్టిట్యూషన్స్ ఇన్ ఎన్షియంట్ ఇండియా', మోతిలాల్ బనారసిదాస్ పబ్లిషింగ్, ఢిల్లీ, 1999 (ప్రథమ ముద్రణ 1959), పు. 1–13.

4. రొమిలా థాపర్, 'మతతత్వం – ప్రాచీన భారతదేశ చరిత్ర రచన', పై.ఉ; పు. 7–9

5. పైదే

6. బిపన్ చంద్ర, 'ఆధునిక భారత చరిత్రకారులు – మతతత్వం' పై.ఉ;

7. బిపన్ చంద్ర, 'ది యూజ్ ఆఫ్ హిస్టరీ' పై.ఉ.; పు. 210, 212

8. వకుళాభరణం రామకృష్ణ 'జాతీయ చైతన్యం, చరిత్ర రచన' ఇన్ అక్కిరాజు రమాపతిరావు (సంకలనం), *నేటి భారతదేశ చరిత్ర : ప్రముఖ చరిత్ర విద్వాంసుల విశ్లేషణ*, సుపథ ప్రచురణలు, హైదరాబాద్, 2004, పు. 47. చిలుకూరి వీరభద్రరావు (1873–1939) 1904 లో స్యూయల్ రచించిన 'ఫర్గాటెన్ ఎంపైర్' అనే పుస్తకాన్ని చదివి ప్రభావితులై *'జీర్ణకర్ణాట రాజ్య చరిత్ర'* అనే గ్రంథాన్ని రచించారు. *'ఆంధ్రుల చరిత్ర'*ను మూడు భాగాల్లో రచించారు. ఇందులోని మొదటి రెండు భాగాలను 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' వారు ప్రచురించారు (మొదటి భాగం 1910 లోనూ రెండవ భాగం 1912లోనూ వెలుగుచూశాయి). కొన్ని చారిత్రక'వాస్తవాలను' బయటపెట్టడం కారణంగా 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' పోషకుల కోపానికి గురికావడంతో మూడవభాగం తనే మిత్రుల సాయంతో రాజమండ్రిలో స్థాపించిన 'ఇతిహాస తరంగిణీ గ్రంథమాల' ద్వారా ప్రచురితమైంది. *'ఆంధ్రుల చరిత్ర'* నే కాక *'భారతవీరుల చరిత్ర'* (1913), *'కర్ణసామ్రాజ్యము'* (1916), *'నాయకురాలి దర్పము'* (1916), *'తిమ్మరసు'*, *'తిక్కన సోమయాజి'* మొదలైన గ్రంథాలను రచించారు. జీవితమంతా చరిత్ర పరిశోధన, రచనలకు అంకితం చేసిన చిలుకూరి వారు 1936లో *'కాకతీయ ఆంధ్ర రాజయుగ చరిత్ర'*ను రచించారు. అభిప్రాయ భేదాలున్నా కొమర్రాజు గారికి అంకితమిచ్చారు. ఆయన చరిత్ర రచనా పాటవాన్ని తెలుగువారు గుర్తించడం కారణంగా 1928లో సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యక్షతన నంద్యాలలో జరిగిన ఆంధ్రమహాసభలో చిలుకూరి వీరభద్రరావు గారికి 'చరిత్ర చతురానన' అనే సముచిత బిరుదునిచ్చారు. చూడండి : ఆరుద్ర, *సమగ్ర ఆంధ్ర సాహిత్యం*, నాల్గవ సంపుటి, తెలుగు అకాడమి, హైదరాబాద్, 2004, పు. 263–266. మల్లంపల్లి సోమశేఖర శర్మ (1891–1963) చిలుకూరి వీరభద్ర రావుగారికి చరిత్ర పరిశోధనలో తోడ్పడ్డారు; ఇదే ఆయన మీద ప్రభావం కలిగించింది. *'ఆంధ్రవీరులు'*, *'ప్రాచీన విద్యాపీఠాలు'*, *'ప్రాచీన ఆంధ్ర నౌకా జీవనం'* వంటి చారిత్రక వ్యాసాలు, ముసునూరి నాయకుల చరిత్రకు సంబంధించిన 'ఏ ఫర్గాటన్ ఛాప్టర్ ఆఫ్ ఆంధ్రా హిస్టరీ' అనే గ్రంథాన్నీ (1945), 'హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్‌డమ్స్' (1948) నూ రచించారు. డిగ్రీలు లేకపోయినా 1940 నుండి 1946 దాకా ఆంధ్రవిశ్వవిద్యాలయం చరిత్రశాఖలో ఆచార్యునిగా ఉన్నారు. పైదే. పు. 266–270

9. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారి జీవిత విశేషాలనూ, సాంస్కృతిక రంగంలో ఆయన కృషినీ తెలుసుకోవడానికై చూడండి ఆరుద్ర 'కొమర్రాజు వేంకట లక్ష్మణరావు (1876–1923)', 'కొమర్రాజు వారి సహచరులు' *సమగ్ర ఆంధ్ర సాహిత్యం* నాల్గవ సంపుటిలో, పు. 234–275. ఇంకా చూడండి జి. కృష్ణ, *కొమర్రాజు వేంకట లక్ష్మణరావు*, ఇంటర్నేషనల్ తెలుగు ఇన్‌స్టిట్యూట్, హైదరాబాద్, 1984. కె.కె. రంగనాథాచార్యులు, (*తెలుగు వైతాళికులు*, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1976.) బూదరాజు రాధాకృష్ణ : కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, సాహిత్య అకాడమీ, కొత్తఢిల్లీ, 2004

10. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు (అక్కిరాజు రమాపతిరావు (సం.)), *హిందూ మహాయుగము అను హిందూ దేశ కథా సంగ్రహము* (ఇకపై హి.మ), సుపథ ప్రచురణలు, హైదరాబాద్, 2002 (మొదటి ముద్రణ 1907)

11. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు (అక్కిరాజు రమాపతిరావు (సం.), *మహమ్మదీయ మహాయుగము అను హిందూ దేశ కథా సంగ్రహము*, (ఇక పై మ.మ.), సుపథ ప్రచురణలు, హైదరాబాద్, 2004 (మొదటి ముద్రణ 1908). పుస్తకాన్ని పునర్ముద్రించిన వారు సంవత్సరాన్ని 'లాస్ట్ ఎడిషన్ :1907' అని ఇచ్చారు. కానీ కొమర్రాజు వారు ఈ పుస్తకానికి రాసిన పీఠిక అనుసారంగా వెళ్తే 1908 సరైన సంవత్సరమన్పిస్తుంది. ◆

**ఒకే సంస్థకు పలుభాషా పత్రికలు ఉన్నా, స్థానిక విషయాల మీద ఎవరి విధానాలు వారివే అంటున్నారు నాగసూరి వేణుగోపాల్**

# ఇక అనువాద దినపత్రికలు

టైమ్స్ ఆఫ్ ఇండియా – ముంబయి ఎడిషన్ అని ఢిల్లీలో ఉండే బొంబాయి వారు విడిగా తెప్పించుకుని చదువుకునేవారు ఇంటర్‌నెట్ పత్రికలు రాకముందు. అయితే, పత్రికాపరంగా చూసినపుడు ఎడిటర్ ముంబయి మార్కెట్ అని ఏదో పేరు రాయడం రెండు దశాబ్దాలలో వచ్చిన మార్పు. అంటే, యాజమాన్యం మార్కెట్ అనే దృష్టితో చూస్తోందని సులువుగా తెలుసుకోవచ్చు. పత్రికల నిర్వహణలో చమత్కారాలు చేయడం టైమ్స్‌వారికి కొట్టినపిండి. 2007 సంక్రాంతికి బెంగుళూరులో మరో వినూత్న ప్రయోగం చేశారు. అదే 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా కన్నడ'. కన్నడ దినపత్రిక పేరు – ది టైమ్స్ ఆఫ్ ఇండియా – అని పెద్ద కన్నడ అక్షరాల కింద స్పష్టంగా కనబడేలా ఇంగ్లిషులో కూడా పత్రిక పేరు ఉంటుంది.


ದಿ ಟೈಮ್ಸ್ ಆಫ್ ಇಂಡಿಯಾ

THE TIMES OF INDIA

ಜಮ್ಮು-ಕಾಶ್ಮೀರದಲ್ಲಿ ಸೇನಾ ಕಡಿತ ಇಲ್ಲ: ಆ್ಯಂಟನಿ | 8

ಬಲವಂತದ ವಿವಾಹ ತಡೆಗೆ ಟೋನಿ ಬ್ಲೇರ್ ಯೋಜನೆ | 10

ವಿಮೆ ಪಾಲಿಸಿ ಇನ್ನು ಚರಾಸ್ತಿ

ಮೂರನೆ ವ್ಯಕ್ತಿಗೆ ಪಾಲಿಸಿ ಮಾರಬಹುದು, ಭದ್ರತೆಗಾಗಿ ಅಡ ಇಡಲೂಬಹುದು

ಲ್ಯಾಬ್‌ನಲ್ಲಿ 'ನರ ಕುರಿ' ಸೃಷ್ಟಿ

ఒక సంస్థకే పలుభాషలలో పత్రికలుండటం తెల్సిందే. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు తెలుగులో ఆంధ్రప్రభ, కన్నడంలో కన్నడప్రభ, తమిళంలో దినమణి, మరాఠిలో లోక్‌సత్తా, హిందిలో జనసత్తా.. ఇలా! టైమ్స్ ఆఫ్ ఇండియాకు మరాఠిలో మహారాష్ట్ర టైమ్స్ అనే పత్రిక ఉంది. ఇప్పుడు దక్కన్ క్రానికల్‌కు ఆంధ్రభూమి ఉన్నట్టు. డెక్కన్ హెరాల్డ్‌కు ప్రజావాణి ఉంది. ఇలా గొలుసు పత్రికలు అన్నమాట. పెట్టుబడి ఉంటే ఇలా సులువుగా నిర్వహించవచ్చు. ప్రకటనలు తీసుకోవడం సులువు. పరపతి ఎక్కువ. పత్రికల పాలసీని సులువుగా నియంత్రించవచ్చు.

ఒకే సంస్థకు పలుభాషా పత్రికలు ఉన్నా, స్థానికం అనే విషయం మీద ఎవరి వీరగాథలు వారివే. అలాగే నదీ జలాల విషయంలో ఎవరి స్వరం వారిదే. ఇక్కడా సంస్థ పాలసీ కన్న పత్రిక పాలసీ అని చెబుతూ ఉంటారు. దక్షిణాదిలో ప్రచురింపబడే తన పత్రికల సంపాదకులతో గొయెంకా సమావేశం నిర్వహించాలని భావిస్తే నార్ల వెంకటేశ్వరరావు వ్యతిరేకించేవారు.

ఈనాడు వారి 'న్యూస్‌టైమ్' దినపత్రిక ఎంతో కాలం సాగలేదు. ఇటీవల ఆంధ్రప్రభను ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వారు అమ్మివేశారు. అయినా కూడా వార్తల విషయంలో పంచుకోవడం ఉంది. ఈ రెండు పత్రికలనూ పరిశీలించే అవకాశం ఉండేది. కొన్ని వార్తలు యథాతథం అనువాదం చేసి ఇచ్చేవారు. అలాగే కులదీప్ నయ్యర్, నిహాల్‌సింగ్, రాజమోహన్‌గాంధి, మధులిమాయే వంటి వారి సంపాదకీయ పుట వ్యాసాలు, అనువాదాలు ఇచ్చేవారు. అన్నీకాదు కనుక పోల్చి చదువుకోవడానికి అవకాశం ఉండేది. ఆసక్తి ఉన్నవారికి కొంత కాలక్షేపం. అలాగే అనువాద ప్రక్రియలు అభిరుచి ఉన్నవారికి మెదడుకుమేత.

కానీ, ఇపుడు టైమ్స్ ఆఫ్ ఇండియా కన్నడ దినపత్రిక అలా కాదు, మొత్తం అనువాదం. నిమ్మమాతు (యూ సెడ్ ఇట్) అనే పేరుతో ఆర్కెలక్ష్మణ్‌గారి కార్టూన్ మొదలుకుని జ్ఞానజ్యోతి పేరన 'సేక్రెడ్‌స్పేస్', బోధివృక్షం పేరున 'ది స్పీకింగ్ ట్రీ' ని అనువదించి ఇస్తున్నారు. ఇక శశిధరూర్, జగసూర్య, స్వామినాథన్ అంక్లేశ్వర్, కపిల్‌దేవ్ వంటి వారి కాలమ్స్ గురించి చెప్పనక్కరలేదు.

ఇలా అనువాద దినపత్రికల గురించి నెట్‌లో విమర్శలు చూసిన తర్వాత – బెంగుళూరులోని మిత్రులతో చర్చించాను. మార్చ్ నెలలో చివరి వారం పత్రికలు తెప్పించుకుని పరిశీలించాను. పదహారు పుటలు మొత్తం రంగులలో ఇవ్వటం, సంపాదకీయపుట అని విడిగా లేకుండా చేయడం స్థూలంగా పరిశీలించవచ్చు. తొలి పుటనుంచి చివరి పుట దాకా టైమ్స్ ఆఫ్ ఇండియా ఇంగ్లిష్ పేపరు కన్నడలో చదివినట్టుంది. పుటలలో వార్తల వర్గీకరణ చూస్తే దాదాపు ప్రతి పేజికి టైమ్స్ అంటూ ఏదో పదం ముందు, వెనుక ఉంటుంది. టైమ్స్ సిటి అంటూ నాలుగు పేజీలు బెంగుళూరు వార్తలు, టైమ్స్ కర్నాటక అని రెండు పేజీలు, టైమ్స్ నేషన్ అంటూ రెండు పేజీలు, టైమ్స్ ఇంటర్నేషనల్ అని ఒక పేజీ, టైమ్స్ బిజినెస్ అని రెండు పేజీలు, టైమ్స్ స్పోర్ట్స్ అని మూడుపేజీలు, టైమ్స్ ట్రెండ్స్ అని ఒక పేజీ – చివర టైమ్స్ ఎంటర్‌టైన్‌మెంట్ ఒక పేజీ. ఇది స్థూలంగా వార్తా విస్తరణ ఎపుడయినా పూర్తి పేజీ ప్రకటనలు వస్తే ఆమేరకు వార్తలకు కోత ఉంటుంది. ఆదివారం పేజీలు పెంచుకుంటే రేటు మాత్రం రెండు రూపాయలతో ఒకటి, రెండు కన్నడకు సంబంధమైన వ్యాసాలు ఇస్తారు. మిగతా రోజులు కేవలం రూపాయిన్నర. ఈ వర్గీకరణ

పరిశీలిస్తే ఏమనిపిస్తోంది? పాతికభాగం – నగరం, క్రీడలు – వినోదం కలిస్తే మరో పాతికభాగం? లేదా క్రీడలు, వాణిజ్యం, ట్రెండ్స్ కలిస్తే సగభాగం – అని సులువుగా బోధపడుతుంది. అంటే నగరంలోని యువత కోసం అని విడిగా చెప్పనక్కరలేదు.

టైమ్స్ ఆఫ్ ఇండియా కేవలం కన్నడంలోనే దినపత్రిక ప్రారంభించిడం ఎందుకు? ఇది అర్థవంతమైన ప్రశ్న. హైదరాబాద్‌లో ఇటీవల టైమ్స్ ఆఫ్ ఇండియా ప్రవేశించినా చెప్పుకోదగ్గ ప్రగతి లేదు. రాష్ట్రంలో ఇతర చోట్ల ఎడిషన్లు రాలేదు. చెన్నయ్‌లో వస్తోందని ఊరించారు, కానీ రాలేదు. జయలలితగారు భవనం నిర్మించి, టైమ్స్ ఆఫ్ ఇండియాకు అద్దెకు ఇస్తారని – ఆమె ముఖ్యమంత్రిగా ఉన్నపుడు వినబడేది. ఇలా 'హిందూ' పత్రికమీద, సన్‌టివీ మీద పోటీగా టైమ్స్‌ను దింపాలని భావించారని వినబడింది. అప్పట్లో చెన్నయ్‌లో సందడి బాగా ఉండేది. టైమ్స్ వస్తే హిందూస్తాన్ టైమ్స్ కూడా చెన్నయ్ వస్తుందని ప్రచారం జరిగింది. హిందూస్తాన్ టైమ్స్ వారు ఒక భవనం కొనాలని ప్రయత్నిస్తే, దానిని 'హిందూ' వారు కొనేశారని అప్పట్లో 'అవుట్‌లుక్' పత్రిక రాసింది కూడా. ఇంతవరకు టైమ్స్ చెన్నయ్‌లో దిగలేదు కానీ, డెక్కన్ క్రానికల్ అక్కడ మొదలైంది. ఆ సమయంలోనే ఆంధ్రప్రదేశ్‌లో ఆంగ్లపత్రికలు కారణం చెప్పకుండా రేట్లు తగ్గించాయి.

అయితే బెంగుళూరు కథ విభిన్నం. పాతికేళ్ల ముందే బెంగుళూరులో టైమ్స్ ఆఫ్ ఇండియా ప్రవేశించింది. రకరకాల చమత్కారాలు చేసింది. అందులో ఒకటి రేట్లు తగ్గించడం. క్రమంగా అక్కడి నెంబర్‌వన్ పత్రిక అయిన డెక్కన్ హెరాల్డ్‌ను అధిగమించింది. అప్పట్లో ఈ పత్రికల్లో పరస్పరం విమర్శించుకోవడం ఉండేది. ఇది కేవలం ఇంగ్లీషుకే పరిమితం అని భావించారు.

గత సంవత్సరం మరో విషయం జరిగింది. టైమ్స్ ఆఫ్ ఇండియా సంస్థ అధిక మొత్తం చెల్లించి విజయ కర్నాటక, విజయ టైమ్స్ పత్రికలను కైవసం చేసుకుంది. కేంద్రంలో భారతీయ జనతా పార్టీ అధికారంలో ఉన్న సమయంలో ఈ రెండు పత్రికలు ప్రారంభించబడ్డాయి. యజమాని బిజెపి సానుభూతిపరుడని వినబడేది. రేట్లు తగ్గించడం అనే విధానంతో విజయ కర్నాటక దినపత్రిక 'ప్రజావాణి' దినపత్రికను అధిగమించింది. దాంతో అటు డెక్కన్ హెరాల్డ్, ఇటు ప్రజావాణి – నెంబర్ వన్ స్థానాలను కోల్పోయాయి.

హైదరాబాద్ నుండి వెలువడే డెక్కన్ క్రానికల్ పబ్లిక్ ఇష్యూకు వెళ్లిన తర్వాత మిగులు ధనం ఉందని ప్రచారం. తమిళనాడులో ఎడిషన్లు పెట్టిన తర్వాత కర్నాటకలో ఒక ఆంగ్ల పత్రికను కొంటామని చెప్పుకున్నారు. దీని తర్వాత డెక్కన్ క్రానికల్ సంస్థ బెంగుళూరులో మరో దినపత్రికను కొనలేదు గాని టైమ్స్ సంస్థ విజయ కర్నాటక, విజయ టైమ్స్‌ను కొనుక్కుంది. నిజానికి ఈ కొనుగోలుకు టైమ్స్ చాలా ధనం వెచ్చించిందని, అది చాలా ఎక్కువని ప్రచారం జరిగింది. ఒకే సంస్థకు ఒకే చోట రెండు ఆంగ్ల దినపత్రికలు ఏమిటనే ప్రశ్న ఎదురయ్యింది. ఇటువంటి పరిస్థితి బొంబాయిలో కొంతకాలం ఉండింది. ఇండిపెండెంట్ – అని మరో దినపత్రికను 1990 దశకంలో టైమ్స్ నిర్వహించి – దాంతో 'ఇండియన్ పోస్ట్' అనే మరో పత్రికను దెబ్బతీసి – చివరకు 'ఇండిపెండెంట్' ను మూసేసింది. ఇపుడుకూడా ఇలా జరుగుతుందా?

అయితే విజయకర్నాటక దినపత్రికను కొనుగోలు చేసిన టైమ్స్ మరలా 'టైమ్స్ ఆఫ్ ఇండియా' అని కన్నడ దినపత్రిక ప్రారంభించడం ఏమిటని ప్రశ్న. టైమ్స్ ఆఫ్ ఇండియా వారి వ్యూహాలు వినూత్నంగా ఉంటాయి. ఇపుడు అనువాద దినపత్రికను రంగులలో సంచలనంగా తెస్తూ – విజయ కర్నాటక దినపత్రికకు ప్రచారం తగ్గించారు. అంటే క్రమంగా విజయ కర్నాటకను క్రమంగా మూసివేయవచ్చు. దాని సర్క్యులేషన్‌ను కొత్త పత్రికకు చాకచక్యంగా బదలాయించి దానికి మూతవేస్తారా? విజయకర్నాటక సంపాదకుడు రాజీనామా లేఖ ఇచ్చారని అంటున్నారు. అలా జరిగితే కర్నాటకలో అత్యధిక సర్క్యులేషన్ గల ఇంగ్లిషు, కన్నడ పత్రికలు ఒకే సంస్థవి ఒక్కోపేరు గల పత్రికలవి అవుతాయి.

ఇది కాక, బొంబాయిలో ఇటీవల 'బొంబాయి మిర్రర్'ను సాయంకాల పత్రికగా ప్రారంభించినట్టు త్వరలో బెంగుళూరు మిర్రర్‌ను ప్రారంభిస్తారట. క్రమంగా మొత్తం అత్యధిక సర్క్యులేషన్ గల దిన పత్రికలు అన్నీ ఒక సంస్థకు రావడం ఒక లక్ష్యం కావచ్చు. ఢిల్లీ నుంచి, న్యూయార్క్ నుంచి చూస్తే రెండు పత్రికలు కాకుండా ఒకే పత్రిక లాగా కనబడతుంది. ఈ సర్క్యులేషన్ నెంబర్లు వారికి చాలా రకాల ప్రయోజనాలు కల్గిస్తాయి.

ఈ దృశ్యం త్వరలో హైదరాబాద్‌లో పునరావృతం కావచ్చని ఒక అంచనా. రెండక్షరాల పేరుగల ఒక తెలుగు దిన పత్రికను టైమ్స్ కొంటుందని ప్రచారం ఉంది. కాసుల గలగల దేనికైనా దారితీస్తాయి. అలా ప్రవేశించి, మిగతా చమత్కారాలు తర్వాత చేయవచ్చు.

ఇంతవరకు ముఖ్యమైన అంశాలే చూశాం. కానీ ఇలా ఒకే పేరుతో విభిన్న భాషలలో పత్రికలు వెలువరించడం కొత్తా? దిన పత్రికలలో ఇప్పుడు కొత్తగా ఉండవచ్చు కానీ, ఇండియా టుడే రెండు దశాబ్దాల క్రితమే చాలా భాషలలో అదే పేరుతో ప్రారంభించింది. ఈటివి కన్నడ, మరాఠి, ఒరియా, బెంగాలీ, పంజాబీ, గుజరాతీ అని పలు ఛానళ్లు ఒకే పేరుతో కలిగి ఉంది. అలాగే జీ, స్టార్. ఇపుడు టైమ్స్ ఆఫ్ ఇండియా దిన పత్రిక పలుభాషలలో వస్తోంది. అత్యధిక సర్క్యులేషన్ గల పత్రికనే కొనుక్కోవడం వీరి వ్యూహం. ఇలా ఒకేపేరుతో విభిన్న భాషలలో ఉండటం, ప్రకటనలు పొందడం చాలా సులువు.

ప్రతిరోజూ దినపత్రిక మొత్తం ఇలా అనువదింపబడటం – చాలా మంది కన్నడ భాషామేధావులనూ, కన్నడ అభిమానులనూ క్షోభకు గురిచేస్తోంది. కన్నడ పాత్రికేయులు కేవలం అనువాదక పాత్రికేయులుగా రెండవ స్థాయి పొందడం ఒక సమస్య. పత్రిక మొత్తం అనువదింపబడితే – అంశాలు బొంబాయి, ఢిల్లీ నుంచి నిర్ణయించబడి స్థానిక అంశాలు పూర్తిగా మరుగునపడటం రేపు జరిగే విషయం. కానీ యాజమాన్యానికి – భాషా పరిమితి లేకుండా నియంత్రణ, వాణిజ్యం సులువు అవుతుంది. ఇది ప్రపంచీకరణ పోకడే. ఫలితంగా స్థానికతకు తీవ్రవిఘాతం.

పర్యవసానాలు ఎలా ఉన్నా – భారతీయ జర్నలిజంలో ఇది ఒక ప్రధానమైన పోకడ. దీనిని మాత్రం పట్టించుకోకుండా ఉండలేం. రేపు మరిన్ని భాషలకు ఈ పోకడ వ్యాపించవచ్చు. ఇంగ్లిష్ సరిగా రాకుండానే ఇంగ్లిష్ చదవాలనే వారికో, ఇంగ్లిష్ చదువుతున్నామనే భ్రమ కలిగినవారికీ – ఇటువంటి అనువాద పత్రికలు ఒక ఊరట అని చెబుతున్నారు. మన సూత్రీకరణలూ, విశ్లేషణలూ ఎలా ఉన్నా వారి వాణిజ్య పాచికలు బాగానే నడుస్తాయి. ఎందుకంటే ప్రపంచాన్ని నడుపుతోంది వారే కనుక. ◆

**తెలుగు సమాజం తన గురించి తాను తెలుసుకునే విశిష్ట పరిశోధనా ప్రక్రియను ప్రారంభిస్తున్న సిడిఆర్‌సి పరిశోధనా ప్రతిపాదనలను పరిచయం చేస్తోంది.**

# సామాజిక విశ్లేషణకు స్వల్పకాలిక ఉపకారవేతనాలు

తెలుగుసీమలో సామాజిక విశ్లేషణ జరగవలసిన పద్ధతిలో, అవసరమైన రంగాలలో జరుగుతున్నట్టు అనిపించడం లేదు. నిజానికి తెలుగు సమాజం చాల చలనశీలంగా, సృజనాత్మకంగా, త్వరితగతిన ముందుకు నడుస్తున్నట్టు కనిపిస్తున్నప్పటికీ ఈ నడక దిశ గురించి గాని, పరిమాణం గురించి గాని, వేగం గురించి గాని తగిన ఆధారాలతో చెప్పదగిన శాస్త్రీయ పరిశోధన, విశ్వసనీయమైన సమాచారం ఉండడం లేదు. తెలుగు సమాజం తనను గురించి తాను తెలుసుకోవలసిన అవసరం ఎంతగా పెరుగుతున్నదో ఆ తెలుసుకునే పని అందుకు తగినట్టుగా జరుగుతున్నట్లు లేదు. పెరిగిన ప్రచారసాధనాల వల్ల, పెరిగిన సమాచార వనరుల వల్ల కుప్పలుగా సమాచారం పోగుపడుతున్నట్టే కనిపిస్తున్నదిగాని, ఆ సమాచారపు సారాంశాన్నీ, అంతర్గతచలన నియమాలనూ సరిగ్గా అంచనా కట్టే పని సక్రమంగా జరుగుతున్నట్టులేదు.

నిజానికి తెలుగు సమాజంలో సామాజిక గమనం గురించి అవసరమైన సమాచారమంతా సేకరించడం, దాన్ని శాస్త్రీయంగా విశ్లేషించడం, దాని నుంచి తగిన నిర్ధారణలను రాబట్టి వ్యక్తీకరించడం వంటి పనులకు చాల సుదీర్ఘమైన, ఘనమైన చరిత్ర ఉంది. పందొమ్మిదో శతాబ్దంలో బ్రిటిష్ అధికారులు తమ పాలనా అవసరాల కోసం కోస్తాంధ్ర ప్రాంతంలో గ్రామ గ్రామానికీ సర్వేయర్లను పంపించి సేకరించిన గ్రామ కైఫియత్తులు గానీ, ఇతర సమాచారం గానీ, హైదరాబాద్ రాజ్యంలో బ్రిటిష్ సర్వే శాఖ ప్రభావంతో ప్రారంభించిన సర్వే పనులు గానీ మన నేలమీది తొలి సామాజిక సమాచార సేకరణ, విశ్లేషణ కార్యక్రమాలనుకుంటే, అనంతర చరిత్రలో సామాజిక విశ్లేషణకు సంబంధించి రెండు ఉజ్వల అనుభవాలున్నాయి.

మొదటిది ఆధునిక తెలుగు సాహిత్యానికి ఆద్యులలో ఒకరయిన గురజాడ అప్పారావు కన్యాశుల్క ఆచారం మీద 1880లో జరిపిన పరిశోధన. విజయనగరం సంస్థానంలో బ్రాహ్మణ కుటుంబాలలో కన్యాశుల్క సంప్రదాయం ఎట్లా పసిపిల్లల అమ్మకానికి దారితీస్తున్నదో, అది ఎంత దుర్మార్గమో గుర్తించి దాని గురించి ప్రజలను చైతన్య పరచడానికి గురజాడ 'కన్యాశుల్కం' రాశారు. వంద సంవత్సరాల తర్వాత కూడ నిత్యనూతనంగా, సజీవంగా నిలిచిన 'కన్యాశుల్కం' నాటక ప్రామాణికతకు మూల కారణాలలో అది నిర్దిష్టమైన సామాజిక పరిశోధన మీద ఆధారపడడం ఒకటి.

హైదరాబాద్ రాజ్యంలో 1940లలో అటువంటి సామాజిక పరిశోధనకి పూనుకున్నవారు వట్టికోట ఆళ్వారుస్వామి, బద్దం ఎల్లారెడ్డి. అప్పటి గద్వాల సంస్థానంలో రైతుల మీద సంస్థానాధిపతులు చేస్తున్న అరాచకాలనూ, విధిస్తున్న అధిక పన్నులనూ కనిపెట్టడానికి వారు సామాజిక ఆర్థిక విశ్లేషణ సాగించారు. ఒకవైపు గద్వాల సంస్థానాధీశులే ఆ పరిశోధనకు ఆర్థిక సహాయం అందించినప్పటికీ, క్షేత్రస్థాయిలో వారికి వ్యతిరేకమైన సమాచారమూ, నిర్ధారణలూ వస్తే నిర్మొహమాటంగా ఆ నిర్ధారణలనే ప్రకటించి, క్షేత్రస్థాయిసమాచారాన్నీ, నిర్ధారణలనూ యథాతథంగా ప్రకటించడమే పరిశోధకుల నిజాయితీకి చిహ్నమని చూపారు.

ఆ తర్వాత తెలుగుసీమలో విశ్వవిద్యాలయాలూ, సామాజిక శాస్త్ర శాఖలూ, విభిన్న సైద్ధాంతిక దృక్పథాలూ, విభిన్న సంవిధానాలూ వచ్చి గణనీయమైన పరిశోధన జరిగింది. ఇలా రాశి పెరిగే క్రమంలో వాసి తగ్గిన పరిస్థితి కూడా వచ్చింది. కొన్నిసార్లు దృక్పథానిదే పైచేయి అయి, సామాజిక వాస్తవాలను తారుమారు చేయడం కూడ జరిగింది. కొన్నిసార్లు సంవిధానాన్ని మరింత, మరింత సూక్ష్మంగా చెక్కుతూపోయి అసలు ఆ సంవిధానాన్ని ఏ పరిశోధన కోసం ఉపయోగిస్తున్నారో మరిచిపోవడం కూడ జరిగింది. మరొకవైపు విభిన్న ప్రజా ఉద్యమాలు చెలరేగి, ఆ ఉద్యమాలకు మూలమైన సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సమస్యల గురించి పరిశోధించవలసిన అవసరం విపరీతంగా పెరిగిపోయింది. ఉద్యమాలు ఎందుకు వస్తున్నాయో, ఏ వర్గాల ఆకాంక్షల ప్రతిఫలనంగా వస్తున్నాయో, ఏ మార్గాలలో నడుస్తున్నాయో పరిశోధించడం సామాజిక శాస్త్రవేత్తల కర్తవ్యాలలో ఒకటయింది. అంటే సమాజం సామాజిక శాస్త్రవేత్తల ద్వారా తనను గురించి తాను తెలుసుకోదలచుకోవడం ఎక్కువ అయింది.

ఈ నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్ సమాజం ముందర ఉన్న సమస్యలు ఏమిటో, ఆ సమస్యలను ఎట్లా అర్థం చేసుకోవాలో, వాటి పరిష్కార దిశగా ఎటువంటి ఆలోచనలు చేయాలో తెలుసుకోవడానికి నిశితమైన, ప్రత్యేకమైన పరిశోధన జరపాలనీ, ఆ పరిశోధనలో విశిష్టమైన సంవిధానాన్ని ఉపయోగించాలనీ, ఈ పని కేవలం వృత్తి, ఉద్యోగాలలో పదోన్నతి పొందే, పట్టాలు సంపాదించే కృషిగా కాక, పరిశోధకులకు అభినివేశం, ఆసక్తి ఉండేలా, సమాజానికి ఉపయోగపడేలా సాగాలని, ఆ దిశలో స్వల్పకాలిక పరిశోధన కొరకు ఉపకార వేతనాలు ఇవ్వాలని సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సిడిఆర్‌సి), వీక్షణం, రాజకీయార్థిక సామాజిక మాసపత్రిక భావించాయి.

ఆ పనిలో భాగంగా ఇచ్చిన ప్రకటన "తెలుగుసమాజం తన గురించి తాను చేసుకునే అన్వేషణకు మార్గాలు కల్పించడానికీ, ఆ అన్వేషణను వ్యక్తీకరించడానికీ ఏర్పడిన సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సిడిఆర్‌సి), రాజకీయార్థిక సామాజిక మాసపత్రిక వీక్షణం తెలుగునాట సామాజిక పరిశోధనా రంగంలో కొత్త వెలుగులు ప్రసరింపజేయడానికి ఒక కొత్త ప్రయోగానికి పూనుకుంటున్నాయి. తెలుగు సమాజంలో వివరమైన, లోతయిన పరిశోధన అవసరమయిన అనేక సమస్యలపై తగిన సమయం తీసుకుని పరిశోధన జరపడం కొరకు స్వల్పకాలిక ఉపకార వేతనాలను ప్రకటిస్తున్నాయి.

అనంతపురం కరువు, మహబూబ్‌నగర్ వలసలు, నల్లగొండ ఫ్లోరైడ్, నల్లమల చెంచుల దుర్భర జీవనం, కడప యురేనియం, సిరిసిల్ల చేనేత కార్మికుల ఆత్మహత్యలు, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ వల్ల మూతబడిన పరిశ్రమల కార్మికుల వెతలు, రైతుల ఆత్మహత్యలు, బాక్సైట్ తవ్వకాలు, వన్ ఆఫ్ సెవెంటీ చట్టం, హైదరాబాద్ పరిసర భూములు, కొల్లేరు ఆక్రమణలు, పోలవరం .... ఆంధ్రప్రదేశ్‌లో వివరంగా అధ్యయనం చేయవలసిన సామాజిక, రాజకీయార్థిక అంశాలకు కొదవలేదు. ఇవి కాక మరెన్నో సామాజిక అంశాలు కూడ ఉండవచ్చు. కాని ఈ అంశాలలో చాలా వాటిపైన అడపాదడపా పత్రికావ్యాసాలు, వార్తలు తప్ప వివరమైన, సమస్యను అన్ని కోణాల నుంచి చర్చించే పూర్తి స్థాయి అధ్యయనాలు లేవు" అని అభిప్రాయపడింది.

తెలుగునాట సామాజిక పరిశోధనా రంగంలో కొత్త ప్రయోగంగా ప్రారంభమైన ఈ కృషికి సహకరించడానికి ఎందరో పరిశోధకులు ముందుకు వచ్చారు. సిడిఆర్‌సి – వీక్షణం కార్యాలయానికి అనేక దరఖాస్తులు వచ్చాయి. ఇటువంటి సామాజిక పరిశోధన జరపడంలో తమకు ఆసక్తి ఉన్నదని ఏకవాక్య అభ్యర్థన తెలిపిన వారి నుంచీ, సవివరమైన ప్రతిపాదనలూ, దరఖాస్తులూ పంపిన వారి దాకా ఎందరో మిత్రులు ఈ కృషిలో భాగం పంచుకోవడానికి తమ ఉత్సాహాన్నీ, ఆసక్తినీ ప్రకటించారు. తెలుగు సమాజానికి తనను గురించి తాను తెలుసుకోవడానికి ఉన్న శ్రద్ధాసక్తులు నిజంగా ప్రశంసనీయంగా, ఆశాజనకంగా ఉన్నాయి. ఈ ప్రతిపాదనలలో ఎంపిక చేసిన ప్రతిపాదనలను పంపిన పరిశోధకులతో విడివిడిగా చర్చించి, ఆయా రంగాలలో చేయవలసిన పరిశోధన పరిధినీ, పరిమితులనూ, సంవిధానాన్నీ, ప్రశ్నపత్రాలనూ, అధ్యయనం చేయవలసిన విషయాలనూ నిర్ధారించడానికి సిడిఆర్‌సి – వీక్షణం బృందం ఆయా పరిశోధకులతో త్వరలోనే సమావేశం కానున్నది. ఈ లోగా తెలుగు సమాజంలో పరిశోధించ వలసిన కొత్త అంశాలలో కొన్నిటి గురించి పాఠకులతో పంచుకోదలిచాం.

❖ నెల్లూరు జిల్లాలో తడ, నాయుడుపేట, కృష్ణపట్నం ప్రాంతాలలో ప్రత్యేక ఆర్థిక మండలాలు రాబోతున్నాయి. అక్కడి ప్రజలు, రైతులు ఈ ప్రత్యేక ఆర్థిక మండలాల వల్ల ఎదుర్కోబోతున్న సమస్యలను గురించి ప్రత్యేక పరిశోధన చేయడానికి ఒక ప్రతిపాదన వచ్చింది. దేశవ్యాప్తంగానూ, రాష్ట్రంలోనూ ఎన్నో ప్రత్యేక ఆర్థిక మండలాలు రాబోతున్నప్పటికీ, ఈ సూక్ష్మస్థాయి, క్షేత్రస్థాయి అధ్యయనం వ్యవసాయం నుంచి పరిశ్రమలకు, సేవారంగానికి జరగబోతున్న పరివర్తన క్రమంలో ఎవరి ప్రయోజనాలు దెబ్బ తినబోతున్నాయో, ఎవరికి లాభాలు చేకూరబోతున్నాయో తేల్చగలుగుతుంది.

❖ అభివృద్ధి పథకాలు అనబడే వాటికొరకు ప్రజలు త్యాగం చేయవలసి ఉంటుందనీ, కొందరు నిర్వాసితులు కాకుండా సమాజ అభివృద్ధి సాధ్యం కాదనీ ఒక ప్రచారం జరుగుతోంది. రెండు మూడు దశాబ్దాల కింద ఆంధ్రప్రదేశ్‌లో అమలయిన ఒక అభివృద్ధి పథకాన్ని, ఉదాహరణకు ఒక నీటిపారుదల ప్రాజెక్ట్‌ను తీసుకుని దానివల్ల నిర్వాసితులయిన కుటుంబాలకు, వ్యక్తులకు ఏమి జరిగిందో, ఆ కుటుంబాలు ఎక్కడికి తరలిపోయాయో, ఎటువంటి ఉపాధిని సంపాదించుకున్నాయో, పాత జీవనస్థితితో పోలిస్తే ప్రస్తుతం ఎటువంటి జీవనస్థితిలో ఉన్నాయో ఒక పరిశోధన మదింపు వేస్తుంది.

❖ రైతుల ఆత్మహత్యలు నిరాటంకంగా జరిగిపోతున్న నేపథ్యంలో ఒక పరిశోధన ఒక ప్రత్యేక గ్రామాన్ని, లేదా కొన్ని గ్రామాలను తీసుకుని, అక్కడ ఏయే రైతులు ఏయే కారణాలవల్ల ఆత్మహత్యలు చేసుకున్నారో, ఆ ఆత్మహత్యలవల్ల ఆ కుటుంబాలకు ఏమి జరిగిందో తెలుసుకుంటుంది. ఆ క్రమంలో గ్రామీణ వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పులు, పంటలలో వచ్చిన మార్పులు, మార్కెట్‌తో అనుసంధానం, పెట్టుబడులు, గిట్టుబాటుధరలు, కుటుంబ ఆర్థిక సామాజిక స్థితి, సాంస్కృతిక అవసరాలు వంటి అంశాలను కూడ పరిశోధనా పరిధిలోకి తీసుకురావడం జరుగుతుంది.

❖ ఆధునిక మార్కెట్ సరుకులు గ్రామీణ ప్రాంతాలలోకి ప్రవేశించడం వల్ల గ్రామీణ చేతివృత్తుల కుటుంబాలు చితికిపోతున్నాయని, ఆయా వృత్తులు చేసే వారు పట్టణాలకు వలస వచ్చి కూలీలుగా మారిపోతున్నారని ఒక అభిప్రాయం ఉంది. ఒక పరిశోధన ఒక గ్రామంలో, లేదా కొన్ని గ్రామాలలో చేతివృత్తుల కుటుంబాలు ఎన్ని ఉన్నాయో, వారి జీవనస్థితి ఎట్లా ఉన్నదో, చేతివృత్తులు ప్రస్తుతం మనుగడకు సరిపోయేలా ఉన్నాయో లేవో, చేతివృత్తులవారి వలసలు ఏ రంగాలకు, ఏ వృత్తులకు సాగుతున్నాయో పరిశీలిస్తుంది.

❖ ఒక కోస్తా జిల్లాలో పత్తి ప్రధాన పంటగా ఉండడం వల్ల గత నాలుగు దశాబ్దాలుగా జిన్నింగ్, ప్రెస్సింగ్, కాటన్ సీడ్ ఆయిల్, స్పిన్నింగ్ మిల్లుల వ్యవస్థ ఏర్పడి ఇరవై వేలమంది కార్మికులకు ఉపాధి కల్పించాయి. ఈ మిల్లులలో కార్మికుల పని పరిస్థితులు దారుణంగా ఉండడం మాత్రమే గాక, వస్త్ర పరిశ్రమలో మారుతున్న సాంకేతిక పరిజ్ఞానం వల్ల, పంటల పద్ధతి మారిపోవడం వల్ల భవిష్యత్తులో ఈ స్పిన్నింగ్ మిల్లులకు ఏమి జరుగుతుందో తెలియని అనిశ్చిత పరిస్థితి ఏర్పడింది. ఒక పరిశోధన ఈ వ్యవసాయాధార పరిశ్రమ బాగోగులను నిర్ధారిస్తుంది.

❖ ఇప్పటికీ ఆహారసేకరణ దశలోనే ఉన్న చెంచుల అభివృద్ధి కొరకు తయారుచేస్తున్న వ్యూహాలు చెంచుల అభివృద్ధికి ఎందుకు దారితీయడం లేదు, చెంచుల జీవనమూలాలలోనే వారి సామాజిక ప్రయాణంలోని ఒడిదుడుకులకు కారణాలున్నాయా, బైటినుంచి ఒక చోదకశక్తి లేకపోతే మార్పు రాని ఒక సామాజిక స్థితికి చెంచు వ్యవస్థ ఒక నిదర్శనమా, లోపలి నుంచి వారిలో మార్పు ఎందుకు రావడంలేదు వంటి ప్రశ్నలకు జవాబులు అన్వేషించడానికి ఒక పరిశోధన పూనుకుంటున్నది.

అతి త్వరలో ప్రారంభమై, కొద్దిరోజుల్లో వీక్షణంలో రచనల రూపంలోనూ, విడిగా పుస్తకాల రూపంలోనూ వెలువడనున్న సామాజిక పరిశోధనా కార్యక్రమంలో కొన్ని ఆసక్తికరమైన ప్రతిపాదనలివి. ఈ సామాజిక పరిశోధనా కార్యక్రమం నిరంతరం సాగుతూ ఉంటుందని, పాఠకులు, పరిశోధకులు ఎప్పుడైనా తమ ప్రతిపాదనలను, సూచనలను పంపవచ్చునని ఆహ్వానిస్తున్నాం. ◆

## 'మేడే' కానుక


హ్యూగో చావెజ్

మే 1న వెనిజులాలో ప్రజామోదమైన మార్పులు సంభవించాయి. దాదాపు పదేళ్లుగా ప్రైవేటీకరించబడి ప్రజలకి అందకుండా పోయిన చమురు నిల్వలు, వాటి నుండి వచ్చే ఆదాయం తిరిగి ప్రజలకే చెందేలా వెనిజులా అధ్యక్షుడు హ్యూగో చావెజ్ చమురు నిల్వలను జాతీయం చేసారు. దీని ఫలితంగా వెనిజులాలోని చమురు నిల్వలన్నిటిపైనా జాతీయ కంపెనీ అయిన పి.డి.వి.ఎస్.ఎ. కి 60 శాతం హక్కు ఉంటుంది. ఈ సందర్భంగా మే 1 రాత్రి చమురు పరిశ్రమలో పని చేసే కార్మికులందరూ సంతోషంగా పండుగలు జరుపుకొన్నట్లు రాయిటర్స్ సంస్థ రిపోర్ట్ చేసింది. ప్రపంచ బ్యాంకు, ఐ.ఎం.ఎఫ్.ల నుంచి కూడా వెనిజులా తప్పుకొంటున్నట్లు చావెజ్ ఈ సందర్భంగా ప్రకటించారు. తమ దేశం ఈ రెండు సంస్థల నుంచి తీసుకున్న అప్పులన్నీ ఏప్రిల్ 13 కే తీర్చేసిందనీ, ఇక ఈ రెండు సంస్థలలోనూ కొనసాగబోదనీ తేల్చిచెప్పారు. ఐ.ఎం.ఎఫ్ తమకివ్వాల్సిన 3.9 బిలియన్ డాలర్లూ తిరిగి ఇచ్చేయాలని చావెజ్ డిమాండ్ చేసారు. ◆

## ఇదీ సంగతి


పాల్ వోల్ఫోవిట్జ్

ఇరాక్ యుద్ధానికి ప్రధాన బాధ్యులలో, అమెరికాలోని నయా మితవాదులలో ఒకడైన పాల్ వోల్ఫోవిట్జ్ గత రెండేళ్లుగా ప్రపంచ బ్యాంక్ అధ్యక్షుడుగా పని చేసి జూన్ 30న ఆ పదవి నుంచి తప్పుకోబోతున్నాడు. దీనికి కారణం ఆయనతో సంబంధం ఉన్న ప్రపంచ బ్యాంక్ సహ ఉద్యోగి షాహారెజా కు నియమాలకు వ్యతిరేకంగా జీతం పెంచి, ప్రమోషన్ ఇవ్వడం. వోల్ఫోవిట్జ్ చేసింది ప్రపంచ బ్యాంక్ నియమాలకు విరుద్ధమని బ్యాంక్ వేసిన ఎథిక్స్ కమిటీ తీర్పు నివ్వడంతో ఆయనను తొలగించాలని బ్యాంక్‌లోని అన్ని దేశాల ప్రతినిధులు గట్టి పట్టు పట్టారు. ఈ సమస్య బయటపడినప్పటి నుంచీ వోల్ఫోవిట్జ్‌ను సమర్థిస్తూ వచ్చిన అమెరికన్ ప్రభుత్వం కూడా చివరికి ఈ నిర్ణయాన్ని ఒప్పుకోవాల్సి వచ్చింది. ఇరాక్ యుద్ధానికి, ఆ దేశంలో లక్షలాదిమంది చావులకి కారణమైనందుకు వోల్ఫోవిట్జ్ ఎలాంటి విచారణనూ ఎదుర్కోలేదు. కనీసం ఈ తప్పుకైనా పదవి నుంచి తప్పుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ప్రపంచ బ్యాంక్ అధ్యక్ష పదవికి అమెరికన్లే కాకుండా వేరే దేశస్తులు ఎందుకు కాకూడదన్న వాదన అంతటా వినబడుతోంది. ◆

## ఫ్రాన్స్ ఎన్నికలు - 2007


నికొలాస్ సార్కోజీ

ఫ్రెంచ్ అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల్లో యూ.ఎన్.పి. అభ్యర్థి నికొలాస్ సార్కోజీ, తన ప్రత్యర్థి సెగొలీన్ రాయల్ (సోషలిస్ట్) పై గెలిపొందారు. సెగొలిన్ రాయల్ ఫ్రాన్స్ అధ్యక్ష పదవికి పోటీ చేసిన మొట్టమొదటి మహిళ. మొదటి విడత జరిగిన పోలింగ్‌లో ముందెన్నడూ లేనంతగా 85 శాతం ప్రజలు పాల్గొన్నారు. వీటిలో సార్కోజీకి 31 శాతం, రాయల్‌కి 26 శాతం ఓట్లు వచ్చాయి. అతివాద జాతీయవాది లీపెన్ కి 10 శాతం ఓట్లు మాత్రమే వచ్చాయి. రెండో విడత పోలింగ్‌లో సార్కోజీ 53 శాతం ఓట్లు పొంది గెలుపొందారు. సార్కోజీ గెలుపుతో ఫ్రెంచ్ రాజకీయాలు వామపక్షం వైపు నుంచి మితవాదం వైపు మలుపు తీసుకున్నాయి. చిరాక్ ప్రభుత్వంలో మంత్రిగా పని చేసినప్పుడే సార్కోజీ కార్మికులనీ, విద్యార్థులనీ, ముఖ్యంగా అరబ్ దేశాల నుంచి వలసవచ్చిన యువతనూ తన మాటలతో, చేతలతో, విధానాలతో చాలా రెచ్చగొట్టి ఉన్నాడు. ఎన్నికల ప్రచారంలో సార్కోజీ ప్రస్తావించిన మార్పులన్నీ ఫ్రాన్స్‌లో ప్రస్తుతానికి ఉన్న వామపక్ష-ఉదారవాద సంస్థలను, భావాలను దెబ్బతీసేవిగా ఉన్నాయి. కార్మికుల, విద్యార్థుల, వలస వచ్చిన వారి హక్కులను దెబ్బతీసే విధంగా, ఫ్రాన్స్‌లో ఉన్న సంక్షేమ రాజ్యాన్ని బలహీనపరిచే విధంగా సార్కోజీ పాలన ఉండవచ్చు. ఇరాక్ యుద్ధ సమయంలో అమెరికాని వ్యతిరేకించిన ఫ్రాన్స్ ఇప్పుడు బ్రిటన్‌లాగా, జర్మనీలాగా అమెరికా నీడలోకి వెళ్లిపోయే అవకాశం ఉంది. ◆


సెగొలిన్ రాయల్

**వచ్చే సంచికలో...**

- ❖ ఫోకస్ - నీటి పారుదల పథకాలు - వివాదాలు
- ❖ మా ఊరికి దెయ్యం పట్టింది - పులుగుజ్జు సురేష్
- ❖ విద్యారంగాన్ని వధ్యశిలపై నిలిపిన కాంగ్రెస్ ప్రభుత్వం - ఎస్. గోవిందరాజులు
- ❖ పూంఛీ కమిషన్ - కేంద్ర - రాష్ట్ర సంబంధాలు - సి.ఎచ్. దినేష్ కుమార్, వంగారి భూమయ్య

- ❖ అగస్ట్ 2007 సంచిక ఫోకస్ - అరవై సంవత్సరాల స్వాతంత్ర్యం

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేదీ | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 26.4.07 నుండి 2.5.07 | 14 | – | 11 | – | – | – | 7 | 7 | – | 2 | 38 | 16 | 1 | 2 | – | – | 9 | 19 |
| 3.5.07 నుండి 9.5.07 | 3 | – | 17 | 1 | – | – | 6 | 6 | – | 1 | 38 | 25 | 6 | – | – | – | 5 | 43 |
| 10.5.07 నుండి 16.5.07 | 8 | – | 22 | – | – | – | 8 | 12 | – | 3 | 54 | 13 | – | – | – | – | 8 | 128 |
| 17.5.07 నుండి 25.5.07 | 14 | – | 12 | 1 | – | – | 5 | 4 | 1 | 3 | 12 | 19* | 2 | – | 9* | – | 1 | 196 |
| మహబూబ్‌నగర్ | 3 | – | 25 | – | – | – | 16 | 11 | 2 | 7 | 50 | 26 | 10 | – | – | – | – | 15 |
| మెదక్ | 3 | – | – | – | – | – | 2 | – | 3 | – | – | – | 2 | – | – | – | – | 15 |
| కడప | 3 | – | 6 | 2 | – | – | 4 | 1 | – | – | 11 | 2 | – | – | – | – | – | – |
| రంగారెడ్డి | 3 | – | 37 | – | – | – | 14 | 13 | – | 1 | 36 | 30 | 2 | – | – | – | 4 | 10 |
| **మొత్తం** | **51** | **–** | **130** | **4** | **–** | **–** | **62** | **54** | **6** | **17** | **239** | **131** | **23** | **2** | **9** | **–** | **27** | **426**** |

* మక్కా మసీదులో జరిగిన బాంబు పేలుడులో ఆరుగురు, తదనంతర పోలీసు కాల్పుల్లో తొమ్మిది మంది చనిపోయారు. ** వడదెబ్బ వలన చనిపోయారు

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ – డి. విజయభాస్కర్; మహబూబ్‌నగర్ – రవికుమార్; మెదక్ – కె. రాజు; కడప – ఎన్. ఎస్. ఖలందర్; రంగారెడ్డి – వి. ఫణీంద్ర

గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.

# విడుదలైన ఏడాదిలో ఐదవ ముద్రణ!

## మీ ఆత్మీయ స్పందనకు మా హృదయపూర్వక ధన్యవాదాలు

- వీక్షణం పబ్లికేషన్స్




వెల రూ.50/-

ప్రపంచ బ్యాంక్ వంటి అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు పేద దేశాల అవసరాలు పెంచి, కొత్త అవసరాలు సృష్టించి ఆ అవసరాలు తీర్చుకునేందుకు ఇబ్బడిముబ్బడిగా అప్పులు ఇచ్చే కుట్ర, బహుళ జాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చేందుకు ఉద్దేశించిన ఓ అంతర్జాతీయ కుట్ర ఇప్పుడు బట్టబయలైంది. 'ఎకనామిక్ హిట్‌మాన్' అనే ఆర్థిక దళారీలను నియమించి, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభుత్వాధినేతలను ప్రలోభపెట్టి, ఆ దేశాలను అమెరికన్ సామ్రాజ్య వాదానికి బంట్లుగా మార్చేసిన ఈ కుట్ర గుట్టు విప్పారు జాన్ పెర్కిన్స్. స్వయంగా ఎకనామిక్ హిట్‌మాన్‌గా పనిచేసి ఇప్పుడు చేతికంటిన సామాన్యుల రక్తాన్ని పశ్చాత్తాపంతో కడుక్కోవాలనుకుంటున్న పెర్కిన్స్ అంతరంగ కథనమే ఈ సంచలనాత్మకమైన పుస్తకం.

**కాపీలు లభించు షాపులు :**

**హైదరాబాద్** : ప్రజాశక్తి బుక్ హౌస్, దిశ పుస్తక కేంద్రం - చిక్కడపల్లి, సాహిత్య నికేతన్ - బర్కత్‌పుర నవోదయా బుక్ షాప్ - కోఠి, తెలుగు బుక్ షాప్ - కోఠి, సహచర బుక్ మార్క్ - బాగ్‌లింగంపల్లి.

**విజయవాడ** : ప్రజాశక్తి బుక్ హౌస్, మైత్రి బుక్ హౌస్, సాహిత్య నికేతన్

**నెల్లూరు** : మణి బుక్ స్టాల్ - సండే మార్కెట్, గుంటూరు - అష్టలక్ష్మీ పుస్తక భండార్

**విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు, ఖమ్మం, హన్మకొండ, నల్గొండ** } ప్రజాశక్తి బుక్ హౌస్

ఎం.ఓ / డి.డి కింది అడ్రస్‌కు పంపి కూడా మీ కాపీ పొందవచ్చు.

### మీ సామాజిక స్ఫూర్తికి మా వంతు సహకారం

పుస్తకం చదివి అమితంగా ప్రభావితం అయిన కొంతమంది పాఠకులు పుస్తకాన్ని తమ మిత్రులకు, శ్రేయోభిలాషులకు బహూకరించాలని నిర్ణయించుకున్నారు. ఉపాధ్యాయ, ఉద్యోగ, ట్రేడ్ యూనియన్ సంఘాలకు చెందిన వారు కూడా ఇలా పెద్దమొత్తంలో కాపీలు కొనుగోలు చేశారు. హైదరాబాద్‌లో ఇద్దరు పాఠకులు చెరి వందకాపీలు కొనుగోలు చేసి తమ సామాజిక స్ఫూర్తిని చాటుకున్నారు.

మీరూ 'ఒక దళారీ పశ్చాత్తాపం' పుస్తకాన్ని ఇలా మీ మిత్రులకు, శ్రేయోభిలాషులకు బహూకరించదలుచుకుంటే మమ్మల్ని సంప్రదించండి. ఎక్కువ కాపీలు తీసుకునే వారికి ఇప్పుడు భారీ తగ్గింపు ఇస్తున్నాం.



**వీక్షణం పబ్లికేషన్స్**
3-6-394, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్-500 029. ఫోన్-ఫ్యాక్స్: 040-5584 3495

RNI Regn. No. APTEL/2003/11482 Published on 27-05-07 PRINTED BOOK








# తొలి అడుగు విజయవంతం!
# మూడేళ్ళ అడుగులు ప్రగతికి అంకితం!!





## ఇవన్నీ వినూత్న పథకాలే - ముఖ్యమంత్రి ఆశయానికి చిహ్నాలే

- **జలయజ్ఞం** - 52 భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల ద్వారా 1 లక్ష కోట్ల రూపాయలతో కోటి ఎకరాలకు సాగునీరు
- **'ఇందిరమ్మ'** - గ్రామాలకు, పట్టణాలకు మౌలిక వసతులు కల్పించి, నిర్ణీత సమయంలో ఆదర్శ గ్రామాలుగా తీర్చిదిద్దడం
- **'ఆరోగ్యశ్రీ'** - పేదవారికి ఆరోగ్య బీమా మూడు జిల్లాల్లో ప్రారంభం
- **ఉచిత విద్యుత్** - వ్యవసాయానికి 7 గంటల విద్యుత్ సరఫరా
- **'ఇందిరా క్రాంతి పథం'** - స్వయం సహాయక బృందాలలోని మహిళలకు పావలా వడ్డీకే రుణాలు
- **'ఉపాధి హామీ పథకం'** - గ్రామీణ ప్రాంతాల నిరుపేదలకు ఒక్కొక్కరికి ఏటా కనీసం 100 రోజుల పనిదినాలతో శ్రామిక ఉపాధిని కల్పించడం
- **రాజీవ్ పల్లెబాట, రాజీవ్ నగరబాట, ప్రజాపథం** కార్యక్రమాల ద్వారా ప్రజా సమస్యలకు తక్షణ పరిష్కారం
- **'ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ'** - 2006-2007 సం॥లో రూ.17,529 కోట్ల IT/ITES ఎగుమతులతో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా ఉండటం
- **'రాజీవ్ గృహకల్ప'** - దేశంలోనే మొట్టమొదటిసారిగా పట్టణ నిరుపేదలకు గృహ సౌకర్యం
- **'రాజీవ్ స్వగృహ'** - దేశంలోనే మొట్టమొదటిసారిగా మధ్య తరగతి ప్రజలకు గృహ సౌకర్యం
- **'పేదలకు భూమి పంపిణీ'** - ఎస్.సి., ఎస్.టి., బి.సి.లకు చెందిన 3,14,685 లక్షల మంది నిరుపేదలకు 4,37,019.86 ఎకరాల భూమిని మూడు విడతలుగా పంపిణీ జరిగింది
- **'ఇందిర ప్రభ'** - రూ.500 కోట్లతో ఎస్.సి., ఎస్.టి,బలహీన వర్గాలకు చెందిన బంజరు భూమి అభివృద్ధి.

**పేద గుండెకు అండగా! ప్రగతి సాధనే ధ్యేయంగా!!**

R.O.No. 70/Sou/Advt.I/2007-08

Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 66843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Working Editor : N. Venugopal

**VEEKSHANAM**
301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayatnagar, Hyd-29.